


ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

నవంబర్ చతుర నవల **గాజురాళ్లు**

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................



# ఏనుగు సోఫా

లోరా అనే ఈ ఏనుగుగారి బరువు 5000 పౌండ్లు మాత్రం. కొత్తరకం లామినేటెడ్ రబ్బర్‌తో, ప్రత్యేకంగా 'లోరా'గారి బరువును తట్టుకోగల విధంగా తయారుచేసిన ఈ సోఫాను అమెరికాలోని 'హైపాయింట్' అనే జూలో ఉంటున్న ఈ గజరాజానికి కేటాయించారు.

# చతుర కత్తెరి!



## పెద్ద చేప

"ఏమైంది. ఏమన్నాడు?" నీరసంగా బయటికి వస్తున్న అప్పారావుని ప్రశ్నించాడు గురునాధరావు.

"ఏమౌతుంది. వాడు తినేది అన్నమా? గడ్డా? వాడు ప్రకటించిన పోస్టుకి అన్ని అర్హతలూ నాకు ఉన్నాయి. ఇంటర్వ్యూలో నేనే బాగా చేశాను. అయినా ఆ పోస్టు నాకు రావాలంటే పదివేలు లంచంగా ఇవ్వాలట. ఇది ఏమైనా న్యాయమా?" ఆవేశాన్ని అదుపులో పెట్టుకుంటూ అడిగాడు అప్పారావు.

"ఈ ఆఫీసులో వీడు బాసుగా వచ్చినప్పటినుంచి ఈ అన్యాయం ఇలా సాగుతూనే




ఉంది బాబూ. ఈ ఆఫీసులో నేనే సీనియర్ని. ఈ ఆఫీసర్ పోస్టు నాకే ఇవ్వాలి. ఆఫీసర్ పోస్టు నాకే వచ్చివుంటే నీలాంటి ఎందరికో న్యాయం జరుగును. కానీ పైస్థాయిలో ఎందరికో లంచాలు ఇచ్చి నాకు రావలసిన ఈ పోస్టు వాడు కొట్టేశాడు" బాధగా అన్నాడు గురునాధరావు.

"మీ ఆఫీసర్ పోస్టు సంగతి సరే. నా గతి ఏమిటి?" ప్రశ్నించాడు అప్పారావు.

"దానికే నేను ఒక మాస్టర్ ప్లాన్ ఆలోచించాను. ఈ లంచగొండి సంజీవరావు ఈ ఆఫీసులోనుంచి తప్పుకుంటేగాని నీలాంటి నాలాంటివాళ్లకి న్యాయం జరగదు. అందుకే ఈ పదివేలు పట్టుకొనివెళ్లి నువ్వు ఇస్తున్నట్టుగా ఆఫీసర్ సంజీవరావుకి ఇవ్వు" అని జేబులోనుంచి ఒకనోట్ల కట్టతీసి అప్పారావుకి ఇచ్చాడు గురునాధరావు.

"మీ డబ్బు ఆయనకి లంచంగా ఇవ్వమంటారా?" తెల్లబోతూ అడిగాడు అప్పారావు.

"నువ్వు ఈ డబ్బు ఆఫీసర్‌గారికి ఇవ్వు. మిగిలిన సంగతి నేను చూసుకుంటా" అప్పారావుని ప్రోత్సహించి పంపించాడు గురునాధరావు.

లోపలికి వచ్చిన అప్పారావుని సాద

---

కవర్‌ఫొటో: వి. సత్యమూర్తి

రంగా ఆహ్వానించాడు సంజీవరావు. చేతిలో ఉన్న నోట్లకట్ట సంజీవరావుకి అందించాడు అప్పారావు.

"అప్పుడే డబ్బు సర్దుబాటు అయిందా? వెరీగుడ్. అసాధ్యుడివే. వెళ్ళిరా ఆ క్లర్కు పోస్టు నీకే. వారంరోజుల్లో ఆర్డర్స్ వస్తాయి. అందుకుని జాయిన్ అయిపో' ఆప్యాయంగా ఆ నోట్లకట్టని ముద్దుపెట్టుకుంటూ అన్నాడు సంజీవరావు.

ఇంతలో స్ప్రింగ్‌డోర్ విసురుగా తెరుచుకుంది. పదిమంది బిలబిలమంటూ లోపలికి వచ్చారు. వాళ్లు అవినీతి నిరోధకశాఖ ఆఫీసర్లు అని తెలుసుకున్న వెంటనే స్పృహ తప్పాడు సంజీవరావు. నీళ్లుజల్లి స్పృహ తెప్పించి సంజీవరావుని అరెస్టు చేసి తీసుకు వెళ్ళారు అవినీతి నిరోధకశాఖనుంచి వచ్చిన అధికారులు. అప్పటికప్పుడే తాత్కాలికంగా ఆఫీసర్‌గా ఛార్జి తీసుకున్నాడు గురునాధరావు. హడావుడి తగ్గాక గురునాధరావుని కలిశాడు అప్పారావు. అప్పారావుని సాదరంగా ఆహ్వానించాడు గురునాధరావు.

"ఈ తతంగం అంతా నడపడానికి నాకు లక్షదాకా ఖర్చు అయిందోయ్ అప్పారావు. పైగా ఈ పోస్టు పర్మినెంట్‌గా నాకు రావాలంటే మరో రెండులక్షల ఖర్చు ఉంది. ఇరవైవేలు పట్టుకుని రేపు కనపడు. ఆ క్లర్కు పోస్టు నీకే' అన్నమాటకి స్పృహ తప్పాడు అప్పారావు.

-కాశీభట్ల భానుమూర్తి

## ప్రిస్టేజ్

**తేజా** కారు ర్యాష్‌గా నడిపి యాక్సిడెంటు చేశాడని ఆలకించి నిర్ఘాంతపోయాను నేను.

నిర్ఘాంతపోయింది తేజాకి యాక్సిడెంటు అయినందుకు కాదు- వాడు ర్యాష్‌గా డ్రయివ్ చేశాడంటేను!

నా ఆప్తమిత్రుడు తేజాకి ముప్ఫయ్యేళ్లుంటాయి. చిన్నతరహా పరిశ్రమ ఒకటి ఆరంభించాడు. వాడు బిజినెస్‌లో ఎంత ఫాస్టో- కారు డ్రయివింగులో అంత స్లో! వాడి స్పీడెప్పుడూ ఇరవైకి మించదు. అదేమిరా అంటే, 'నిదానమే ప్రధానం... బెటర్ లేట్ దేన్ నెవర్...' అంటూ నీతులు చెబుతాడు. అటువంటి తేజ ర్యాష్‌గా డ్రయివ్ చేశాడంటే, అది మరో వరల్డ్ వండర్‌కాక మరేమిటి!?



వెంటనే హాస్పిటల్‌కి పరుగెత్తాను. స్పెషల్ వార్డులో కాలికీ, చేతికీ కట్లు కట్టబడి బెడ్‌మీద నిస్తేజంగా పడుకునివున్నాడు తేజ.

నన్ను చూసి జీవంలేని నవ్వు ఒకటి నవ్వాడు వాడు. " యమపురివరకూ వెళ్ళి మనసు మార్చుకుని తిరిగొచ్చేసాన్రా'' అన్నాడు.

వాడి జోక్ నాకు నవ్వు తెప్పించలేదు. జాలి కలిగించింది. 'ఎలా జరిగిందిరా ఈ ఘోరం?' అనడిగాను ఆందోళనగా.

గొంతు సవరించుకున్నాడు వాడు, "బిజినెస్ పనిమీద కారులో విజయవాడ వెళుతున్నాను. దారిలో ఓ బోర్డు కనిపించింది''

"ఏం బోర్డదీ?" కుతూహలంగా అడిగాడు.

"అదే, మోటారిస్టులకు సూచనలిచ్చే బోర్డు. అందులో- 'ఐ లైక్ యూ, బట్ నాట్ యువర్ స్పీడ్' అని రాసివుంది. దాన్ని చదివేసరికి సిగ్గేసింది నాకు. పౌరుషం కూడా వచ్చింది. ఎందుకంటే అప్పుడు నా స్పీడు ఇరవైకి మించదు. నన్ను లైక్ చేసినవారు నా స్పీడుని లైక్ చేయకపోవడం చిన్నతనమనిపించింది. అందుకే ప్రిస్టేజ్ కోసం యాక్సిలరేటర్‌ని బలంగా తొక్కాను. అంతే! ఫుల్ స్పీడులో మలుపు తిరుగుతూ ఎదుటవస్తున్న లారీని ఎవాయిడ్ చేయబోయి రోడ్డు పక్కనున్న చెట్టును గుద్దేశాను'' ఓ వెర్రినవ్వు నవ్వాడు తేజ.

అవాక్కయ్యాను నేను. ఆ బోర్డు యమ స్పీడులో బళ్ళు నడిపే డ్రయివర్లకొరకు ఉద్దేశింపబడినదనీ, వాడిలాంటి కాషస్ డ్రయివర్స్ కోసం కాదనీ చెప్పాలనిపించింది.

"మాట్లాడవేంరా, నా ఎపిసోడ్ వింటే నీకు నవ్వొస్తోందికదూ?" అడిగాడు వాడు.

"అమోఘమైన నీ తెలివికి నవ్వాలో, ఏడవాలో డిసైడ్ చేసుకోలేకుండా వున్నాను'' అని నేను జవాబివ్వడంతో, దూరదర్శన్‌లో సండే మూవీ చూసినవాడిలా ముఖం పెట్టాడు తేజ.

-తిరుమల శ్రీ.

---

## అసభ్యం

"లాభం లేదు'' పెదవి విరిచింది కౌసల్యాదేవి.

"అలా అంటే ఎలా మేడమ్?" దీనంగా అడిగాడు ప్రొడ్యూసర్ ఏకాంబరం.

"మీ సినిమాలో హీరోయిన్‌గా నటించిన అమ్మాయి వేమనగారి శిష్యురాలా? మొదటి రీలు నుండి, శుభంకార్డు వరకు మీ హీరోయిన్ వంటిమీద బట్టలు ఉన్నాయా లేవా అన్న స్పృహ లేకుండా నటించింది. సినిమాకి లక్షలకి లక్షలు ఖర్చు పెడతారు ఆ మాత్రం హీరోయిన్‌కి వంటినిండా బట్టలు చుట్టలేరా? ఆ అమ్మాయిని తొంభైశాతం నగ్నంగా చూపించి మీ పెట్టుబడికి తొంభైరెట్లు రాబట్టుకోవాలనుకుంటున్నారా? మీ సినిమాని చూసి యువతరం చెడిపోదా?" కోపంగా ప్రశ్నించింది కౌసల్యాదేవి.

"అది కాదు మేడమ్. కథాపరంగా మా హీరోయిన్ ఛాందసభావాల్ని వ్యతిరేకించే మాడ్రన్ అమ్మాయి. పైగా మా సినిమా అంతా సమ్మర్‌లో తీశాం. చమటపడుతుందని మా హీరోయిన్ వంటిమీద గుడ్డలు లేకుండానే నటించింది మేడమ్'' నసుగుతూ అన్నాడు ప్రొడ్యూసర్ ఏకాంబరం.

"అందుకే ఇప్పుడు వానాకాలం వచ్చింది కాబట్టి మీ హీరోయిన్‌కి వంటినిండా బట్టలు కట్టబెట్టి సినిమా పూర్తి చేసుకురండి. అప్పుడు ఇస్తా సెన్సార్ సర్టిఫికెట్' చెప్పింది కౌసల్యాదేవి.

"అలా అయితే నేను పూర్తిగా మునిగిపోతా మేడమ్. మొత్తం సినిమా అంతా రీషూట్ చెయ్యాలి. ఇది ఉంచి ఆ సర్టిఫికెట్ ఇప్పించండి మేడమ్'' జేబులోనుంచి ఒక




కవర్ బయటికి తీశాడు ఏకాంబరం.

"ఏమిటది? లంచమా?" తీవ్రస్వరంతో ప్రశ్నించింది కౌసల్యాదేవి.

"అన్నన్న... ఎంతమాట. ఏదో ఆడపడుచుకి ఈ అన్నయ్య కానుక. కాదనక ఈ పదివేలు తీసుకో తల్లి. అదే పదివేలు" అన్నాడు ఏకాంబరం.

"సరే... అయినా అలా నగ్నంగా నటించటానికి ఆ హీరోయిన్‌కే ఇబ్బందిగా లేనప్పుడు మీకేం, నాకేం, చూసే జనానికేం. సెన్సార్ బోర్డులో నేనే ఆడసభ్యురాల్ని. నేను ఇబ్బంది పెట్టకపోతే మిగిలిన మగసభ్యులు ఏమీ అభ్యంతరం పెట్టరు. మీ సినిమాకి రిలీజ్ డేట్ ఇచ్చేసుకుని హాయిగా వెళ్లిరండి" ఆ కవర్ అందుకుంటూ అంది కౌసల్యాదేవి ఆనందంగా.

కౌసల్యాదేవికి ఒక నమస్కారం పెట్టి బయటికి నడిచాడు ఏకాంబరం.

"లాభం లేదయ్యా. నీ సినిమాకి సెన్సార్ సర్టిఫికేట్ ఇవ్వలేం. హీరోయిన్ నగ్నంగా నటించిందంటే అది కామన్. కానీ సినిమాలో హీరో ఇంచుమించు పద్నాలుగు రీళ్లూ కట్ డ్రాయర్‌తోనే కనిపిస్తాడు. హీరో ఛాతీ చూపించి డబ్బు చేసుకుందామని ప్లానా? అది చూసి జనం చెడిపోరా? అందుకే నీ సినిమాకి సర్టిఫికెట్ ఇవ్వదలుచుకోలేదు" అన్నాడు సెన్సార్ బోర్డు మెంబర్ ఒకతను. మిగిలిన సెన్సార్ బోర్డుమెంబర్లు అందరూ అతనికి వంత పాడుతున్నట్టు తలలూపారు.

నోరు వెళ్లబెట్టి నిశ్శేష్టుడై నిలబడిపోయాడు ప్రొడ్యూసర్ ఏకాంబరం.

**-కె.బి. మూర్తి**

## బరువు

**ఎం**తోకాలంగా స్కూటర్ కొనాలని సూర్యారావు కోరిక. 'నీ పర్సనాలిటీకి స్కూటర్ బాగోదోయ్... పుల్లలా వున్నావు. స్పీడుగా వెళితే గాలికి ఎగిరిపోగలవు'. అన్న సూటిపోటీ మాటలు ఎదురైనాసరే పట్టుబట్టి కొనేశాడు.

స్కూటర్ కొనగానే తెగ పొంగిపోయింది అతని సతీమణి కాంతం.

ఇంతకాలం తను సినిమాకో, షికారుకో తీసుకెళ్లమని కో(పో)రితే "వెధవ బస్సులు




ఓ పట్టాన రావు... వచ్చినా జనంతో కిటకిట లాడతాయి. ఫ్రీగా వుండదు'' అని వంకలు పెట్టి తప్పించుకునే వాడు భర్త.

ఇకనుండీ తనను తీసుకెళ్లననడానికి సాకులు చెప్పే అవకాశం వుండబోదని వూహించిన కాంతానికి తీరని నిరాశ ఎదురైంది.

ఏరోజు చూసినా సరే భర్త ఎవరో ఒకరిని ఎక్కించుకుని తీసుకెళ్లటం కనిపించేది. తీరా అడిగితే ఎవరికో అర్జంటు పనుందంటే తీసుకెళ్లానని చెప్పసాగాడు. అవి అబద్ధాల్లాగే కనపడ్డాయి కాంతానికి.

స్కూటర్‌కొన్న పిదప ఒక్కనాడంటే ఒక్కనాడైనా తనని ఎక్కించిన పాపాన పోలేదని తీవ్రంగా విలపించేది కాంతం. అయినా సూర్యారావెటు వెళ్లినా ఎవరో ఒకరిని ఎక్కించుకుని స్కూటర్ మీద రౌండ్లు కొట్టడం మాత్రం ఆమెకి ఆగ్రహం తెప్పించింది.

చివరికి ఆ ఆగ్రహం ఆకాశాన్నంటింది. ఫలితం పక్కమీద సాధింపు మొదలెట్టింది.

"ఏమండీ! ఇన్నాళ్లయింది స్కూటర్ కొని... మునుపైతే బస్సులు, బాధలు అంటూ కుంటిసాకులు చెప్పేవారు. మరిప్పుడేమో నన్నెక్కించకుండా వేరే ఎవరో ఒకరిని వెంటపెట్టుకు వెళ్తున్నారు. పోనీ డ్రైవింగ్ రాదేమో సింగిల్‌గా వెళ్తున్నారా అంటే అర్థం వుండేది'' అంది కన్నీళ్లెట్టుకుని.

"పిచ్చిమొహమా! అసలు విషయం నీకు తెలీదు. కాబట్టే అలా నిందిస్తున్నావు. గాలివీస్తే పడిపోయేట్లున్న నాకు ఓ మిత్రుడు మంచి సలహా యిచ్చాడు. బండి వెనుక ఎంత ఎక్కువ బరువుంటే బండి అంత సాఫీగా వెళ్తుందని. అందుకనే ఎవరో ఒకరిని వెంటేసుకు వెళుతున్నా'' అన్నాడు బుజ్జగింపుగా.

"నిజమే ఒప్పుకుంటాను. మరి ఆ బరువేదో నన్నే ఉపయోగించవచ్చుగదా!" అంది కాంతం.

"నిజమేకానీ నిన్ను మోసుకెళ్లానంటే బండిమీద బరువు మాట దేవుడెరుగు నా దగ్గర బరువుండొద్దూ!"

"బరువా?" విస్తుబోయింది.

"అదేనే! పట్టుచీరలని, సినిమాలని, షికార్లనీ మొదలుగా గల నీ కోరికలు తీర్చటానికి నా దగ్గర వుండాల్సిన బరువు. పైవాళ్లని తీసుకెళ్తితే ఈ బరువు నాకు తగలదుగా''

**-కె.కె. రఘునందన**

# చతుర

సంపుటి: 19 సంచిక: 10 నవంబర్: 1996

కాలేజీ చదువు పూర్తిచేసిన ఆ ముగ్గురమ్మాయిల వివాహ, జీవనమార్గాలు వేరయ్యాయి.

"స్త్రీకి జీవితంలో ఆర్థిక స్వాతంత్ర్యం అవసరం. ప్రతి పైసాకి భర్త ముందు చెయ్యి చాచరాదు" అని తన స్నేహితురాళ్ళిద్దరికీ ఉద్బోధిస్తూ వుండేది ఓ అమ్మాయి.

"జీవితంలో కష్టపడకుండానే స్వర్గసుఖాలు అనుభవించాలి. అందుకోసం అవసరమయితే మా అమ్మ నాన్నను మోసం చేసినట్టు నేను కూడా నా భర్తను మోసం చేసినా తప్పులేదు" అనుకునేది మరో అమ్మాయి.

చిన్నతనంనుంచీ దుర్భర దారిద్ర్యంలో పెరగడంతో, ఓ అందమైన ధనవంతుడి వలలోపడి అతన్నే పెళ్లాడాలనుకుని ఆశల మేడలు కట్టుకుంది మరో అమ్మాయి.

ఇలా... వైరుధ్య మనస్తత్వాలతో, వైవాహిక జీవితంలోకి అడుగుపెట్టిన ఆ యువతుల వినూత్న అనుభవాలెలాంటివి?

ఆశయాలకి, ఆచరణకి... ఆశలకి, అనుభవాలకి మధ్యగల అంతరాన్ని అక్షర బద్ధం చేసిన **హోతా పద్మినీదేవి** నవల **'గాజురాళ్లు'** ఈ నెల చతుర సమగ్ర నవల.

# గాజురాళ్లు

—హోతా పద్మినీదేవి

ఉమెన్స్ కాలేజీ ఆవరణలో కాడమల్లెచెట్టు కింద కూర్చుని వున్న ఆ ఇద్దరమ్మాయిల ముఖాలూ బలవంతాన నిగ్రహించుకుంటున్న దుఃఖంతో ఎర్రబడి ఉన్నాయి. ఎవరినో ఏదో చెయ్యాలనే కసి, ఏమీ చెయ్యలేని నిస్సహాయత ఇత్యాది భావాల సమ్మిళితంగా వున్నాయవి! ఆ ఇద్దరూ సీనియర్ ఇంటర్ చదువుతున్నారు. యవ్వనపు పొంగులు వికసిస్తున్న వయసు వాళ్ళది.

చాలామందిలా విద్యార్థిజీవితంలో రేపటి గురించి ఆలోచన లేకుండా గడిపే వయసే అయినా అందుకు విరుద్ధంగా వున్నారు వాళ్ళు. ఇప్పుడిప్పుడే ఇంట్లోని పరిస్థితులు అర్ధంఅవుతున్నా, అర్ధంచేసుకున్న విషయాన్ని జీర్ణం చేసుకోలేక జీవితంతో రాజీ పడలేక వ్యక్తం చెయ్యలేని బాధను అనుభవిస్తున్నారు.

వాళ్ళలో శారద చదువులో క్లాసు ఫస్ట్. ఆమెకి వున్న తెలివితేటలు, అందం మరే కలవారి అమ్మాయికైనా వుండివుంటే, బంగారానికి తావి అబ్బిందని లోకం ఆమెను పొగడ్తలతో ఆకాశానికి ఎత్తేసేదే! మధ్యతరగతి కుటుంబంలో పుట్టిన శారదకి చదువు తప్ప వేరే ప్రపంచం లేదు అనే కంటే తండ్రి ఆమెకి పుస్తకాలు తప్ప మరోప్రపంచాన్ని చూపించలేదంటే బాగుంటుంది. మిడిల్ క్లాసు సోషల్ వాల్యూస్ నరనరాన్ని జీర్ణించుకున్న తండ్రికి నలుగురు సంతానంలో మొదటి అమ్మాయిగా పుట్టిన శారద తన కనీస అవసరాలు కూడా ఆ ఇంట్లో తీరడం లేదని చిన్న వయసులోనే గ్రహించింది. తలా నాలుగు జతల బట్టలతోనే కాలక్షేపం చేస్తారు ఇంట్లోవాళ్ళు.

తండ్రి ఒక్కడి సంపాదనతోనూ ఇల్లు గడవడం కష్టమయ్యే తల్లి కూడా ఉద్యోగం చేస్తోందని ఆ అమ్మాయికి తెలుసు.

కాని, చిన్నచిన్న కోరికలు కూడా తీరకపోవడంతో జనించిన అసంతృప్తి ఉక్రోషాలను జయించే వయసు ఇంకా రాలేదామెకి.

రెండో అమ్మాయి రాధ. తండ్రి ఒక గవర్నమెంటు ఆఫీసులో యు.డి.సి.. ఆయనకి జీతం కంటే పైరాబడి ఎక్కువ అని నలుగురూ అనుకోడం రాధకి తెలుసు. కాని ఎప్పుడూ ఆయన భార్యకి తనంతటతనుగా పదిరూపాయలు ఇవ్వడం చూడలేదు రాధ. ఆమె అడగ్గా అడగ్గా ముష్టిపడేసినట్టు విసుక్కుంటూ పదిరూపాయలు అడిగితే అయిదు రూపాయలు ఇస్తాడు. ఆర్థిక అస్వతంత్రత మనిషిని ఎలా కృంగదీస్తుందో తల్లిని చూస్తే అర్ధమవుతుంది రాధకి. ఇంటి పరిస్థితులను గురించిన అవగాహన అయితే వుంది కాని, పరిస్థితులతో రాజీపడే వయసు, ఉద్రేకాన్ని అణచుకునే అనుభవము లేదామెకి.

ఆ ఇద్దరూ ప్రస్తుతం ఒకే సమస్యలో వున్నారు. వారం రోజులలో సీనియర్ ఇంటర్ విద్యార్థినులను అమరావతి ఎక్స్‌కర్షన్‌కి తీసికెళ్తున్నారు. ఎక్స్‌కర్షన్‌కోసం డబ్బులు అడిగితే తమ తల్లిదండ్రుల సమాధానం ఏమిటో శారదకి, రాధకి కూడా తెలుసు. అయినా ఆశ నోరు తెరిపించింది. శారద తల్లి జానకి సౌమ్యంగానే సమాధానం ఇచ్చింది.

"ఇంటి పరిస్థితి నీకు తెలియనిదేం కాదు గదా శారదా! ఈ నెలలో మీ నాయనమ్మ గారికి సుస్తీ చేసినప్పుడు డాక్టరు ఫీజుకి, మందులకి డబ్బుసరిపోక అప్పు చెయ్యావలసి వచ్చింది. ఇంకా నీకు, తమ్ముళ్ళకి పరీక్ష ఫీజు కట్టడం తరువాయే"

హతాశురాలయింది శారద. తల్లినోటి వెంట ఆ సమాధానం వినగానే ఆమెకి నిరాశతో, ఆశాభంగంతో కన్నీళ్ళొచ్చాయి.

ఇంచుమించుగా రాధకు కూడా అదే సమాధానం వచ్చింది గానీ, కాస్త కఠినంగా ఉందది.

రాధ తండ్రి లోకేశ్వరరావు ముఖం ఎర్రగా చేసుకుని, రౌద్రంగా అరిచాడు.

"నిన్ను చదివించడమే పెద్ద దండగ.




దానికి తోడు పార్టీలు, పిక్నిక్‌లు కూడానా? వెధవ్వేషాలు వెయ్యక చదువుపై దృష్టిపెట్టు. లేకపోతే చదువు మానేసి ఇంట్లో కూర్చో"

రాధకి ఆ సమాధానంతో అరికాలి మంట నెత్తికెక్కింది. ఆశాభంగంతో, ఉక్రోషంతో కన్నీళ్ళు వచ్చాయి. ఆపూటంతా ఏడుస్తూనే వుంది. భోజనం చెయ్యలేదు.

ఆమె అన్నం తినకపోయినా తనకేం ఫర్వాలేదన్నట్టు తండ్రికనీసం ఆమెని బతిమాలలేదు.

తల్లి మాత్రం వచ్చి అంది.

"మీ నాన్నగారి సంగతి తెలిసి వుండీ ఎందుకమ్మా అనవసరంగా గొడవ! రా. అన్నం తిను!"

రాధ ఏడుపు మరింత ఎక్కువయింది.

"నువ్వు ఏడ్చినా, ఉపవాసం వున్నా మీ నాన్నగారు మాత్రం నిన్ను ఎక్స్‌కర్షన్‌కి పంపరు. మరో మూడేళ్ళు ఓపికపడితే నీ చదువయిపోతుంది. పెళ్ళి చేసుకుని ఈ బందిఖానాలోనుంచి బయటపడుదువుగాని. అందరూ మీ నాన్నగారంత కఠినంగా వుండరు. ఆ వచ్చే అతను ఒప్పుకుంటే ఉద్యోగం చూసుకుని నీ కాళ్ళమీద నువ్వు నిలబడుదువుగాని"

రాధ మనసు తల్లి మాటలలో పెళ్ళి అనే పదం దగ్గర ముడిపడిపోయింది. అంతవరకు పెళ్ళి అనే మాటనే తలచని ఆమెకి మొదటిసారిగా పెళ్ళిని గురించి ఆలోచన వచ్చింది. అంతలోనే విషయం మరుగున పడిపోయి తను ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళలేకపోతోందనే బాధ మొదలయింది.

కాలేజీ గేటు దగ్గర కనిపించిన శారద ముఖంలో కూడా సంతోషపు ఛాయలు లేకపోవడం గమనించిన రాధ ఆమె కూడా ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళడంలేదని గ్రహించింది. మనసులో కాస్త తృప్తి. తను పొందలేని ఆనందాన్ని మరొకరు పొందకూడదనే లాంటి అసూయ.

"క్లాసుకి వెళ్దామా?" అడిగింది శారద బెల్ మోగడం విని.

"వుండు సునీతని కూడా రానియ్యి" అంది రాధ. ఆ అమ్మాయి ఆగినది సునీతతో కలిసి క్లాసుకి వెళ్ళడంకోసం కాదు. సునీత ఎక్స్‌కర్షన్‌కి వెళ్తోందో, లేదో తెలుసుకోడానికి.

అయిదునిముషాల తరువాత వచ్చిన సునీత ముఖం సంతోషంతో దీప్తివంతంగా వుంది. వస్తూనే హుషారుగా స్నేహితురాళ్ళని పలుకరించింది.

"హలో!"

రాధ ప్రతిగా విష్ చెయ్యలేదు. కాని శారద పలకరింపుగా నవ్వింది. "నీకోసమే ఆగాము"

"నేను ఎక్స్‌కర్షన్‌కి వెళ్తున్నాను. మీరూ వస్తున్నారుగా?"

"నేను రావడంలేదు" అంది శారద.

రాధ ముఖం మ్లానమయింది. సునీతకి జవాబివ్వకుండా తల తిప్పుకుంది.



ఆరోజు క్లాసులో ఒక పీరియడ్ డిబేట్‌కి కేటాయించారు. "స్త్రీలకి ఉద్యోగం అవసరమా! కాదా?" అన్నది అంశం.

కొంతమంది అమ్మాయిలు పాఠం అప్పచెప్పినట్లు ముక్కుబడిగా మాట్లాడారు.

స్త్రీకి ఉద్యోగం అవసరమేనని, కాని అటు గృహిణిగా గృహ బాధ్యతను, ఇటు ఉద్యోగినిగా సంపాదన బాధ్యతను నెరవేర్చడం కష్టమని దాని సారాంశం.

శారద వంతు వచ్చింది.

"ఒకప్పుడు స్త్రీకి విద్య అవసరమా కాదా అన్నది చర్చనీయాంశమయింది. ఇప్పుడు స్త్రీకి ఉద్యోగం అవసరమా కాదా అనే ప్రశ్న తలెత్తుతోంది. తరతరాలుగా మతం, సంస్కృతి, ఇవన్నీ స్త్రీలను అబలలుగానే చిత్రీకరిస్తున్నాయి. మన సమాజంలో పురు

షులే స్త్రీల విధుల్ని నిర్దేశించారు. వారి ఆలోచనా సరళిని కట్టడిచేసారు. ఆచార వ్యవహారాల పేరిట వారిని అదుపులో వుంచారు. ఏం మాట్లాడాలో, ఏం ఆలోచించాలో, ఏం తినాలో, ఏం పని చెయ్యాలో అన్నీ పురుషులే నిర్ణయించారు. స్త్రీని ఎప్పుడూ పురుషునిపై ఆధారపడి జీవించేదిగాను చెప్పేది విని తలూపేదిగాను మార్చడంలో పురుషులు విజయం సాధించారు

"ఆడది బాల్యంలో తండ్రిపైన, యౌవనంలో భర్తపైన, వృద్ధాప్యంలో కొడుకుపైన ఆధారపడాలని మన శాస్త్రాలు చెబుతున్నాయి. అంటే బాల్యంలో తండ్రిదగ్గర, యౌవనంలో భర్త దగ్గర, వృద్ధాప్యంలో కొడుకుదగ్గర చెయిజాపుతూ జీవితమంతా యాచనతోనే బతకాలి

"ఆర్థిక అస్వతంత్రతే అన్ని సమస్యలకి మూలకారణం

"విద్యకన్న ముఖ్యం స్త్రీకి స్వతంత్ర ఆర్జన. మనుషుల్ని కాని దేశాన్ని కాని అణగదొక్కాలంటే ఆర్థిక అసహాయత్వం ముఖ్యసూత్రం. అందుకనే స్త్రీ బానిస అయింది" అనే మాటలు నిజం!

అధికారానికి, అభిమతానికి ఎంతో సంబంధం వుంది. అధికారం లేని వ్యక్తి అభిమతానికి ఏమాత్రం విలువ వుండదు

మహిళలకు అధికారం లేకపోవడంవలన పురుషులపై ఆధారపడడంవలన వారి జీవితాలకు విలువ లేకుండా పోతోంది. ఐక్యరాజ్యసమితి జనాభానిధి స్త్రీలను స్వయంశక్తి సంపన్నులను చేయవలసిన, వారి అభిమతాలకి విలువనివ్వాలసిన అవసరాన్ని గుర్తించింది. మహిళలకు ఆర్థిక రంగంలో సమాన అవకాశాలను కలిగించాలి. ఆర్థికంగా సుస్థిరత సాధించిన మహిళలకు సామాజిక గౌరవంతోబాటు న్యాయం కూడా దానంతట అదే సమకూరుతుంది"





శారద ఉపన్యాసం ఆవేశపూరితంగా గాక ఆలోచన రేకెత్తించేదిగా వుంది. తన చుట్టూ వున్న మనుషులను పరిశీలించిన అవగాహన వుందందులో.

క్లాసులో కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. లెక్చెరర్ కూడా "చాలా బాగా మాట్లాడావమ్మాయ్" అని శారదని అభినందించింది.

రాధకి తండ్రి గుర్తొచ్చాడు. ఆమెకి వర్తమానంలో తన పరిస్థితిపై ఏహ్యాభావం కంటే భవిష్యత్తుని గురించిన భయం ఎక్కువ కాసాగింది.

ముగ్గురూ క్లాసులు అయిపోయాక, ఇంటి దారి పట్టారు.

"నిజంగా ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నావా శారదా? " సునీత అడిగింది.

"చేస్తాను. ఫస్ట్ ప్రిఫరెన్స్ ఉద్యోగానికే. తర్వాతే పెళ్ళి!" స్థిరంగా అంది శారద.

"ఎందుకు? మనం ఉద్యోగం చేసి సంపాదించిన దానిపై భర్త అనే మగవాడు పెత్తనం చెలాయించడానికా? మా ఇంటిపక్కనే వున్నారు ఓ బ్యాంకు ఎంప్లాయీ. భార్య లెక్చెరర్. ప్రతినెలా జీతం తెచ్చి ఆయన చేతిలో పెట్టవలసిందే. ఇంటా బయటా రెక్కలు ముక్కలు చేసుకున్నందుకు ఆవిడకి ప్రతిఫలం ఏది? స్త్రీకి కావలసింది ఆర్థిక సుస్థిరత కాదు. ఆర్థిక స్వాతంత్ర్యం. తనకంటూ కొంత డబ్బు సంపాదించుకోడం ముఖ్యం కాదు. తన సంపాదనని ఖర్చుపెట్టుకునే స్వేచ్ఛ! తన సంపాదనంతా భర్త చేతులలో పోసి, ప్రతి పైసా భర్తనుంచి దేబిరించే స్త్రీకి, ఆర్థికంగా బలహీనురాలై భర్తపై ఆధారపడే స్త్రీకి ఏమీ తేడాలేదు" రాధ మాటలు కసిగా ఆవేశంగా వున్నాయి.

"నువ్వన్నది నిజం రాధా" శారద ఆలోచిస్తూ అంది.

"ఏమో బాబూ, నాకు మటుకు ఉద్యోగం చెయ్యాలని లేదు. పెళ్ళయ్యాక, గృహిణిగా బాధ్యత పెరుగుతుంది. ఇంట్లో చాకిరీ, ఆఫీ

సులో చాకిరీ అబ్బబ్బ తలచుకుంటేనే భయం వేస్తోంది" అంది సునీత.

'మరి ఆర్థికంగా నిలదొక్కుకోడం ఎలా? నీకేదైనా కావాలంటే నీ భర్తని అడుగు తావా? భర్త భార్యకి కూడా ఏవో అవసరా లుంటాయని గ్రహించి అమె అడగకుండానే ఆమెకి కొంత డబ్బు ఇస్తే ఫర్వాలేదు. ప్రతి పైసా భర్తను దేబిరించాలంటే ఎంత అస హ్యంగా వుంటుంది"

శారద మాటలకి సునీత పెద్దగా రియాక్ట వలేదు.

రాధకి తల్లీ, తండ్రీ గుర్తొచ్చి ముఖం మరింత మ్లానమయింది.

"అలాంటివాడు వస్తే అప్పుడు ఆలోచిస్తా నులే. నాకు మటుకు ఉద్యోగం చెయ్యాలని లేదు" నిర్లక్ష్యంగా అన్న సునీత మరుక్షణం టాపిక్ మార్చేసింది. రేపు తను వెళ్ళబోయే ఎక్స్‌కర్షన్ గురించి, అక్కడ తామంతా ఎంత సరదాగా గడపబోతున్నారో వర్ణిస్తూ చెప్పింది. శారద చిరునవ్వుతోనూ రాధ అసూయతో కూడిన అయిష్టతతోనూ విన్నారు

ముందుగా సునీత ఇల్లు రావడంతో ఆమె వెళ్ళిపోయింది.

'గొప్ప! తనే ఎక్స్‌కర్షన్‌కి వెళ్తోందని' మూతి తిప్పింది రాధ. "ప్రాణస్నేహితులం అంటుంది. మనం రావడం లేదని తెలిసి తనూ ఎక్స్‌కర్షన్‌కి వెళ్ళడం మానెయ్యవ చ్చుగా?" రాధ మాటలలో తను ఎక్స్‌కర్ష న్‌కి వెళ్ళడం లేదనే బాధకంటే సునీత వెళ్తోందనే బాధే ఎక్కువగా ధ్వనించింది.

"అదేమిటి? మనం వెళ్ళకపోతే తనెం దుకు వెళ్ళకూడదు? తనకి అవకాశం వుంది కాబట్టి తను వెళ్తుంది" అంది శారద.

రాధ ముఖం మరింత నల్లబడింది. ఆమెకి కసిగా వుంది గానీ, అది ఎవరిపైనో తెలియదు. ప్రతి రూపాయికోసం తండ్రిని దేబిరించే తల్లి అసమర్థురాలిలా, భార్యాపిల్ల లకి తిండి, బట్ట తప్ప వేరే అవసరాలుండ వన్నట్టు పదిపైసలు కూడా చేజిక్కనివ్వని తండ్రి రాక్షసునిలా కన్పిస్తున్నాడు. ఆమె విసురుగా ఇంటివైపు అడుగులు వేసింది.



పరీక్షలు దగ్గర పడటంతో ముగ్గురూ చదువులో లీనమయ్యారు.

శారద ధ్యేయం ఫస్టుక్లాసు సాధించడం. సహజంగా చదువుపై ఆసక్తిగల ఆమె మరింత శ్రద్ధగా చదువులో నిమగ్నమ యింది. రాధ తెలివైనదే అయినా చదువుపై ముందునుంచే దృష్టి లగ్నం చెయ్యలేకపో యింది. ఆమె పెరిగిన వాతావరణం అందుకు కారణం. కనీస అవసరాలు చిన్న చిన్న సరదాలు తీర్చని తండ్రి ఒకవైపు, కాలే జీకి వస్తే తోటి విద్యార్థినులను చూస్తే తనేం కోల్పోతోందో సుస్పష్టమై మరోవైపు మనసు మరింత వ్యాకులమయ్యేది. ఆ కార ణంగా చదువుపై మనసును లగ్నం చెయ్య లేకపోయేది.

సునీత తండ్రి కూడా రాధ తండ్రి కోవ లోకి చెందిన మనిషే అయినా తల్లిద్వారా ఆమె సరదాలు తీరేవి. ఏదో పాస్ మార్కులు రాకపోవులే అనే నిర్లక్ష్యధోరణికి ఆమె ఎప్పుడో అలవాటుపడిపోయింది.

పరీక్షలవుతుండగానే శారద తండ్రికి కాకి నాడ ట్రాన్స్ఫరయిందని తెలిసింది.

చివరి పరీక్ష రాసి ముగ్గురూ కాడమల్లి చెట్టుకింద కూర్చున్నారు.

'అయితే డిగ్రీ కాకినాడలో చదువుతా

వన్నమాట!" అంది రాధ.

"పోనీ హాస్టల్‌లో వుండవచ్చుగా? "

"పుస్తకాలు, ఫీజులతోబాటు హాస్టల్ ఫీజులు కూడా కట్టలేం కదా రాధా!" అంది శారద

"నువ్వు మాకు దూరంగా వెళ్ళిపోతున్నా వంటే బెంగగా వుంది శారదా!" అంది సునీత. ఆమె కళ్ళలో నీళ్ళు.

"ఛ ఏమిటిది సునీతా. విజయవాడకి కాకినాడ ఎంత దూరమని! అయినా నేను వారానికో ఉత్తరం రాస్తానుగా? " అంది శారద ఓదార్పుగా. ఆమె స్వరం కూడా రుద్ధమయివుంది.

రాధకైతే ఏడుపు ఆగడంలేదు. శారద ఆమె ప్రియనేస్తం. ఆమెతో తన కష్టాలను కన్నీళ్ళతో చెప్పుకుని వూరటపొందేది. ఇప్పుడు ఆ నేస్తం దూరంగా వెళ్ళిపోతోం దంటే ఆమెకి ఏడుపొస్తోంది.

"ఉత్తరాలు రాయడం మానద్దు సుమా! మరో నాలుగైదు సంవత్సరాలలో మీరిద్దరూ ఉద్యోగస్థులయ్యారనే వార్తతో నాకు ఉత్తరాలు రాయాలి" అంది శారద.

"పరిస్థితులు అనుకూలించాలిగా? " అంది సునీత.

"ప్రయత్నిస్తే తప్పేం లేదుగా? " శారద అన్న మాటలకి ఇద్దరూ సాలోచనగా తల పంకిచారు.



" డియర్ రాధా,

ఎలా వున్నావ్? ఏం చేస్తున్నావ్? బాగా చదువుతున్నావని తలుస్తాను. నేను బాగానే చదువుతున్నాను. చదువుకి, విజ్ఞానానికి డిగ్రీలు కొలబద్దలు కావనుకో! అయినా పరీక్షలలో ఫస్ట్ రాంక్ సాధిస్తే తప్ప ఉద్యోగం రాదు కాబట్టి క్లాసు పుస్తకాలు ఒక్కటే చదవవలసివస్తోంది. ఇంకా మూడేళ్లు... సుదీర్ఘమైన మూడు సంవత్సరాలు కష్టపడితేనే కాని డిగ్రీ చేతికి రాదు. చాలామంది విద్యార్థి జీవితంలోని మాధుర్యాన్ని అనుభవించడానికే కాలేజీకి వస్తారు. కాని, నాకుమాత్రం ఎప్పుడు చదువు పూర్తవుతుందా, ఎప్పుడు ఉద్యోగం సంపాదించుకుంటానా, అని ఎంత ఆత్రుతగా వుందో తెలుసా? మరి నీ సంగతేమిటి? మనం ఉద్యోగినులుగా కలుసుకోవాలనే మనం తీసుకున్న నిర్ణయాన్ని నిలబెట్టుకోడానికి కృషిచెయ్యాలి సుమా! జవాబు రాస్తావుగా?

నీ శారద. "

రాధ ఆ ఉత్తరాన్ని చదివి నిరాసక్తంగా పక్కన పడేసింది. గత మూడునెలల్లోను శారదనుంచి రాధకి నెలకి మూడు ఉత్తరాలు వస్తూనే వున్నాయి. రాధ ఆమె రాసిన మొదటి ఉత్తరానికి జవాబిచ్చింది.

తర్వాత జవాబివ్వలేదు. శారద స్నేహాన్ని మరచిపోడం అందుకు కారణంకాదు. కాని, ఆ ఇంట్లో ఒక పోస్టుకవరు కొనుక్కోవాలన్నా తండ్రిముందు చెయ్యిజాపవలసిన తన అస్వతంత్రత ఒక కారణమైతే తన పరిస్థితికి కారకుడైన తండ్రిపైనే కాదు, తన చుట్టూ వున్న మనుషులని కూడా ద్వేషించే పరిస్థితులలో వున్న ఆమె శారదకి ఉత్తరం రాయలేదు.

శారద ఉత్తరాన్ని ప్రక్కనపడేసి పుస్తకం చేతిలోకి తీసుకుంది. కానీ చదువుమీద మనసు లగ్నం చెయ్యలేకపోయింది.

తండ్రి ఆఫీసునుంచి వచ్చే టైమయిందని రాధకి తెలుసు. తల్లి ఆ ఉదయం తనకిచ్చిన మాట ప్రకారం తండ్రి దగ్గర తనకి కొత్త బట్టలు కొనేవిషయాన్ని ప్రస్తావిస్తుంది. అందుకే రాధ తండ్రి రాకకోసం ఎదురు చూస్తోంది.

మరో పది నిముషాల తర్వాత తండ్రి వచ్చాడు. తల్లి ఆయనకి కాఫీ తీసికెళ్లింది. రాధ ఒళ్లంతా చెవులు చేసుకుంది.

"రాధ బట్టలన్నీ బొత్తిగా చిరిగిపోయాయి. ఓ రెండు జతలు కుట్టించాలండీ" అంది తల్లి.

లోకేశ్వరరావు ముఖంలో ఆగ్రహం, చిరాకు పిలిచినట్టే వచ్చేశాయి.

"ఇప్పుడు కాదు, తర్వాత చూద్దాం"

"పాపం అది వెలిసిపోయిన బట్టలతో కాలేజీకి వెళ్లడానికి సిగ్గుపడుతోంది"

"గౌరవం బట్టలతో రాదే! చదివి ఫస్టు మార్కులు తెచ్చుకుంటే అదే గౌరవం. అయినా సింగారించుకుని, నలుగురిలోను తన అలంకరణని ప్రదర్శించడానికే అయితే అది రేపటినుంచి కాలేజీకి వెళ్లక్కర్లేదు"

తండ్రి జవాబు వింటున్న రాధకి ఉక్రోషంతో ఏడుపొచ్చింది. ఊహ తెలిసిన దగ్గరనుంచి తల్లి తండ్రి దగ్గర చెయ్యి జాపడం, ఆయన మొదట క్రోధంగా, తరువాత వ్యంగ్యంగా చివరకి విసుక్కుంటూ మాట్లాడి బిచ్చగత్తె చేతిలో విదిల్చినట్టు తల్లికి డబ్బు ఇవ్వడం చూస్తూనే వున్నా ఇవాళ ఆమెకి ఎందుకో కన్నీళ్లు ఆగడంలేదు.

"రాధకి బట్టలు కొని సంవత్సరం పైగానే అవుతోంది. ఓణీలన్నీ బొత్తిగా వెలిసిపోయాయి. రెండు ఓణీలయినా కొనండి. వంద రూపాయలిస్తే రెండు చవకరకం ఓణీలు వస్తాయి" తల్లి ప్రాధేయపూర్వకంగా అడుగుతోంది.

"వెధవగోల! వెధవ సంసారం! నోరు విప్పితే చాలు డబ్బు డబ్బు. జలగల్లా నన్ను పీక్కుని తినడానికే మీరంతా దాపురించారు" లోకేశ్వరరావు ముఖం చెండుకుంటూ పర్సులోనుంచి డబ్బుతీసి భార్య చేతిలో విదిలించినట్టు పడేశాడు.

రాధ తండ్రి తల్లికెంత డబ్బు ఇచ్చాడో చూడలేదు. కానీ తల్లి వంద రూపాయలు అడిగితే ఆయన ఇచ్చేది ఏభై రూపాయలే! ఆ డబ్బుకి ఇప్పటి ధరల దృష్ట్యా ఆలోచిస్తే ఎంత నాశిరకం దుస్తులు వస్తాయో ఆమెకి తెలుసు. తండ్రి ఇచ్చిన ఆ నోట్లని చింపి ఆయన ముఖం మీద కొట్టాలన్పించిందామెకి. కానీ అవసరం, నిస్సహాయత.

ఆ రాత్రి రాధకి నిద్రపట్టలేదు. ఎన్నాళ్లిలా? ప్రతి చిన్న అవసరానికి తండ్రిని ప్రాధేయపడుతూ, ఆయన ముష్టివేసినట్టుగా విదిలిస్తూ ఇచ్చిన డబ్బుతో అవసరాలను తీర్చుకుంటూ ఉండాలా? తన తల్లి తండ్రి దగ్గర చెయ్యి చాచడానికి రోషపడదు. కానీ తనకి మాత్రం చాలా అవమానంగా, పౌరుషంగా ఉంది.

రాధకి వున్నట్టుండి శారద ఉత్తరం గుర్తొచ్చింది. మరో రెండు సంవత్సరాలలో తన చదువయిపోతుంది. చిన్నదో, పెద్దదో ఏదో ఒక ఉద్యోగం చూసుకోవాలి. తండ్రి ముందు చెయ్యి జాపే హీనస్థితినుంచి బయటపడాలి.

★ ★ ★

శారద ఉత్తరాన్ని చదివి ప్రక్కన పడేసి నవ్వుకుంది సునీత.

ఈ శారదదంతా మరీ విపరీతం. భర్త ముందు చెయ్యి జాపకూడదంటుంది. ఆడది మగవాడితో సమానంగా ఉద్యోగం చేస్తూ తనకోసం తన ఖర్చులకోసం డబ్బు సంపాదించుకునేట్టయితే పెళ్లెందుకు చేసుకోడం? అటు ఉద్యోగం, ఇటు ఇంటిపనితో సతమతమవుతూ, స్వసుఖాన్ని ఎందుకు త్యాగం చెయ్యాలి.

నిర్లక్ష్యంగా పుస్తకాల మధ్యకి ఆ ఉత్తరాన్ని తోసేసింది సునీత. మరో రెండు నెలల్లో పరీక్షలు. అయినా ఆ అమ్మాయిలో చదువుకోవాలనే ఆసక్తికాని, పరీక్ష అంటే భయంకానీ లేవు. పరీక్షల ముందు ఒకసారి చదివితే చాలు ఆ మాత్రం ప్యాసు మార్కులు రాకపోవు అనే ధీమా వుంది.

"సినిమాకి టైమవుతోంది. త్వరగా తెమలవే!" తల్లి పిలుపుతో ఉలిక్కిపడి బాత్‌రూమ్‌లోకి పరిగెట్టింది సునీత.

అయిదు నిముషాల తర్వాత సునీత తల్లి రాజ్యలక్ష్మి పిల్లలతో కలిసి సినిమాకి బయలుదేరింది.

భార్య సినిమాకి వెళ్తోందనగానే రామా




రావు ముఖం చిట్లించాడు.

"నన్ను మాత్రం డబ్బు అడగకండి" అన్నాడు.

"నిన్ననే మా అన్నయ్య పండక్కి చీరకొనుక్కోవే అని డబ్బు పంపాడు. సినిమాకి డబ్బు ఇమ్మని మిమ్మల్ని నేను అడిగానా?" నిష్ఠూరంగా అంది రాజ్యలక్ష్మి.

ఆ ఇద్దరి సంభాషణను సునీత ఆశ్చర్యంగా వింది. తండ్రి ఇంట్లోకి అవసరమైన పప్పులు, బియ్యం వగైరా కొనడం తప్ప ఇంటి ఖర్చులకోసం తల్లికి డబ్బు ఇవ్వడు. అయినా తల్లి దగ్గర డబ్బు వుంటుంది. ఆ డబ్బుతో ఆవిడ తన అవసరాలతోబాటు పిల్లల అవసరాలు కూడా తీరుస్తుంది.

తల్లికి డబ్బెక్కడిది? అనే ప్రశ్న సునీత ఎప్పుడూ వేసుకోలేదు. తన సరదాలు తీరుతున్నాయి. అది చాలు అనుకునేది.

కానీ ఇవాళ తల్లి తండ్రితో చెప్పిన జవాబులో మేనమామ డబ్బు పంపాడనే వాక్యం ఆమెని ఆశ్చర్యచకితురాలిని చేసింది. మేనమామ డబ్బు పంపాడని తల్లి ఎందుకు అబద్ధమాడింది? తల్లికి డబ్బు ఎక్కడిది? ఈ రెండు ప్రశ్నలూ సునీత మనసుని దొలిచేస్తున్నాయి. తన అభిమాన హీరో నటించిన ఆ సినిమాని చూడడంలో లీనమైన ఆమె తాత్కాలికంగా ఆ విషయాన్ని మరచిపోయింది.,

మరునాడు ఇంగ్లీషు లెక్చరర్ సెలవు పెట్టడం వలన ఒక పీరియడ్ ఖాళీగా వుండి సునీత ఒకగంట ముందుగానే ఇంటికి వచ్చింది. వీధి మెట్లెక్కి లోపలకి రాబోయిన సునీత ఎదుటి దృశ్యాన్ని చూసి క్షణం అలాగే నిలబడిపోయింది.

చేతిలో సంచీతో పొరుగింటి అరుంధతి ఉంది. నోట్లు లెక్కపెట్టుకుంటోంది తల్లి.

హఠాత్తుగా వచ్చిన సునీతని చూడగానే ఆ ఇద్దరి ముఖాల్లో కంగారు, తొట్రుపాటు.

"నేను వెళ్తానండీ" అరుంధతి కంగారుగా వెళ్ళిపోయింది.

సునీత వాళ్ల ముందునుంచే గదిలోకి వెళ్ళిపోయింది.

చేతిలో నిండుగావున్న సంచీతో పొరుగింటి అరుంధతి.... డబ్బు లెక్కపెట్టుకుంటూ తల్లి.

ఆ సంచీలో వున్నది బియ్యమా, పప్పులా అన్నది ప్రశ్నేకాదు. తండ్రి డబ్బివ్వకుండా తల్లి తన సరదాలను ఎలా తీరుస్తోందా అని నిన్న తనలో ఉదయించిన ప్రశ్నకి జవాబు దొరికింది.

ఆ ఇంటికి యజమాని తన తల్లి, ఆ ఇంటిని కనుసన్నలతో శాసించే అధికారం, అర్హత ఆమెకి వున్నాయి. అలాంటి తల్లి తన ఇంట్లో తనే దొంగతనం చేస్తోంది. ఇంట్లోని సరుకులని అమ్మి ఆ డబ్బుతో తన సరదాలని తీరుస్తోంది. ఆ క్షణంలో సునీత మనసులో తల్లిపై ప్రేమ ఉప్పొంగలేదు. తండ్రిపై అసహ్యం కలిగింది.

రాజ్యలక్ష్మి ఇన్నాళ్లూ తను కాపాడుకుంటూ వస్తున్న రహస్యం కూతురి ముందు బయటపడిపోయినందుకు బాధపడింది. కానీ సునీత ఆ విషయం తండ్రితో చెబుతుందనే భయం ఆవిడకి కొంచెం కూడా లేదు. ఆవిడ మొదట్లో తన అవసరాలను తీర్చుకోడంకోసం భర్తకి తెలియకుండా ఇంట్లోవున్న బియ్యం, పప్పులు వగైరా దినుసులని ఇరుగుపొరుగులకి అమ్మేది. ఇప్పుడు పిల్లల చిన్నచిన్న సరదాలని తీర్చడం కోసం ఆ పని చేస్తోంది.

అందుకే సునీత తను పక్కింటామెకి బియ్యం అమ్మడం చూసినందుకు ఆవిడ భయపడలేదు.

ఆవిడలో తప్పుచేసిన భావంలేదు. అతి మామూలుగా రోజూలాగే కూతురికి కాఫీ, టిఫిన్ ఇచ్చి ఆమె చదువు విషయం అడిగి తెలుసుకుని, పరీక్షలు దగ్గరకి వస్తున్నాయి కాబట్టి శ్రద్ధగా చదువుకోమని హెచ్చరించింది.



సునీత కూడా తల్లితో మామూలుగానే మాట్లాడింది.



శారద ఓణీ చిరుగు కన్పించకుండా జాగ్రత్తగా కుట్టుకుంటోంది. తన తోటి అమ్మాయిలంతా ఖరీదైన దుస్తులతో కాలేజీకి వస్తుంటే తను మాత్రం అతి సామాన్యమైన బట్టలతో కాలేజీకి వెళ్తున్నందుకు కలిగిన ఉక్రోషాన్ని జయించడానికి ఆమె చాలా ప్రయత్నించవలసి వచ్చింది. ఆ ప్రయత్నంలో చాలాసార్లు ఓడిపోయింది కూడా.

కాకినాడ వచ్చాక ఆమెకి స్నేహితులంటూ ఎవరూ లేకపోయారు. చదువు తప్ప వేరే ప్రపంచంలేని ఆమె స్నేహితులని దూరంగా వుంచిందనడంకంటే ఆమెని సహ విద్యార్థినులే దూరంగా వుంచారనడం సబబు. వాళ్ల ప్రపంచం వేరు కావడం అందుకు కారణం.

స్నేహితులు లేరని ఆమె పెద్దగా బాధ పడలేదు. సునీత, రాధలకి ఆమె క్రమం తప్పకుండా నెలకి మూడు ఉత్తరాలు రాసేది. సునీత కూడా ఆమె ప్రతి ఉత్తరానికి సమాధానం రాసేది. రాధ నుంచి మాత్రం నెలకో, రెండు నెలలకో ఉత్తరం వచ్చేది. అయినా శారద ఆమెకి ఉత్తరం రాయడం మానేదికాదు.

రాధనుంచి ఉత్తరం వచ్చి నెలదాటింది అనుకుంది శారద.

"శారదా! నీకు ఉత్తరం వచ్చింది" జానకి కూతురికి ఉత్తరాన్ని అందించింది.

శారద ఆత్రంగా కవరు తెరిచింది.

"డియర్ శారదా!

ఎలా వున్నావ్? నేను బాగానే వున్నాను. నాకో కొత్త ఫ్రెండ్ దొరికింది. పేరు హాసిని. మేమిద్దరం మొన్నకాలేజీ ఎగ్గొట్టి 'ప్రేయసి' సినిమాకి వెళ్లాం. ఆ సినిమా నువ్వు చూశావా? బహుశా చూసి వుండవు. నాకు తెలుసు నువ్వు పుస్తకాల పురుగువని. మరీ అంతగా పుస్తకాలు నూరుకుని తాగక్కర్లేదుకాని, కొంచెం బయటి ప్రపంచం కూడా చూడడం నేర్చుకో!

ఇంట్లో వాళ్లకి తెలియకుండా కాలేజీ ఎగ్గొట్టి ఇలా సినిమా చూడడంలోని ఆనందం నీకు చెప్పినా అర్థంకాదు. ఆ థ్రిల్ అనుభవిస్తేనేకాని తెలియదు"

శారదకి ఆ ఉత్తరం మరి చదవబుద్ధి కాలేదు. సగంలోనే మడిచేసి అలమరలో పడేసింది.

సునీత ఉత్తరం చదివిన ఆమెకి నవ్వు, దుఃఖం రెండూ సమపాళ్లలో కలిగాయి. కష్టపడి చదివి మంచి మార్కులతో పరీక్ష పాసయి తనకంటూ ఒక స్వంత సంపాదనని ఏర్పరచుకోవలసిన సునీత ఇలా కాలేజీ ఎగ్గొట్టి సినిమాలు చూస్తోందంటే ఆమెకి బాధ కలిగింది. చదువంటే చాలామందికి శ్రద్ధ లేకపోవచ్చు. కాని భవిష్యత్తు అనే భవనానికి పునాది లేకపోతే ఎలా? అందులోనూ తమలాంటి మధ్యతరగతి అమ్మాయిలకి?

సునీత ఉత్తరానికి జవాబు రాయాలన్పించలేదు శారదకి. కాని రాసింది. ఎట్టి పరిస్థితులలోను తమ లక్ష్యం మరువద్దనీ, ఆర్థికంగా తమ కాళ్లమీద తాము నిలబడాలనే తమ ఆశయం నెరవేరే వరకు నిరంతరం శ్రమించమనీ రాసింది.

మరో వారంరోజుల తర్వాత రాధనుంచి ఉత్తరం వచ్చింది శారదకి.

"నాకీ ఇంట్లో వుండాలని లేదు శారదా! కన్నబిడ్డల కనీస అవసరాలను తీర్చని వీళ్లు నా తల్లిదండ్రులు కారు. అసలు కొంతమంది పిల్లలని ఎందుకు కంటారో వాళ్లకే తెలియదు. జన్మనిచ్చినందుకే తిండి, బట్ట! పెళ్లిచూపులలో నేను డిగ్రీ ప్యాసయ్యాను అని చెప్పుకోడానికే చదువు. ఆ అర్హత కోసం చదివిస్తున్నారే తప్ప నిజానికి తనకంటూ ఒక వ్యక్తిత్వం, గుర్తింపులకోసం కాదు.





పిల్లలని ఆకలితో మాడ్చడం తప్పుకాదు అని ఏ సాధుపుంగవుడైనా చెప్తే మాకు అన్నం కూడా పెట్టకుండా మాడ్చి చంపే కఠిన హృదయుడు నా తండ్రి! నీకు ఉత్తరం రాయడానికి కవరు కొనాలన్నా ఆ రూపాయి కూడా ఆయన్ని యాచించవలసిందే! నేను నీకెప్పుడైనా ఉత్తరం రాయడం మానేస్తే నేను నిన్ను మరచిపోయానని మాత్రం అపార్థం చేసుకోవద్దు. కేవలం నా తండ్రి ముందు ఆ ఒక్క రూపాయికోసం చెయ్యి జాచడానికి ఇష్టంలేకే నీకు ఉత్తరం రాయడం మానేశానని అర్థంచేసుకో"

రాధ పరిస్థితికి ఆర్ద్రమైపోయింది శారద మనసు. రాధకి ధైర్యం చెబుతూ ఉత్తరం రాసింది.

"ఇవాళ నీ తండ్రి ముందు చెయ్యి జాపే పరిస్థితిని రేపు నీ భర్త ముందు చెయ్యి జాపేలా మార్చుకోకు. అలా కాకుండా వుండాలంటే నీకాళ్లమీద నువ్వు నిలబడగలగాలి" అని దాని సారాంశం.

శారదనుంచి వచ్చిన ఆ ఉత్తరాన్ని చదివిన రాధకి ఏదో తెలియని స్ఫూర్తి, ఉత్తేజం కలిగాయి. కారణం ఆ ఇంట్లో ఆమెకి ఆమాత్రం ధైర్యం చెప్పేవాళ్లు కూడా లేరు.

ప్రతి రూపాయి కోసమూ తండ్రిముందు చెయ్యి జాపే తల్లి!

పదిసార్లు అడిగించుకున్నాక విసుక్కుంటూ ముష్టి విదిల్చినట్టు పడేసే తండ్రి.

ఇంట్లో వుండేది తల్లి, తండ్రి, తను, తమ్ముడు అయినా, ఆ నలుగురి మధ్య సయోధ్య లేదు. తమ్ముడూ, తనూ కూడా తమ ఉక్రోషాన్ని తల్లిపైనే చూపిస్తారు. పన్నెండేళ్ల తమ్ముడు జుట్టు కత్తిరించుకోడానికి సెలూన్‌కి వెళ్లాలన్నా ఆ పది రూపాయలూ తండ్రిని అడగవలసిందే! తిలకం సీసా అయిపోయినా ఆ నాలుగు రూపాయలూ ఆయన్నే అడగాలి.

ఆర్థిక అస్వతంత్రత మనిషిని ఎలా కృంగదీస్తుందో ఆ ఇంట్లో ప్రత్యక్షంగా చూస్తోంది రాధ.

శారద ఉత్తరంతో పొందిన ఓదార్పు, స్ఫూర్తితో రాధలో ఒక రకమైన నమ్మకం కలిగింది. అవును తనెందుకు చదవలేదు? ఇంకెంత? రెండేళ్లు కష్టపడితే డిగ్రీ చేతికి వస్తుంది. తరువాత తను చిన్నదో పెద్దదో ఏదో ఒక ఉద్యోగం చూసుకోవచ్చు రాధ ధృఢనిశ్చయంతో చాలా రోజుల తర్వాత పుస్తకాలను తెరిచింది.

కానీ తను తీసుకున్న ఆ నిర్ణయం కొద్ది రోజులలోనే గాలిలో కలిసిపోతుందని ఆమెకి ఆ క్షణంలో తెలియదు.

★ ★ ★

సునీత తల్లి రహస్యంగా ఇచ్చిన డబ్బుతో సినిమాకి వచ్చింది. తన అభిమాన నటుడి సినిమా విడుదలయిన వారంలోగా చూడకపోతే ఆమెకి నిద్రపట్టదు.

టికెట్టు తీసుకుని ఎంట్రెన్స్ వైపు వెళ్లబోతున్న సునీత అప్పుడే థియేటర్ ఆవరణలో ఆగిన కారులోనుంచి దిగిన అనుపమ బృందాన్ని చూసి క్షణకాలం ముఖం ముడుచుకుంది. అనుపమలా కారులో సినిమాకి వచ్చే అదృష్టం తనకి లేనందుకు ఆమెకి అసూయ కలిగింది. కానీ అనుపమ నవ్వుతూ పలుకరింపుగా తనవైపు చెయ్యి వూపడంతో ఆమె సంతృప్తి పడింది.

"హలో!" అనుపమ చిరునవ్వుతో పలుకరించింది. "మీ ఫ్రెండ్ రాలేదా?"

"ఎవరూ? రాధ గురించా మీరు అడిగేది?"

"అవును"

"రాలేదు"

"అదేం? రాధ సినిమాలు చూడదా?"

"వాళ్లింట్లో ఒప్పుకోరు"

"బహుశా వాళ్ల నాన్నగారు బాగా స్ట్రిక్ట్ అనుకుంటాను"

"స్ట్రిక్టే...! రాధా వాళ్ల నాన్నగారు డబ్బు

దగ్గర మహాగట్టి. రాధా వాళ్లమ్మగారికే డబ్బు ఇవ్వరు"

"నిజమా?" అనుపమ ఆశ్చర్యంగా వింది.

"అవును రాధ చాలాసార్లు చెప్పింది" రాధలోని బలహీనతలని, ఆమె కుటుంబ పరిస్థితులను బయటపెట్టి తనకి తెలియకుండానే ఆమెకి కీడు చేస్తున్నాననే విషయం తెలియని సునీత అంది.

"రండి, సినిమా బిగిన్ కాబోతోంది" లోపలకి నడిచింది అనుపమ. సునీత ఆమెని అనుసరించింది. అనుపమ తన స్నేహితులని వదిలి తన పక్కనే కూర్చుని తనతో స్నేహంగా ఆప్యాయంగా మాట్లాడడంతో సునీత మనశ్శరీరాలు ఆనందంతో ఉప్పొంగాయి.

తర్వాత సునీత ద్వారా రాధ వివరాలను మరిన్ని సంపాదించగలిగింది అనుపమ.

ఒకే కాలేజీలో, ఒకే క్లాసులో చదువుతున్నా ఒకప్పుడు ప్రాణస్నేహితులైన రాధ సునీతల మధ్య ఇప్పుడు స్నేహం లేదనే చెప్పాలి.

తను, సునీత ఇంచుమించు ఒకే ఆర్థిక పరిస్థితికి చెందినవాళ్లే. అయినా సునీత తనకంటే సంతృప్తిగా బతుకుతోంది. రాధలో సునీత ఎడల్ల ఈర్ష్య జనించింది.

సునీత ఎప్పుడైనా తను చూసిన సినిమా కథని గురించి రాధతో చర్చించబోతే రాధ అక్కడనుంచి లేచి వెళ్ళిపోయేది. రాధ మనసు తనపై అసూయతో మండిపడుతోందని గ్రహించిన సునీత కూడా ఆమెతో స్నేహాన్ని కట్ చేసింది. 'భూమికి ఆకర్షణ ఎంత సహజమో మనిషికి ఈర్ష్య అంతే సహజం' అనుకుంది.

రాధ తనకంటే ఉన్నతమైన స్థితిలో వున్న అనుపమ, నళినిలాంటి వాళ్లని చూసి ఈర్ష్య పడే స్థితిని అధిగమించి తనతో సమానస్థాయిలో వున్నా తనకంటే మెరుగ్గా బతుకుతున్న సునీతని చూసి ఈర్ష్యపడడం మొదలుపెట్టింది.

  

రాధ విసురుగా పెట్టెలోని బట్టలన్నీ లాగి కింద పడేసింది.

ఎప్పుడూ అవే బట్టలు! కొన్నాళ్లుగా కట్టి కట్టి విసుగెత్తి పోతోంది. తన క్లాస్‌మేట్స్ నీరజ, అనుపమ, మోహిని వీళ్లంతా ఎంత ఖరీదైన బట్టలు వేసుకొస్తారూ.

జీన్స్, మిడి, చుడీదార్‌లలో అత్యాధునికంగా అలంకరించుకుని కేనెటిక్ హోండామీద కాలేజీకి వచ్చే అనుపమ.

కాంచీవరం పట్టుపరికిణీలు, ఫారిన్ నైలెక్సు ఓణీలు, మేచింగ్ నగలు, అప్పుడప్పుడు పంజాబీ డ్రెస్‌లు వేసుకునే మోహిని, ఎంత అదృష్టవంతులు వీళ్ళంతా! సునీత మాత్రం! తండ్రి చేసేది యు.డి.సి. ఉద్యోగం! ఆమె ధరించే బట్టలు మాత్రం ఖరీదైనవి. ఆమె తండ్రి సంపాదనతో ఇంట్లో తిండే తింటారా, షోకులే చేస్తారా?

తమ కుటుంబం పంచభక్ష్య పరమాన్నాలతో తినకపోయినా, రెండుపూటలా కూర, పప్పు పెరుగుతో కడుపునిండా తింటారు. కాలేజీ ఫీజు కట్టే విషయంలో కాని, పుస్తకాలు కొనే విషయంలో కాని ఏమాత్రం అలక్ష్యం చెయ్యని తన తండ్రికి భార్యాపిల్లలకి కాస్త మంచి బట్టలయినా కొనాలని ఎందుకు తోచదు. ఆయనా అంతే! షర్టు కాలర్ చిరిగినా పాతపడినా పట్టించుకోడు.

మనిషి వేషభాషలకే ప్రాధాన్యత ఇచ్చే ఈ సభ్యసమాజంలో ఎలా బ్రతకాలి?

ఎలా సంపాదించాడు అన్నది కాదు ముఖ్యం! ఎంత సంపాదించాడు అన్నదే ముఖ్యం!

రాధ ఆలోచనలు ఎడతెరిపిలేకుండా సాగిపోతున్నాయి.

"రాధా! భోజనానికి రా! కాలేజీకి టైమవుతోంది"





తల్లి పిలుపుతో, ఉలిక్కిపడిన రాధ విసురుగా టేబిల్ మీద పుస్తకాలని అందుకుని బయటకి వచ్చింది. విసవిస మెట్లు దిగుతున్న కూతురి వెనుకే వస్తూ ఆదుర్దాగా పిలిచింది విశాలాక్షి.

"అన్నం తినవుటే!"

"అక్కర్లేదు. కడుపు నిండిపోయింది" వ్యంగ్యంగా అని ముందుకు నడిచింది.

విశాలాక్షికి కూతురి మనసేమిటో అర్థం అవుతూనే వుంది. అందరిలా తామెందుకు లేమని ఆమెకూ బాధగానే ఉంది.

తన భర్త జీతమెంతో తనకి తెలియదు. ఆయన ఆమెతో తన ఆదాయవ్యయాల గురించి ఎప్పుడూ చర్చించలేదు. ప్రతి చిన్న అవసరానికి భర్తపై ఆధారపడుతూ ఆ ఇంట్లో తనెంత హీనంగా బ్రతుకుతోందో రాధకీ తెలుసు. అయినా ఉక్రోషాన్ని జయించే వయసు కాదామెది. విశాలాక్షి నిట్టూరుస్తూ లేచివెళ్ళి కూతురు విసిరేసిన బట్టలని సర్దడం మొదలుపెట్టింది.

కాలేజీ గేటు దగ్గర కెనెటిక్ హోండాని ఆనుకుని నిలబడి వున్న అనుపమ రాధని చూడగానే "హాయ్" అంది. ఆ పలుకరింపుతో తలెత్తిన రాధకి ఆమె పక్కనే మరొక యువకుడు కనిపించాడు. అతను అందంగా హుందాగా వున్నాడు. రాధని కలవరపరిచింది అతని అందం కాదు. అతని చూపు. తననే తదేకంగా, నిర్నిమేషంగా చూస్తున్న అతని చూపు. రాధ చప్పున అతనినుంచి చూపు మరల్చుకుని అనుపమవైపు చూసి పలుకరింపుగా నవ్వింది.

కాని లోలోన ఆమెకి చాలా ఆశ్చర్యం వేసింది, అనుపమ తనని పనిగట్టుకుని పలుకరించడం చూస్తే. ఒకే క్లాసులో చదువుకుంటున్నా అనుపమ రాధతో మాట్లాడేదే తక్కువ.

డబ్బుతో పులిసిన కుటుంబానికి చెందిన అనుపమ రాధని దూరంగా వుంచిందనడం కంటే రాధ ఆమెకి చేరువ కాలేకపోయిందనడం సబబేమో. అందుకు రాధలోని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఒక కారణమైతే అనుపమ వర్గంలో వున్న సుధలా తను అనుపమ భజనబృందంలో చేరలేకపోవడం మరొక కారణం.

సుధలాంటి సామాన్యురాలు అనుపమ స్నేహితురాలు కాగలిగిందంటే అందుకు కారణం రాధకి తెలుసు. అనుక్షణం అనుపమ అందాన్ని, ఆమె ధరించే దుస్తులని ఆమె కాలిచెప్పులని, చివరకి ఆమె కాలిగోళ్ళకి వున్న పాలిష్‌ని కూడా పొగుడుతూ ఆమెకి నోట్సులు వ్రాసిపెడుతూ, "బాంచన్ నీ కాల్మొక్త" అన్నట్టు వుండే సుధని చూస్తే రాధకి మొదట్లో జాలి కలిగేది.

అనుపమతో కలిసి సినిమాలకి, కేంటిన్లకి వెళ్తూ ఆమె స్నేహబృందంలో ఒకర్తిగా కనిపించాలని తాపత్రయపడే సుధ ఎడల ఏహ్యాభావం ఏర్పడింది ఆమెలో. కాని రాధలోని మరో రాధ అనుపమతో స్నేహాన్ని కోరుకుంటోందని రాధకే తెలియదు. అవసరానికి స్నేహమనే అందమైన ముసుగువేసి సుధని తన వర్గంలో చేర్చుకున్న అనుపమ ఎడల, అనుపమలాంటి డబ్బున్న అమ్మాయితో స్నేహం చెయ్యగలిగిన సుధ ఎడల అకారణద్వేషంతో **మండిపడు**తోందామె మనసు.

"హలో" అనుపమ పలుకరింపులో ఆప్యాయతకంటే ఆడంబరమే ఎక్కువగా ధ్వనిస్తుంటే రాధ ఒళ్ళు భగ్గుమంది. ప్రతిగా తను కూడా తెచ్చిపెట్టుకున్న నవ్వుతో పలుకరించి, ఆమె పక్కనే వున్న ఆ యువకుడి చూపులని తప్పించుకోడానికి అక్కడనుంచి వెళ్ళబోయింది.

"హలో!" అనుపమ పలుకరింపులో ఆప్యాయతకంటే ఆడంబరమే ఎక్కువగా ధ్వనిస్తుంటే రాధ ఒళ్ళు భగ్గుమంది. ప్రతిగా తను కూడా తెచ్చిపెట్టుకున్న నవ్వుతో పలు

కరించి, ఆమె పక్కనే వున్న ఆ యువకుడి చూపులని తప్పించుకోడానికి అక్కడనుంచి వెళ్ళబోయింది.

"ఆ అమ్మాయి నీ ఫ్రెండా?" అతను అనుపమని అడిగాడు. "యా!" నవ్వింది అనుపమ.

రాధ చివాల్న తలెత్తి చూసింది. అనుపమ తనని తన స్నేహితురాలని చెబుతోందా?

"నీ ఫ్రెండ్‌ని నాకు పరిచయం చెయ్యవా?" అతని స్వరంలోని కుతూహలం రాధని తలెత్తి అతనివైపు చూసేలా చేసింది.

అతనింకా ఆమెనలాగే నిర్నిమేషంగా చూస్తున్నాడు. అతని పెదవులపై చిరునవ్వు. అతని కళ్లలో ఎదుటివాళ్లని ఆకట్టుకునే శక్తి ఏదో వుంది.

రాధ ఈసారి ముఖం తిప్పుకోలేకపోయింది. ఆమె పెదవులపైకి కూడా చిరునవ్వు పాకివచ్చింది.

"రాధా! ఇతను నా కజిన్ సుధీర్! తను రాధ నా ఫ్రెండ్" పరస్పరం పరిచయం చేసింది అనుపమ.

"నమస్తే!" చేతులు జోడించాడు అతను. అతని స్వరంలో మర్యాద లేదు. చిలిపితనం వుంది.

"నమస్తే" రాధ ప్రతినమస్కారం చేసింది. అతని చూపులకి ఆమె శరీరం ముడుచుకుపోవడం లేదిప్పుడు.

గూటిలో నిద్రిస్తున్న లోకం తెలియని పక్షికూనని ఉదయిస్తున్న సూర్యుని నులివెచ్చని కిరణం తాకి మేల్కొల్పినట్టు ఆమెలోని స్త్రీత్వాన్ని అతని చూపు మేల్కొల్పింది.

అతని చూపులలో తనపై వ్యక్తమవుతున్న ఆరాధన ఆమె అణువణువుని ఝల్లుమనేలా చేసింది. రాధకి తను అందమైనదాన్నని తెలుసు. కాని తన అందం ఒక డబ్బున్న అబ్బాయిని ఆకట్టుకోగలిగినందుకు





ఆమెకి గర్వంగాను, ఆనందంగాను కూడా వుంది.

ఒక క్షణం ఆ గర్వంలో మైమరిచిన ఆమెకి వెలిసిన పరికిణీ, పాతబడిన జాకెట్టు ధరించి వున్న తను ఆ ఇద్దరిముందు ఎంతో అల్పురాలిలా, వాళ్ళ కాళ్ల దగ్గర బ్రతికేదానిలా ఫీలయింది.

అతని చూపులు ఎక్కడ వున్నాయో గ్రహించిన రాధ సరిగ్గా గుండెల దగ్గర చిరిగిన ఓణీని ఆ చిరుగు కన్పించనియ్యకుండా గాభరాగా సర్దుకుంది. అయితే అతను రాధ అనుకున్నట్టుగా చిరిగిన ఆమె ఓణీని చూడడంలేదు.

ఎత్తయిన ఆమె వక్షాన్ని చూస్తున్నాడు. అతనికి మతిపోయినట్టుగా వుంది. ఎలాంటి అలంకరణలు చేసుకోకపోయినా సహజమైన అందంతో మెరిసిపోతున్న ఆమెని చూడగానే అతని చూపులు ఇంకా అక్కడే నిలవడంతో రాధ గాభరాపడింది.

"నేను వెళ్తాను అనుపమా! క్లాసుకి టైమయింది" అని అక్కడనుంచి కదిలింది.

రాధ నిష్క్రమించాక సుధీర్ అనుపమ వైపు చూసి నవ్వేడు.

"ఎలా వుంది?" అడిగిందామె.

సమాధానంగా మళ్ళీ నవ్వేడతను. ఆ నవ్వులో ఎన్నో అర్థాలు కన్పించాయి ఆమెకి.



మరునాడు కాలేజీగేటు దగ్గరకి రాగానే, రాధకి చిత్రంగా సుధీర్ గుర్తుకొచ్చాడు. ఆమె తల ఎత్తి అతని కోసం అక్కడంతా వెదికింది. అతను కనపడలేదు. తన మనసు ఆ అపరిచిత యువకుడిపట్ల ఆకర్షితమయిందని గ్రహించిందామె

అప్పుడే అక్కడకి వచ్చిన అనుపమ గేటు దగ్గర పరధ్యానంగా నిలబడిపోయిన రాధని చూసింది. ఆమె కనుబొమలు వ్యంగ్యంగా పైకి లేచాయి.

"ఎవరికోసం కాపలా కాస్తున్నావ్?" ఆ ప్రశ్నతో ఉలిక్కిపడిన రాద అనుపమని

చూసింది. ఆమె మాటలలోని వ్యంగ్యం రాధకి కుతూహలంగా ధ్వనించింది. ముఖం ఎర్రబడగా "ఏమీ లేదు" అంటూ ముందుకి నడిచింది.

"సుధీర్ ఇవాళ రాడు! ఊరికి వెళ్ళాడు" ఆమె మనసుని చదివినట్టే అంది అనుపమ. ఇవ్వాళ్టికి ఇంక తను సుధీర్‌ని చూడదు అనే భావం రాధని తీవ్ర అసంతృప్తికి గురిచేసింది. నిన్న పరిచయమైన అబ్బాయి... అదీ ముఖపరిచయంతో తను అతనికోసం ఇలా పిచ్చెక్కినట్టు ఎదురుచూడడం ఎంతవరకు సమంజసం అని ఆలోచించడం లేదామె.

ఆశలు నిండిన మనసు!

ఆలోచింపనివ్వని వయసు!

కాలేజీనుంచి ఇంటికి వచ్చినా, రాధ, సుధీర్ ఆలోచనలలోనుంచి బయటపడ లేదు. పరధ్యాసగా అన్నం కెలికి వదిలి లేచేసింది. ఆమె మనసు ఒంటరితనాన్ని కోరుతోంది.

బట్టలు బాగాలేవనో, ఎప్పుడూ ఆ నాలుగు జతల బట్టలతోనే కాలేజీకి వెళ్తున్నాననో తన అసూనాన్ని ఉక్రోషాన్ని వెళ్ళగక్కుతూ తనపై చిర్రుబుర్రులాడుతూ వుండే కూతురు అలా మందకొడిగా వుంటే, ఆ తల్లి మను కళవళపడింది. "ఏమయింది రాధీ! ఒంట్లో బాగా లేదా? " చీకట్లో పడుకుని వున్నకూతురి నుదుట చెయ్యి ఆనించి ఆదుర్దాగా అడిగింది.

"బాగానే వుంది"

"మరెందుకలా వున్నావ్? "

"తనలోని మార్పుని తల్లి గమనించిందా? " రాధ గుండె క్షణం ఆగినట్టయింది. కంగారు కప్పిపుచ్చుకుంటూ అడిగింది. "ఎలా వున్నాను? "

"రోజూలా లేవు!"

"నేను బాగానే వున్నానని చెబుతున్నానుగా! కాస్సేపు నన్ను ఒంటరిగా వదిలిపెట్టు" అనవసరంగా తల్లిపై ఆగ్రహాన్ని వ్యక్తం చేసింది

ఆమె కళ్ళముందు సుధీర్ మెదులుతున్నాడు. అతన్ని చూసింది మూడు నిముషాలే అయినా ఎంత అలజడి రేపాడనీ! ఎందుకింత కలవరం తనలో? ప్రేమ అంటే ఇదేనా?

మరునాడు కాలేజీగేటు దగ్గర కన్పించిన సుధీర్‌ని చూడగానే రాధ హృదయం లయ తప్పింది.

"హలో? " అన్నాడతను.

"హలో!" అన్నాననుకుంది రాధ. కాని, గుండెగొంతుకలో కొట్టుకుంటున్న తరుణంలో పెదవులు కదిలినా, శబ్దం బయటకి రాలేదు. ఆమెకి బెరుగ్గా వుంది, తను సుధీర్‌తో మాట్లాడితే ఎవరైనా చూస్తారని.

ఇంతలో అనుపమ వచ్చి వాళ్ళని కలుసుకుంది. రాధ, తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. అనుపమ తమతో వుండడంవలన తనకే లాభం! తను సుధీర్‌తో మాట్లాడడం చూసినవాళ్ళెవరైన తనని అపార్థం చేసుకునే ప్రమాదం వుంది.

మొదట్లో బెరుగ్గా ఫీలయిన రాధ కొద్దిసేపటికే అతనితో ఫ్రీగా మాట్లాడగలిగింది. ప్రతిరోజూ కాలేజీ టైముకి అరగంటముందే వచ్చి అనుపమ, సుధీర్‌లతో కబుర్లు చెప్పడం ఆమె దినచర్యలో ఒక భాగమయింది. పదిరోజులు గడిచేసరికల్లా ఎప్పుడైనా సుధీర్ రాకపోతే "నిన్న రాలేదేం? " అని అడిగే చనువు పెరిగింది రాధకి. క్రమేణా తమ ఇద్దరి మధ్య అనుపమ వుంటే భరించలేనట్టు అన్పించసాగిందామెకి.



సునీత ఎడల ఈర్ష్యతో ఆమెకి దూరమైన రాధకి తెలియదు ఆమె తనపై అసూయ పడుతోందని, తనతో సమానస్థాయిలోనే వున్న సునీత తనకంటే తృప్తిగా బ్రతకడం రాదకి ఆమెపై అసూయని కలుగచేస్తే ధన

వంతుల కుటుంబానికి చెందిన అనుపమ ఒక మెట్టు కిందకి దిగి రాధలాంటి సామాన్యురాలితో స్నేహం చెయ్యడం సునీత ఈర్ష్యకి ముఖ్యకారణం.

ఆరోజు సినిమా హాలులో అనుపమతో స్నేహాన్ని పురస్కరించుకుని సునీత ఆమెతో స్నేహాన్ని కొనసాగించబోయింది. అయితే అనుపమ సునీతతో తనకి అవసరం వున్నంతవరకే స్నేహం చేసింది. మరో మాటలో చెప్పాలంటే, సునీతని వాడుకుని వదిలేసింది.



అనుపమ సినిమా థియేటర్‌లో తనతో స్నేహంగా మాట్లాడిన తీరు, ఆ మాటలల్లో ధ్వనించిన ఆపేక్షతో ఉబ్బి తబ్బిబ్బయిన సునీత మరి రెండురోజుల తర్వాత కాలేజీ కేంపాస్‌లో కన్పించిన ఆమెని పలుకరించడమే కాదు, చనువుగా మాట్లాడబోయింది కూడా. కాని, అనుపమ ముక్తసరిగా మాట్లాడి వెళ్ళిపోవడం కాదు సునీతని ఆశ్చర్యపరిచింది, అనుపమ ప్రక్కనేవున్న రాధని ఆ ఇద్దరి మధ్య వున్న స్నేహాన్ని చూసి ఆశ్చర్యపడింది. అనతికాలంలోనే రాధ అనుపమ, స్నేహబృందంలో కర్తగా మారిపోవడం సునీతకి ఈర్ష్యని ఋగచేసింది.

అనుపమ కాలేజీనుంచి ఇంటికి వెళ్లేప్పుడు ఆమెతోబాటు విధిగా రాధవుండేది. ఆరోజు అనుపమ కారు దగ్గర నిలబడి ఆమెతో మాట్లాడుతున్న రాధని సునీత ఈర్ష్యతో గమనిస్తోంది.

సౌందర్య సామ్రాజ్ఞి రాధ!

డబ్బు తెచ్చిన హుందాతనంతో అనుపమ. ఆ ఇద్దరి సంభాషణలో స్నేహపరిమళం గుబాళిస్తోంది. ముఖం తిప్పుకుని గేటుదాటి వెళ్ళబోయిన సునీత అక్కడికి హీరోహోండామీద ఒక యువకుడు రావడం, అతను రాధతో నవ్వుతూ మాట్లాడడం గమనించి విస్మయపడింది.

మరునాడే కాదు... వరుసగా కొన్ని రోజులు ఆ యువకుడు కాలేజీ వదిలే టైముకి రావడం గమనించిన సునీతలో కుతూహలం పెరిగింది. వాళ్లని గమనించడమే ధ్యేయంగా పెట్టుకున్న ఆమెకి ఒక నిజం తెలిసింది.

అతను అనుపమ కోసం రావడం లేదక్కడకి. రాధకోసం వస్తున్నాడు. ఈ రహస్యాన్ని కనిపెట్టిన సునీతకి డబ్బు, అందం, ఆకర్షణ అన్నీ వున్న ఒక యువకుడు అందం తప్ప ఏమీలేని రాధపట్ల ఆకర్షితుడవడం మరింత అసూయని కలిగించింది. వాళ్ళిద్దరి మధ్య వున్న ఆకర్షణ ప్రేమగా బలపడి అది పెళ్లికి దారితీస్తుందా, లేదా అన్నది వేరే సంగతి.

గొప్పగా బతకాలని కాదు. తను గొప్పగా బతుకుతున్నానని నలుగురూ అనుకోవాలని, అసూయపడాలని కోరుకునే సునీతలాంటి అమ్మాయి తనకి దక్కని అదృష్టం రాధని వరించబోతోందని అసూయపడడంలో వింతేమీలేదు.



ఆరోజు అనుపమ కాలేజీకి వస్తూనే చెప్పింది.

"ఇవాళ మేమందరం క్లాసులకి డుమ్మా కొట్టి మార్నింగ్‌షోకి వెళ్తున్నాం. నువ్వు వస్తావా?"

"అందరం అంటే?"

అనుపమ చెప్పింది. ఆమె చెప్పినవాళ్ళలో సుధీర్ లేడు రాధకి నిరాశగా అన్పించింది.

ఆమె కళ్లలో వ్యక్తమవుతున్న నిరాశని గమనించిన అనుపమ అంది.

"సుధీర్ మనతో సినిమాకి రావడం లేదు'

రాధకి తన మనసు బయటపడిపోయినందుకు సిగ్గనిపించింది.

"అది కాదు. నాకు సినిమాకి రావాలనే వుంది. కానీ మా ఇంట్లో ఒప్పుకోరు!" అంది.

"మీ ఇంట్లో వాళ్ళకెలా తెలుస్తుంది? మనం కాలేజీకి వెళ్ళామనే అనుకుంటారు!"

"నిజమే కదా!" అనిపించింది రాధకి.

"నీ ఇష్టం. నీకు రావాలని వుంటేనే రా! బలవంతమేమీ లేదు" అనుపమ అలా అనగానే వెంటనే అంగీకరించింది రాధ.

"వస్తాను" అనేసింది.

సినిమా థియేటర్ చేరుకున్నాక ఇసుక వేస్తే రాలకుండావున్న జనాన్ని చూసి టికెట్లు దొరకడం అసంభవం అనే అన్పించింది రాధకి.

అనుపమ ధీమాగా థియేటర్‌లోకి నడుస్తుంటే అంది.

"టికెట్లు దొరకవేమో అనూ!"

"ఈ థియేటర్ మాదే! టికెట్లు కొనక్కర్లేదు" అందామె. కళ్ళు వెడల్పు చేసుకుని చూసింది రాధ.

అప్పటికే హైక్లాసు టికెట్లన్నీ నిండిపోవడంవలన రాధ, అనుపమలకి ఒకచోట, మిగిలిన వాళ్ళందరికీ మరొకచోట సీట్లు దొరికాయి.

అనుపమ, పక్కనే కూర్చున్న రాధకి ఆ అనుభవం గమ్మత్తుగా, తమాషాగా వుంది. కాలేజీకని చెప్పి క్లాసులు ఎగ్గొట్టి సినిమాకి రావడం మరీ నచ్చింది. ఆమెకి తన ఇల్లు గుర్తువచ్చింది. తండ్రి గుర్తుకొచ్చాడు. పది





సార్లు అడిగాక తండ్రి సినిమాకి పంపిస్తాడు. బొటాబొటిగా సినిమాకి సరిపడే డబ్బులిస్తాడు. ఎర్రటి ఎండలో సిటీ బస్సెక్కి అంతదూరం వెళ్ళి క్యూలో నిలబడి టికెట్టు కొని, దాహంతో నోరు పిడచకట్టుకుని పోతుంటే, కనీసం సోడా కొనుక్కోడానికి కూడా డబ్బులు లేక...

ఛీ... ఛీ...! రాధ కసిగా ఆ జ్ఞాపకాలని నలిపేసింది.

తను ఇలా క్లాసులు ఎగ్గొట్టి సినిమాకి వచ్చి సినిమాకి కూడా డబ్బులివ్వని తన పీనాసి తండ్రిపై ఒకవిధంగా ప్రతీకారం తీర్చుకున్నట్టే. రాధ కసిగా పళ్ళు కొరుక్కుంది.

టైటిల్స్ పూర్తయి సినిమా మొదలయింది. రాధ సినిమాలో లీనమయింది. అదొక ప్రేమ కథా చిత్రం. హీరో హీరోయిన్ల ప్రేమ అపార్థాలు తొలిగి బలపడి వానపాటతో వెల్లువయింది.

తెరమీద హీరోయిన్ వర్షంలో చిందులేస్తోంది. హీరో ఆమె ఒంటి వేడిలో తన తడి ఒంటిని ఆరబెట్టుకుంటున్నాడు, రాధ అప్రయత్నంగా పక్కకి చూసినదల్లా ఉలిక్కిపడి నిటారుగా అయింది. తన పక్కన అనుపమలేదు. సు...ధీ...ర్... వున్నాడు.

"హలో!" నవ్వుతున్నాడు తను.

"మీరు... ఎలా? " రాధ సంభ్రమంతో తలమునకలవుతూ మాటలకోసం తడుముకుంది.

"మీకెలా తెలుసు నేను సినిమాకి వచ్చానని? "

"తెలుసుకున్నాను"

"ఎలా? "

"అసాధ్యమేమీ కాదు" అతను నవ్వేడు.

రాధకి సుధీర్ తన పక్కనే కూర్చున్నాడంటే ఇంకా నమ్మబుద్ధి కావడంలేదు. ఆమెకి సినిమా చూడాలనే ఆసక్తిపోయింది.

ఆమె వెడల్పయిన కళ్ళలోని ఆశ్చర్యాన్ని గమనిస్తూ అన్నాడతను.

"నీకోసం కాలేజీకి వచ్చాను. మీరంతా కలిసి ఈ సినిమాకి వచ్చారని నీ క్లాస్‌మేట్ నీరజ చెప్పింది"

"నాకోసమా? ఎందుకు? "

"నీతో ఒక విషయం మాట్లాడాలని"

"నాతోనా? ఏమిటది? "

అతను ఆమె ముఖంలోకి తదేకంగా చూస్తూ అన్నాడు. "ఐ లవ్ యూ!"

రాధ గుండె ఝల్లుమంది. అణువణువునా తియ్యని ప్రకంపనలు కలిగాయి.

అతనామె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. అతని చేతిలో ఆమె చెయ్యి మెత్తగా నలిగిపోతోంది. ఆమె మెడని అతని ఊపిరి వెచ్చగా కాలుస్తోంది. ఆ చెయ్యి ఆమె మోచేతిమీదుగా పైకి ప్రాకి, ఆమె భుజంమీద పడింది. ఆలేత భుజం తాలూకు నునుపుదనాన్ని అనుభవిస్తున్నట్టుగా కొద్ది నిముషాలు అక్కడే వుండి... మెడకిందుగా కిందకి...

రాధ ఉలిక్కిపడింది. వెంటనే ఆ చేతిని దూరంగా జరిపేసింది.

"మన పెళ్ళయ్యేదాకా ఇలాంటివేమీ వద్దు" చిన్నగా వణికే స్వరంతో అంది.

నవ్వేడు సుధీర్. "సర్లే! పోనీ చెయ్యి ముట్టుకోవచ్చా? " అల్లరిగా అన్నాడు.

రాధ మాట్లాడలేదు. ఆ మౌనం అర్ధాంగీకారంగా భావించి, అతనామె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. రాధని అతని స్పర్శ దహిస్తోంది. అణువణువునా ఏదో కావాలనే ఆరాటం!

"మనం ఇలాంటి ఇల్లు కట్టుకుందాం సుధీర్!" అంది సినిమాలో హీరో ఉంటున్న ఇంద్రభవనంలాంటి ఇంటిని చూస్తూ.

"ఇలాంటిదే కావాలా? సరే? " నవ్వేడు. "నువ్వు కోరుకుంటే ఇలాంటి ఇల్లేమిటి, ఇంద్రభవనాన్ని నేలకి దింపనూ? " అతని మాటలు తనకి వాగ్దానమిచ్చినట్టుగా అనిపించింది రాధకి.

రాధకి సినిమా బదులుగా సుధీర్‌తో తన



పెళ్ళి, అతనితో కలిసి తను అనుభవించబోయే భోగభాగ్యాలు కళ్ళముందు మెదులుతున్నాయి.

సుధీర్ రాధనే చూస్తున్నాడు. అతనికి ఆమె అపురూపమైన రూపలావణ్యాలు మతి చెదరగొడుతున్నాయి. ఒకలాంటి మత్తులో వుండిపోయారు ఆ ఇద్దరూ.



ముఖమంతా ఎర్రగా చేసుకుని ఉగ్రంగా అరిచాడు రామారావు.

"యాభై కేజీల బియ్యం కొని నెలకాలేదింకా. అప్పుడే బియ్యం అయిపోయాయా? "

"పిల్లలు ఎదుగుతున్నారు. మామూలుగా పోసే బియ్యంమీద ఒక చారెడు ఎక్కువే పోసివండుతున్నాను. అదీగాక బియ్యం మంచివి కాదు. అన్నం ఉరుమవడంలేదు"

తండ్రి తెచ్చిన బియ్యం ఇరుగుపొరుగులకి అమ్మే తల్లిని తండ్రి నిలదీసి అడిగితే ఏం సమాధానం చెబుతుందా అని దడదడలాడే గుండెలతో ఎదురుచూస్తున్న సునీత తల్లి చెప్పిన నిజంలాంటి అబద్ధాన్నీ అది నమ్మిన తండ్రినీ చూసి తేలిగ్గా ఊపిరిపీల్చుకుంది.

రామారావు భార్య అందించిన సంచీ తీసుకుని కొట్టువైపు వెళ్ళాడు.

తన ఇంట్లో తనే దొంగగా మారిన తల్లిని సునీత అసహ్యించుకోలేదు. పైగా మనసులోనే అభినందించింది. తండ్రి డబ్బు ఇవ్వడు! పిల్లల చిన్నచిన్న సరదాలను తీర్చడానికి ఆమె అవలంభించిన మార్గం తప్పుగా అన్పించలేదు. కాని, తండ్రిని అందమైన అబద్ధాలతో మోసగిస్తూ తల్లి లోలోపల ఎంత వ్యధని అనుభవిస్తోందో సునీతకి తెలియదు. తెలుసుకోవలసిన అవసరం కూడా ఆమెకి కలగదు.

కొత్తగా దొరికిన స్నేహితులు... తల్లి ద్వారా తీరుతున్న సరదాలు... వీటిమధ్య ఆమెకి రోజులు క్షణాల్లా గడిచిపోతున్నాయి.



శారద చదువుతున్న పుస్తకం మూసిపెట్టి తల్లి దగ్గరకి వచ్చింది.

"అమ్మా"

కూర తరుగుతున్న జానకి తల ఎత్తకుండానే "ఏం కావాలి? " అనడిగింది.

"మన వూళ్ళోని యూత్‌క్లబ్ వాళ్ళు జిల్లా స్థాయిలో క్విజ్ పోటీ కండక్ట్ చేస్తారుటమ్మా! దానిలో పార్టిసిపేట్ చెయ్యడానికి మా కాలేజీ తరపున నన్ను సెలెక్ట్ చేసారు''

"నిజమా? " జానకి ముఖం సంతోషంతో దీప్తివంతమయింది.

"అవునమ్మా! జిల్లాస్థాయిలో అంటే చాలా కాలేజీలనుంచి చాలా మంది వస్తారు. నేను బాగా ప్రిపేరవ్వాలి. లైబ్రరీకి వెళ్ళి జనరల్ నాలెడ్జి బుక్స్ చదవడం సాధ్యంకాదు. కనుక నాలుగైదు జనరల్‌నాలెడ్జి బుక్స్ కొనుక్కుంటానమ్మా! ఏం? "

"అలాగేమ్మా! మీ నాన్నగారితో చెబుతాను!" శారద అసంతృప్తిగా చూసింది.

తల్లి ఉద్యోగం చేస్తోంది. అయినా ఆమెని ఎప్పుడు డబ్బు అడిగినా, తండ్రిని అడగాలంటుంది. శారద తన అసంతృప్తిని బయటపడనివ్వకుండా వెళ్ళి మళ్ళీ చదువుకోడం మొదలుపెట్టింది.

నిజానికి జానకి జీతం రాగానే అంతా





భర్త చేతులలో పెట్టేస్తుంది. "సంసార బాధ్యత అంతా అతడు స్వీకరించాడు. తనకేం కావలసినా అతడే కొంటున్నాడు తనకి వేరేఖర్చు లేముంటాయి" అన్నదే ఆమె ధీమా! తలవని తలంపుగా ఏదో ఖర్చు వచ్చి పడి భర్తని డబ్బు అడిగి లేదనిపించుకున్న సందర్భాలు కూడా వున్నాయి. అయితే తను సంపాదిస్తున్న డబ్బుపై పెత్తనం చేస్తున్న భర్తపై ఆమెకి కోపం లేదు. తమ పిల్లలకోసమే కదా, భర్త డబ్బు దాస్తున్నాడనే తృప్తి.

శారద జనరల్ నాలెడ్జి పుస్తకాలు కొనాలనుకుంటోందని జానకి చెప్పగానే, సాంబశివరావు విసుగ్గా అన్నాడు.

"పరీక్షలముందు ఇప్పుడు మళ్ళీ పుస్తకాలేమిటి?"

జానకి చెప్పింది.

"ఇప్పుడు అది క్విజ్ లో పార్టిసిపేట్ చెయ్యకపోతే నష్టమేమీ లేదు. ఇప్పుడంత ఖర్చుపెట్టి పుస్తకాలు కొనక్కర్లేదు. ఆ మార్కులు పరీక్షలో వచ్చే మార్కులతో కలపరు కదా!"

జానకి నేరుగా కూతురి ముఖంలోకి చూడలేకపోయింది.

శారదకి కన్నీళ్ళొచ్చాయి.

"తను చాలా మందిలా కొత్త చీరెలకోసం, సినిమాలకి, పిక్నిక్ లకోసం తండ్రిని డబ్బు అడగడంలేదు. తన ప్రతిభని పరీక్షించుకోవడం కోసం, చిన్న గుర్తింపుకోసం క్విజ్ లో పార్టిసిపేట్ చెయ్యాలనుకుంది. అందుకు అవసరమైన పుస్తకాలకి కూడా తండ్రి డబ్బు లేదనేసరికి ఆమెకి ఆశాభంగంతో కన్నీళ్ళు వచ్చాయి.

"పోనీ నువ్వయినా డబ్బివ్వచ్చు కదమ్మా!" అడగలేక అడిగిన కూతుర్ని జాలిగా చూసింది జానకి.

"నాదగ్గర డబ్బు వుండదు శారదా! ప్రతి నెలా జీతం మొత్తం మీ నాన్నగారి చేతులలో పెట్టేస్తాను"

శారద కొత్త విషయం వింటున్నట్టు చూసింది.

"ఇంట్లో ఇంత పనిచేసి ఆఫీసుకి వెళ్ళి ఉద్యోగం చేస్తావు! ఒక రకంగా మన కుటుంబ బాధ్యతలో నువ్వే ఎక్కువ పాలు పంచుకుంటున్నావు! నువ్వు సంపాదించుకునే డబ్బు పై నీకు హక్కు లేకపోవడం నీకు బాధగా లేదామ్మా!"

"మీ నాన్నగారు డబ్బు పాడుచెయ్యడం లేదు కద శారదా! మనకోసం... మీ చదువులకోసం, పెళ్ళిళ్ళకోసం డబ్బు దాచిపెడుతున్నారు. నాకెందుకు బాధ?"

శారదకి తల్లి అమాయకత్వానికి జాలిపడాలో, ఆమె మంచితనాన్ని మెచ్చుకోవాలో అర్థంకాలేదు.

ఆమెకి ఒకప్పుడు రాధ అన్న మాటలు గుర్తువచ్చాయి. స్త్రీకి కావలసినది ఆర్థిక సుస్థిరత కాదు, ఆర్థిక స్వాతంత్ర్యం. తన కంటూ కొంత డబ్బు సంపాదించుకోడం ముఖ్యం కాదు. తన సంపాదనని ఖర్చుపెట్టుకునే స్వేచ్ఛ"

ఆ సంఘటన ఆమె మనసుపై బాగా పని చేసింది. ఉద్యోగం చేసి తన కాళ్ళమీద తను నిలబడగలగాలి అనేది ఆమె లక్ష్యం తన స్వార్జితాన్ని తను స్వతంత్రంగా ఖర్చు పెట్టుకోగలగాలి. జీవితమంతా కన్యగా మిగిలిపోయినా ఫర్వాలేదు. అనే పట్టుదలగా మారింది.



ఒక మారుతీ జిప్సీ, అంబాసిడర్ కారు పిక్నిక్ స్పాట్ వైపు ప్రయాణిస్తున్నాయి. జిప్సీడ్రైవ్ చేస్తున్న సుధీర్ పక్కనే కూర్చున్న రాధకి తను ప్రయాణం చేస్తున్న జీపు విమానంలా మబ్బులపై తేలియాడుతున్నట్టు వుంది. జీపు వెనుక సీట్లో కూర్చున్న ప్రశాంతి, కాత్యాయనిలు అదృశ్యమై పోయి తను సుధీర్ మిగిలిపోతే బాగుండున్నని

స్తోంది.

జీపు గమ్యంచేరేవరకు ఆమె సుధీర్‌తో కలిసి అందమైన ఊహలలో తేలిపోతూనే వుంది. కొంచెంసేపు అందరూ కార్డ్సు ఆడారు. వెంట తెచ్చుకున్న ఫలహారాలను తిని, కూల్‌డ్రింక్స్ తాగారు. జోక్స్! నవ్వులు! రాధకి కొత్త ప్రపంచంలో అడుగు పెట్టినట్టుంది.

హఠాత్తుగా అక్కడ అనుపమ లేని విషయం గమనించిన రాధ అడిగింది. "అనుపమ ఏది? "

సుధ సమాధానం చెప్పలేదు. నవ్వింది.

"తను, రజనీష్ ఏకాంతాన్ని వెదుక్కుంటూ వెళ్ళి వుంటారు" అన్నాడు సుధీర్. ఏకాంతం అనే మాట రాధకి నచ్చలేదు.

ఆమె తలతిప్పుకుని, ప్రశాంతి, కాత్యాయని షటిల్ ఆడుతుంటే చూస్తోంది.

సుధీర్ కనుసైగతో పిలిచాడు రమ్మన్నట్టు. ఎక్కడికన్నట్టు చూసింది రాధ.

"చెబుతాను రా!" గుసగుసగా అన్నాడు.

రాధ లేచింది అయిష్టంగానే. ఆమెకి మనసులో బెరుగ్గా వుంది. 'ఇలా ఇంతమంది వుండగా, తామిద్దరూ ఎక్కడికో వెళ్ళడమేమిటి? '

సుధీర్ ఎదురుగా కన్పిస్తున్న కొండ దిగువకి నడుస్తూ తన పక్కనే నడుస్తున్న రాధతో అన్నాడు చిరుకోపంగా.

"నిన్ను పిక్నిక్‌కి రమ్మన్నది వాళ్ళు షటిల్ ఆడుతుంటే చూడ్డానికి అనుకున్నావా? నీతో కొద్దిసేపు ఒంటరిగా గడపడానికి ఈ పిక్నిక్ ఎరేంజిచేసాను. నిజానికి నిన్ను ఒక్కర్తినీ తీసుకుని ఇక్కడికి వద్దామనుకున్నాను తెలుసా? నువ్వు ఒప్పుకోవని వీళ్ళందరిని తీసుకురావలసి వచ్చింది"

రాధ కవ్వింపుగా అతనివైపు చూసింది. "పాపం! నన్ను ఒక్కదానినే పిక్నిక్‌కి తీసుకువచ్చే ఛాన్స్ పోయినందుకు బాధగా వుందా? "

"లేదు..." వెంటనే అన్నాడు. "చేజారిన అవకాశం గురించి నేనెప్పుడూ బాధపడను"

ఇద్దరూ వెళ్ళి ఒకచెట్టునీడని కూర్చున్నారు. తామిద్దరే ఏకాంతంగా వున్న ఆ వాతావరణంలో రాధని చూస్తుంటే సుధీర్ మనశ్శరీరాలు వశం తప్పుతున్నాయి.

అతని చూపులకి ఇబ్బందిగా కదిలింది రాధ.

"ఇంతకీ నన్నెందుకు ఇక్కడకి తీసుకొచ్చారు"

"నీతో కలిసి ఈ అందమైన అనుభవాన్ని పంచుకోడానికి" 'అనుభవం' అనే మాటని వత్తి పలుకుతూ అన్నాడు.

"ఇక్కడ చాలా బాగుంది కదూ? " రాధ చుట్టూ చూస్తూ అంది.

"అవును... ఇక్కడకి ఎవరూ వచ్చి మనని డిస్టర్బ్ చెయ్యరు కూడా"

అతని మాటలలో ధ్వనిస్తున్న గూఢార్థాలు రాధకి అర్థంకాలేదు.

తననే మత్తుగా చూస్తున్న అతనితో అంది.

"ఏమిటలా తినేసేలా చూస్తున్నారు? "

"తినేద్దామనే" ఇంకా అలాగే చూస్తూ అన్నాడు.

"రాధా! ఒక్కసారి నా దగ్గరగా రా!" అతని చూపులలోని మార్పు గమనించిన రాధ గుండె ఝల్లుమంది. ఆమె చటుక్కున లేచింది.

"నేను వెళ్తాను" అనడమే కాదు అక్కడ నుంచి వెళ్ళిపోబోయింది కూడా.

"రాధా!" గాభరాగా పిలిచాడు సుధీర్. ఆమె క్షణం ఆగింది... "మొద్దు... నిన్ను దగ్గరకి రమ్మన్నది అందుకు కాదు. నీకో కానుక ఇవ్వాలని" చప్పున సర్దుకున్నాడు.

రాధకి చచ్చేంత సిగ్గేసింది, తను బయట పడిపోయినందుకు.

"రా, కూర్చో" అతనామె చెయ్యి పట్టి లాగి కూర్చోబెట్టాడు. "ఇదుగో, ఇవి నీకు కాను





కగా ఇద్దామని తెచ్చాను" అతను తన భుజానికి వున్న బ్యాగ్‌లోనుంచి ఒక పేకెట్టు తీసి ఆమెకి ఇచ్చాడు.

"థ్యాంక్‌యూ! కాని, ఏమిటిది? "

"నువ్వే చూడు!" రాధ ఆ పేకెట్టు విప్పి అందులో నుంచి బయటపడిన నెయిల్ పాలిష్, ఫారిన్ పెర్‌ఫ్యూమ్ బాటిల్‌ని చూసి ఓ... అంది సంతోషంనిండిన స్వరంతో.

సుధీర్ ఆమెని దారికి తెచ్చుకోలేకపోయిన తన చేతకాని తనాన్ని నిందించుకుంటూ పైకి నవ్వుతూ చూస్తున్నాడు.

"థ్యాంక్‌యూ! థ్యాంక్‌యూ వెరీమచ్!" రాధ కళ్ళు మెరిసాయి.

"మరోసారి ట్రైచేద్దాం" అనుకున్న సుధీర్ ఆమె చేతిలోనుంచి పెర్‌ఫ్యూమ్ బాటిల్‌ని అందుకుని ఆమె వారించేలోగానే ఆమె మెడమీద స్ప్రే చేసాడు.

"ఏమిటిది, ఇప్పుడు నేను ఇంటికెలా వెళ్ళాలి? " భయంగా అంది రాధ.

"ఏం"

"నా దగ్గర ఈ పెర్‌ఫ్యూమ్ వాసనవస్తే మా ఇంట్లోవాళ్ళకి అనుమానం రాదా? "

"అనుపమ ఇచ్చిందని చెప్పు"

"గుడ్ అయిడియా!" నవ్వింది రాధ. 'నాకు తట్టనే లేదు సుమా!'

సుధీర్ ఆమె భుజంపై చెయ్యివేస్తూ అన్నాడు, "ఈ సుగంధంలా నీ ఒంటికి చుట్టుకోవాలని వుంది రాధా!"

రాధ అతనూహించినట్టు ఈసారి బెదరలేదు. మృదువుగా అతని చేతిని తొలగిస్తూ అంది.

"నేను కాదనలేదుగా? మన పెళ్ళయ్యే దాకా ఆగమన్నాను అంతే. చీకటి పడబోతూంది. రండి వెళ్దాం" లేచిందామె.

"కొరకరాని కొయ్య!" కసిగా పళ్ళు నూరుకున్నాడు సుధీర్ ఆమెని అనుసరిస్తూ.



"రాధా! రాధా!"

సింహగర్జనలాంటి భర్త పిలుపు విన్న రాధ తల్లి విశాలాక్షి ప్రాణాలు పైనే పోయాయి.

"ఏంకావాలండీ? " గడపలోకి వచ్చి నిలబడింది.

"రాధ ఎక్కడ? "

"ఇంకా ఇంటికి రాలేదు. ప్రైవేటు క్లాసులున్నాయని..."

ఆమె చెప్పేది పూర్తికాకుండానే, సుడిగాలిలా గదిలోకి దూసుకెళ్ళాడు లోకేశ్వరరావు.

ఆయన వెనుకే లోపలకి వెళ్లిన విశాలాక్షి ఆయన చేస్తున్న పనిని చూసి నివ్వెరపోయి అలాగే నిలబడిపోయింది.

కూతురి బట్టల పెట్టెని తీసి పైనవున్న బట్టలన్నీ కిందపడేసి ఆయన పెట్టె అడుగునుంచి బయటపడిన నెయిల్‌పాలిష్, పెర్‌ఫ్యూమ్ బాటిల్స్‌ని భార్యకి చూపిస్తూ "ఇవి రాధకి ఎక్కడివి? " అనడిగేడు.

విశాలాక్షికి నెయిల్ పాలిష్‌తో మెరుస్తున్న రాధ చేతిగోళ్లు కన్పిస్తున్నాయి. తన స్నేహితురాలు అనుపమ తన గోళ్ళకి రంగు వేసిందని చెప్పడమూ గుర్తువస్తోంది. ఇప్పుడు ఎదురుగా నెయిల్ పాలిష్‌తోబాటు పెర్‌ఫ్యూమ్ బాటిల్ కూడా కన్పిస్తుంటే ఆవిడ సర్పద్రష్టురాలిలా చూస్తోంది.

"రాధ ప్రతిరోజూ ఇంటికి ఆలస్యంగా వస్తూ ప్రయివేటు క్లాసులున్నాయని చెబుతున్నది కూడా అబద్ధమేనా? " అని భయపడింది తనలో తాను.

"రాధ కాలేజీనుంచి రోజూ ఆలస్యంగానే వస్తోందా? " భర్త అడిగాడు.

"ప్రయివేటు క్లాసులున్నాయని..."

"అది కాలేజీనుంచి ఇంటికి తిన్నగా రావడంలేదు. హీరో హోండాపై ఎవరితోనో తిరుగుతోంది!"

విశాలాక్షి కళ్లలో అప్పటికే నీళ్లు కమ్ముకో

స్తున్నాయి.

"అయ్యో!" అనే ఆక్రందన ఆమె స్వరం నుంచి వెలువడింది.

"మన రాధ అలాంటి పిల్ల కాదండీ!"

అంటే! ఈ గోళ్లరంగు... ఆ పెర్ఫ్యూమ్ దాని స్నేహితురాలే దానికి ఇచ్చిందనే భ్రమలో వున్నావా నువ్వు? అసలు ఇలాంటి విషయాలు తల్లివి నువ్వే ముందుగా గ్రహించాలి. లోకేశ్వరరావు కోపం వున్నట్టుండి భార్యపైకి తిరిగింది.

"అది కాలేజీకి వెళ్తోందో, కాలేజీకని చెప్పి మన కళ్లు కప్పి ఏ వేషాలేస్తోందో కనిపెట్టలేని నువ్వేం తల్లివి? అయినా దానికి స్నేహితులెందుకు? చదువుకోమని కాలేజీకి పంపిస్తే..."

"ఎక్కడో ఏదో పొరపాటు జరిగిందండీ! మన రాధకి సునీత తప్ప వేరే స్నేహితులెవరూ లేరు. అలాంటిది ఎవరో అబ్బాయితో స్నేహం చెయ్యడమేమిటి? మీరు మరెవర్నో చూసి రాధే అనుకుని పొరపాటుపడి వుంటారు. విశాలాక్షి భయంగానే రాధమీద తనకి వున్న నమ్మకాన్ని వ్యక్తపరిచింది.

"నా కళ్లతో నేను చూశాక కూడా ఇంకా నమ్మమంటావా? ఇవాళ రాధ గులాబీ రంగు ఓణీ వేసుకుంది. అవునా?"

"గులాబీరంగు ఓణీ వేసుకున్నంత మాత్రాన ఆ అమ్మాయి రాధేనా" అని అడగలేదు విశాలాక్షి. కూతురు ఇంటికి వస్తే భర్త ఏం గొడవ పెడతాడో తెలుసామెకి. ఆమె ఏడుస్తోంది.

నిముషాలు భయంకరంగా గడిచిపోతున్నాయి. లోకేశ్వరరావు విసురుగా గదిలో పచార్లు చేస్తున్నాడు. అప్పుడు లోపలకి వచ్చాడు హరి. పుస్తకాలతో లోపలకి వస్తున్న కొడుకుని ఎర్రగా చూస్తూ కొట్టినట్టు అడిగాడు లోకేశ్వర్రావు.

"ఏం? ఇంత ఆలస్యంగా వచ్చావేం?"

"ప్రయివేటు క్లాసు..." కొడుకు మాట పూర్తి కాకుండానే ఈడ్చి వాడి చెంపపై కొట్టాడాయన.

ఆ దెబ్బకి అల్లంత దూరంలో పడ్డాడు వాడు.

"ప్రయివేటు క్లాసు.. నీకూ ప్రయివేటు క్లాసేనా? ఏ సినిమా హాల్లో చెబుతున్నార్రా నీకు ప్రయివేటు క్లాసు?" కొడుకుపైకి బారలు చాపుకుంటూ వెళ్లాడు.

తను సినిమాకి వెళ్లానని అపోహపడుతున్నాడు తండ్రి. హరికి తండ్రిని నమ్మించడం అసాధ్యం అన్పించింది.

"నేను నిజంగా స్కూలునుంచే వస్తున్నాను నాన్నా! ఇవాళ ఇంగ్లీషు ప్రయివేటు క్లాసు. కావాలంటే మా మేస్టారిని అడగండి" ఏడుపు, రోషము కలగలిపిన స్వరంతో అన్నాడు.

"నువ్వు స్కూలునుంచి ఆలస్యంగా వచ్చినప్పుడల్లా నువ్వు నిజంగా స్కూలులో వున్నావో, సినిమాకి వెళ్లావో అని వూళ్లో వున్న ప్రతి సినిమాహాలు వెదకడమే నాకు పనిరా?"

హరేకాదు. విశాలాక్షి కూడా నిర్ఘాంతపోయి వింటోంది. భర్తది కేవలం అనుమానమే. కాని, అది నిజమన్నట్టు ఆయన కొడుకుని నిలదీసి నిందిస్తుంటే ఆమె సహించలేకపోయింది. అలా అని భర్తని ఎదిరించే ధైర్యమూ లేక కొడుకుని అవతలకి పంపింది.

అప్పుడే ఇంటి మెట్లెక్కి లోపలకి వస్తున్న రాధని చూసేప్పటికి లోకేశ్వరరావు అగ్నిలో ఆజ్యం పోసినట్టు మండిపోయాడు.

"ఎక్కడనుంచి వస్తున్నావ్?" తండ్రి స్వరంలోని ఆగ్రహం ఆ వెనుకనే నిలబడిన తల్లి కళ్లలో భయం చూసిన రాధ తను ఇంటికి వచ్చేముందు ఏం జరిగివుంటుందో అర్థం చేసుకోగలిగింది. ఆమె చిగురుటాకులా వణికింది క్షణకాలం.

"కాలేజీనుంచి... ప్రయివేటు క్లాసు వుంది," ముందే ఆలోచించి పెట్టుకున్న సమ ధానం వెంటనే చెప్పింది. మరుక్షణం

ఆమె చెంప ఛెళ్లుమంది.

సుధీర్‌తో స్నేహం బలపడినప్పటినుంచి కాలేజీనుంచి ఆలస్యంగా వస్తూ ప్రయివేటు క్లాసు వుందనే అందమైన అబద్ధంతో తల్లిని నమ్మించగలిగిన ఆమె తండ్రిని కూడా నమ్మించగలననే అనుకుంది.

కాని, తండ్రి కళ్లలో అనుమానం. అనుమానం కూడా కాదు... దోషిని చూస్తున్నట్టు చూస్తున్న ఆయన చూపుకి ఆమె నాలుక తడారింది.

తండ్రి పరోక్షంలో ఆయనని తల్లి దగ్గర నిస్సంకోచంగా విమర్శిస్తూ తన ఉక్రోషాన్ని వెళ్లగక్కే రాధకి తండ్రి అంటే భయమే. చాలా చిన్న వయసులోనే తండ్రిపై ఆమె మనసులో పడిన చెడుముద్ర ఆమెని తండ్రికి దూరం చేసింది. ఆ దూరం వయసుతోబాటు పెరుగుతూ వచ్చింది.

ఇప్పుడా తండ్రి తను కాలేజీనుండి అలస్యంగా వచ్చిన కారణాన్ని నిలదీస్తుంటే ఆమె నిలువెల్లా వణికింది.

"ఎక్కడే నీకు ప్రయివేటు క్లాసు? అనుపమా రెస్టారెంటులోనా? "

రెస్టారెంటు పేరు వినగానే రాధ ఉలిక్కిపడింది. ఆ ఉలికిపాటుని కప్పిపుచ్చుకోడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ అంది.

"నిజంగా ప్రయివేటు క్లాసే నాన్నగారూ! సిలబస్ కంప్లీట్ అవలేదని..." ఆమె మాట పూర్తి కాకుండానే మరోసారి ఆమె చెంప ఛెళ్ళుమంది.

"ముండా! చదువుకోమని కాలేజీకి పంపిస్తే కాలేజీ ఎగ్గొట్టి ఎవడితోనో హోటళ్లకి తిరుగుతూ పైగా బుకాయిస్తున్నావా? ఈ సెంటు, గోళ్ళరంగు కూడా వాడే ఇచ్చాడా? " పెట్టెలోనుంచి ఆ రెండింటినీ తీసి చూపిస్తూ అడిగాడు.

సుధీర్ తనకెంతో ప్రేమగా ఇచ్చిన ఆ పెర్‌ఫ్యూమ్ బాటిల్‌ని తండ్రి చేతులలో చూడగానే, రాధ తన గుండెని శరీరాన్నుంచి ఎవరో వేరు చేస్తున్నట్టు విలవిలలాడింది.

"ఇదీ... నా ఫ్రెండు అనుపమది" చప్పున మరో అబద్ధం చెప్పింది.

"ఎవరే... ఆ ఫ్రెండ్? సాయంకాలం రెస్టారెంటు దగ్గర నువ్వు మాట్లాడుతున్న ఆ జులపాలవాడిని కూడా అదే తార్చిందా? "

ఏ తండ్రీ ఏ కూతురినీ అడగకూడని అశ్లీలమైన పదాల్లో ప్రశ్నలని ప్రయోగిస్తున్న తండ్రిని కోపం ఆవేశం, రోషం, దుఃఖం అవమానం ఇత్యాది భావాలతో వణికిపోతూ ఏహ్యంగా చూసింది రాధ.

"చదివిన చదువు చాలు! రేపటినుంచి నువ్వు కాలేజీకే కాదు... అసలు వీధిలోకి వెళ్ళనవసరంలేదు" ఓ శాసనంలా అనేసి లోకేశ్వరరావు అక్కడనుంచి నిష్క్రమించబోయాడు.

"నేను కాలేజీకి వెళ్ళడం మానను. చదువుకుంటాను" ఆ క్షణంలో తన నిర్ణయాన్ని చెప్పకపోతే మళ్ళీ చెప్పే అవకాశం రాదన్నట్టు రాధ ఏడుస్తూనే అంది.

వెనుదిరిగి వెళ్ళబోతున్న లోకేశ్వరరావు రంయ్‌మంటూ కూతురి దగ్గరకి వచ్చి ఆమెని ఎడాపెడా బాదేశాడు.

"నోరు విప్పి మరోమాట మాట్లాడావంటే జాగ్రత్త. చంపేస్తాను. వెధవ చదువు చదువుతున్నావ్? నువ్వు చదివిన చదువు అమ్మ నాన్నల కళ్లు కప్పి అబ్బాయిలతో పార్కులకి, షికార్లకి వెళ్ళమని చెప్పిందా? అందుకే ఈ ఆడముండలకి చదువు చెప్పించడం దండగ. టెన్త్‌క్లాసు అవగానే పెళ్ళి చేసేస్తే ఇవాళ ఈ పరిస్థితి ఎదురయ్యేది కాదు"

తండ్రి కొట్టిన దెబ్బలు రాధ శరీరాన్ని కాక, మనసుని తాకాయి. ఆమె అవమానంతో వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"చేసేదంతా చేసి ఆ ఏడుపు దేనికి? నేనెలాగూ చదువుకోలేదు. నువ్వయినా చదువుకుని, ప్రయోజకురాలివై నీకాళ్లమీద నువ్వు

నిలబడతావనుకున్నాను. కాని ఇలా వెధవ్వేషాలు వేసి చదువుకి మంగళం పాడతావనుకోలేదు" విశాలాక్షి ఏడుస్తూనే ఏహ్యంగా తిరస్కారంగా కూతురిని చూసి ఆ గదిలో నుంచి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి ఆ ఇంట్లో ఎవరూ భోజనం చెయ్యలేదు. రోజూ వీధి తలుపు గడియ మాత్రం వేసే లోకేశ్వరరావు ఆ రాత్రి వీధి తలుపు తాళం పెట్టాడు.

తమ కళ్లు కప్పి ఎవరో అబ్బాయితో స్నేహం చేసిన రాధ అతనితో లేచిపోవడానికి కూడా వెనుకంజ వెయ్యదని అతని అనుమానం. రాధ అలా చెయ్యకుండా తీసుకునే జాగ్రత్తలకి ఆ రాత్రే శ్రీకారం చుట్టారాయన.

రాధ కటికనేలపై పడుకునివుంది. తండ్రి కొట్టిన దెబ్బలకి ఆమె ఒళ్లు పచ్చిపుండులా వుంది. అవమానంతో ఆమె మనసు మరింత మండుతోంది.

తల్లిదండ్రులలో ఏ ఒక్కరైనా అనునయంగా, లాలనగా మాట్లాడితే తను సుధీర్ని ప్రేమిస్తున్న విషయం చెప్పేదే! తనేదో ఘోరమైన తప్పు చేసినట్టు తండ్రి తనని కాలేజీ మానెయ్యమని తీర్పు చెప్పడంతో ఆమె అభిమానం దెబ్బతింది.

ఆలోచిస్తున్న రాధకి సుధీర్, తను రెస్టారెంటులోనుంచి వస్తుండగా చూసిన తండ్రి అతను ఎవరు, ఏమిటి అని అడగలేదని గుర్తు వచ్చింది. "సుధీర్ తమ కులంకాని కారణంగా తను అతన్ని పెళ్లి చేసుకుంటానంటే తండ్రి ఎలాగా అంగీకరించడు. తను సుధీర్ గురించి ఇంట్లోవాళ్లకి చెప్పడం అనవసరం. తండ్రికి తెలియకుండా సుధీర్‌ని ఎలా కలుసుకోవాలి" రాధ తీవ్రంగా ఆలోచించసాగింది.



ఆ సాయంకాలం క్లాసులు అయిపోయాక, సునీత ఫ్రెండ్స్‌తో గేటు దాటుతుంటే గేటు బయట ఆగివున్న హీరో హోండామీద సుధీర్, ఆ పక్కనే అనుపమ కనిపించారు. సునీత ఆ ఇద్దరినీ చూసీచూడనట్టు ముఖం తిప్పుకుని వెళ్ళిపోబోతూంటే "రాధ కాలేజీకి ఎందుకు రావడం లేదండీ? " అనే ప్రశ్న వినిపించింది.

ఆ ప్రశ్న అడిగింది అనుపమ అయితే సునీత చురుక్కుమన్పించేలా ఏదో ఒక సమాధానం ఇచ్చేదే! కాని, ఆ ప్రశ్న అడిగింది సుధీర్.

"తెలియదండీ! బహుశా ఒంట్లో బాగాలేదేమో!" అంది.

సుధీర్, అనుపమలు ముఖాలు చూసుకున్నారు. అతని ముఖంలోని నిరాశని గమనిస్తూ అంది సునీత.

"నేను ఇప్పుడు రాధా వాళ్ళింటికి వెళ్దామనుకుంటున్నాను" క్షణం ఆగి అంది. "వెళ్తే మీరు తన కోసం అడిగారని చెబుతాను లెండి"

"థ్యాంక్ యూ!" అన్నాడు సుధీర్.

సునీతకు రాధ కాలేజీకి రాని కారణం తెలుసుకుందామని పెద్దగా ఆసక్తేమీ లేదు. సుధీర్ తనతో మాట్లాడాడు కాబట్టి తనూ ఏదో ఒకటి మాట్లాడాలని అంది.

సునీత తన ఇంటిని సమీపిస్తుండగా రాధ తమ్ముడు హరి కనిపించాడు.

"ఏం హరీ, మీ అక్క కాలేజీకి రావడం లేదు. జ్వరమా? " పనిగట్టుకుని పలుకరించింది.

"కాదు. అక్కయ్య ఇంక కాలేజీకి రాదు. మా అక్కని నాన్నగారు వెళ్ళవద్దన్నారు"

ముందు యధాలాపంగా విన్న సునీత ఆశ్చర్యంగా అడిగింది. "నిజమేనా? "

"అవునక్కా!"

"అదేమిటి, పరీక్షలు ఇంక రెండు నెలలేగా వున్నాయి? కాలేజీ మానడం ఏమిటి? "

"తెలియదక్కా!" వాడికి మూడురోజుల కిందట ఇంట్లో జరిగిన గొడవ, రాధ కాలేజీ




నుంచి ఆలస్యంగా రావడం, తండ్రి ఆమెపై చెయ్యి చేసుకోవడం గుర్తువచ్చింది. అక్క ఏదో పెద్ద తప్పు చేసివుంటుంది. అందుకే ఆమెని తండ్రి కాలేజీకి వెళ్ళవద్దని చెప్పివుంటాడని వాడికి అర్థమయింది.

సునీతకి మరింత ఆసక్తిని కలిగించిందీ వార్త. ఆమె ఇంటికి వెళ్లే ఆలోచనని విరమించుకుని సరాసరి రాధ దగ్గరకి బయలుదేరింది.

దాదాపు ఆరునెలల తర్వాత రాధ ఇంటికి మొదటిసారిగా వెళ్తున్న సునీతలో ఏదో సంకోచం. గుమ్మంలోనే ఎదురయిన విశాలాక్షి ముఖంలోని గాంభీర్యం ఆమెని మరింత సందేహించేలా చేసింది.

"ఏమ్మా! మా ఇంటికే రావడం మానేసావ్!" ఆప్యాయతతో నిష్టూరాన్ని కలగలిపి అడిగింది విశాలాక్షి. "పరీక్షలు దగ్గరపడ్డాయికదా. చదువుకుంటున్నాను" అనేసి ఆవిడ మరోప్రశ్న అడగడానికి అవకాశం ఇవ్వకుండా అడిగింది.

"రాధ ఏది ఆంటీ?"

"లోపల వుంది. రాధా! సునీత వచ్చింది" అని లోపలికో కేకవేసి "లోపలకి రా సునీతా!" అంది విశాలాక్షి.

తనకోసం సునీత కాక అనుపమ వస్తే రాధ తప్పకుండా సంతోషపడేదే. అనుపమ కోసం ఎదురుచూస్తోంది కూడా. కాని సునీత రావడంతో ఆమెకి ఆశ్చర్యంతోబాటు అనుమానం కూడా కలిగింది.

"ఎందుకొచ్చింది సునీత? గత ఆరునెలలుగా తమిద్దరి మధ్య స్నేహం లేదుకదా? తను కాలేజీకి ఎందుకు రావడం లేదో ఆరా తియ్యడానికి వచ్చి వుంటుందా? ఇప్పుడు తను సునీత ఎదుటికి రావాలా, వద్దా? వస్తే ఏం మాట్లాడాలి?" రాధ ద్వైదీభావాలతో సతమతమవుతుండగానే సునీత రాధ దగ్గరికి వచ్చింది.

"కాలేజీకి రావడం లేదేం?" సునీత స్వరంలో తెచ్చిపెట్టుకున్న ఆప్యాయత లేదు. ఆమెనుంచి తను ఊహిస్తున్న ప్రశ్న ఎదురయ్యేసరికి రాధ పెదవి బిగపట్టింది.

"అలా వున్నావేం? జ్వరమా?"

దుఃఖంతో ఎరుపెక్కి వున్న రాధ కళ్లని, వాచిన ఆమె కనురెప్పలని, లంఖణాలు చేసినట్టుగా పీక్కుపోయి వున్న ఆమె ముఖాన్ని చూస్తూ అడిగింది.

"అవును. మూడురోజులనుంచి. ఇప్పుడు లేదులే తగ్గింది" చప్పున అబద్ధం జెప్పింది రాధ.

"ఇవాళ క్లాసులయిపోయాక వస్తుంటే గేటు దగ్గర అనుపమ కలిసింది. అనుపమ కోసం హీరో హోండామీద సినిమా హీరోలాంటి ఒకబ్బాయి వస్తుంటాడే అతని పేరేమిటి?"

"సుధీర్..." వేగంగా కొట్టుకుంటున్న గుండెలతో సునీత చెబుతున్నది వింటున్న రాధ అప్రయత్నంగా అంది. సుధీర్ అనే పేరుని, ఆమె ఉచ్చరిస్తున్న తీరుని, ఆమె ముఖంలో ఆ పేరు వినగానే వచ్చిన మార్పుని నిశితంగా గమనిస్తున్న సునీత అంది.

"పేరు నాకు తెలియదులే! అదే అతను నిన్నడిగాడు..."

"ఏమని..." రాధ గుండె గొంతులోకి వచ్చింది.

"నువ్వు కాలేజీకి రావడం లేదేమని అడిగాడు"

సుధీర్ ప్రస్తావనతో అరుణిమని సంతరించుకున్న రాధ ముఖం క్షణంలో వెయ్యోవంతు నల్లబడడం సునీత దృష్టినుంచి దాటిపోలేదు.

సునీత రాధ సమాధానం చెప్పేలోగానే అంది.

"ఒంట్లో బాగాలేక నువ్వు కాలేజీ మానేసి వుంటావని చెప్పానులే! నువ్వెలా వున్నావో తెలియక అతను చాలా ఆదుర్దా పడుతున్నాడు"

రాధకి సునీతపై అన్నాళ్ళనుంచి పెంచుకున్న ద్వేషభావం మాయమై ఆమెపై ఏదో తెలియని ఆప్యాయత కలిగింది.

"నేను ఒక ఉత్తరం ఇస్తాను. దానిని అనుపమకి ఇస్తావా? "

"అనుపమకా? సుధీర్‌కా? " సునీత సూటి ప్రశ్నతో తొట్రుపడింది రాధ.

"ప్రేమించడం తప్పు కాదు రాధా! ఆ ప్రేమ విఫలమవడానికి మన పిరికితనం కారణమవడం తప్పు" తెలుగు సినిమాలు ఎక్కువ చూసే సునీత ఆ అనుభవసారంతో ఒక సూక్తి చెప్పింది. తలదించుకుని వున్న రాధ భుజంపై చెయ్యివేస్తూ అంది.

"నువ్వు నా స్నేహితురాలివి రాధా! మన స్నేహం ఇవాల్టిది కాదు. ఇన్నాళ్ల మన స్నేహంలో నీకు, నాకు మధ్య దాపరికాలుంటాయని నేననుకోను"

రాధ మనసుని ఆ మాటలు సూటిగా తాకాయి. ఆమె కళ్లకి సునీత అడగకుండానే వరమిచ్చే దేవతలా కన్పించింది.

"నువ్వు ఉత్తరం వ్రాసేదాకా ఆంటీ ఈ గదిలోకి రాకుండా నేను మేనేజ్ చేస్తాను" అభయమిచ్చి సునీత వంటగదిలోకి నడిచింది.

"ఏం చేస్తున్నారాంటీ? " చనువుగా ఆవిడ దగ్గర పీటవాల్చుకుని కూర్చుంది సునీత.

"నీకు కాఫీ ఇద్దామని... "

"ఇప్పుడెందుకు ఆంటీ? "

విశాలాక్షి మౌనంగా ఆమెకి కాఫీ అందించింది. ఆవిడకి రాధ కోసం వచ్చిన సునీతపై ఏమాత్రం అనుమానం లేదు. సునీత బుద్ధిమంతురాలని, బాగా చదువుకుంటుందని, అపరిమితమైన నమ్మకం. రాధకి దొరికిన ఆ కొత్త ఫ్రెండు అనుపమ ఎవరోగానీ, ఆమె రాధకి మగస్నేహితులని అలవాటు చేసిందని ఆవిడ గ్రహించగలిగింది.

సునీత కాఫీ త్రాగుతూ విశాలాక్షిని కబుర్లలో పెట్టి ఆవిడని రాధ వున్న గదిలోకి వెళ్లనివ్వకుండా చేసింది.

"ఇంక వెళ్తాను ఆంటీ!"

"మంచిదమ్మా! నీ నోట్సులవీ రాధకి తెచ్చి ఇస్తూ వుండు"

"పరీక్షలు దగ్గరకి వస్తున్నాయికదా!" అందావిడ.

"రాధ జ్వరం తగ్గగానే కాలేజీకి వస్తుందిగా? " రాధ కాలేజీ చదువు అనే అధ్యాయం ముగిసిపోయిందని గ్రహించినా, తెలియనట్టే అడిగింది.

విశాలాక్షి ముఖం మ్లానమయింది. ఆవిడ జవాబివ్వలేదు.

"నేను వెళ్తున్నాను రాధా!" అని రాధ దగ్గరకి వచ్చి చెప్పి తన వెనుకనే నిలబడిన విశాలాక్షి చూడకుండా నేర్పుగా రాధ అందించిన ఆ కవరు తీసుకుని ఆ ఇంటి మెట్లు దిగింది.

★ ★ ★

"నా ప్రాణానికి ప్రాణమైన నా సుధీర్,

నిన్ను చేరుకోవాలని నా మనసెంత వేగిరపడుతోందో తెలుసా? కాని నేను బందీని. మన స్నేహం విషయం మా నాన్నకి తెలిసి నన్ను ఇంట్లోనే బందీని చేసి నన్ను అనుక్షణం కాపలా కాస్తున్నారు. మన మధ్యవున్నది కేవలం స్నేహం కాదనీ ప్రేమ అనీ చెప్పుకోలేని నా పిరికితనానికి నేనే సిగ్గుపడుతున్నాను. మన ప్రేమ విషయం తెలిసినా మా ఇంట్లో మన పెళ్లికి ఒప్పుకోరు. మన కులాలు వేరు కావడం అందుకు కారణం. నీకోసం ఈ ప్రపంచం మొత్తాన్ని ఎదిరిస్తాను. నీ కోసం ఎన్ని యుగాలయినా నిరీక్షిస్తాను. నాపై నీకున్న ప్రేమే నాకు బలాన్నిస్తోంది. రా, సుధీర్! త్వరగా రా! నన్ను ఇక్కడనుంచి తీసికెళ్లు. ఈ కుళ్లు మనుషులకి దూరంగా వెళ్లిపోయి హాయిగా బతుకుదాం.

ఎప్పటికీ నీ దాన్నే అయిన నీ రాధ

ఆ ఉత్తరం చదివిన సునీత కనుబొమలు ఆశ్చర్యంతో పైకి లేచాయి. సుధీర్‌ని రాధ




ఎంత గాఢంగా ప్రేమిస్తున్నదీ తెలుసుకున్న ఆమెకి రాధ ఎడల ఈర్ష్య కలుగలేదు. హేళన నిండిన చిరునవ్వు ఆమె పెదవుల పైకి వచ్చింది. డబ్బులేని వాళ్లని కన్నెత్తి కూడా చూడని అనుపమ రాధతో స్నేహం చేస్తోందంటే అందుకు కారణం సుధీర్. సుధీర్ కోసమే అనుపమ రాధతో స్నేహం చేస్తోంది.

సుధీర్ సినిమా హీరోలాంటి అందగాడే! కానీ సుధీర్ లాంటి స్థితిమంతుడు రాధ లాంటి సామాన్యురాలిని పెళ్లిచేసుకోడానికి జీవితం సినిమా కాదు.

ఆమె మరో కవరులో ఆ ఉత్తరాన్ని వుంచి కవరు జాగ్రత్తగా అతికించింది. మరునాడు గేటు దగ్గర ఎదురయిన సుధీర్‌కి ఆ ఉత్తరాన్నిచ్చింది.

"మీకు రాధ ఈ ఉత్తరాన్నిమ్మంది"

సుధీర్ అందుకున్నాడు.

"మీరు దానికి జవాబు రాస్తే నన్ను తీసుకురమ్మంది"

"అలాగేలెండి" సుధీర్ వెళ్లిపోయాడు.

సునీత రాధ రాసిన ఆ ఉత్తరానికి అతను ఏం జవాబిస్తాడా అని ఆతృతగా ఎదురు చూస్తోంది.

నాలుగు రోజులు గడిచాయి.

సుధీర్ మళ్లీ కన్పించలేదు. వారం రోజుల తర్వాత సునీత సుధీర్ పెళ్లి నిశ్చయమైన వార్త అనుపమ కాత్యాయనితో చెబుతుంటే వింది.

ఒకప్పటి తన స్నేహితురాలు రాధ సుధీర్‌లాంటి నయవంచకుడిని నమ్మి పెద్ద ప్రమాదంలో పడబోయినందుకు బాధ. అతి త్వరలోనే ఆ ప్రమాదంనుంచి తప్పించుకోగలిగినందుకు సంతోషంకంటే సుధీర్‌ని గురించి తన అంచనా తప్పు కానందుకు ఎక్కువ సంతోషించింది సునీత.

సునీత చేత సుధీర్‌కి ఉత్తరం పంపి, వారం దాటి పది రోజులయినా, అతని నుంచి ఎలాంటి రెస్పాన్సు లేకపోయేసరికి రాధలో చిన్న అనుమానం కలిగింది. సుధీర్ ప్రేమని ఆమె శంకించడంలేదు. కేవలం సునీతపైనే ఆమె అనుమానం. సునీతతో తన స్నేహానికి తెరపడిన చాలా రోజుల తర్వాత తనపై ప్రేమ నటిస్తూ ఆమె వచ్చినంత మాత్రాన తను తెలివితక్కువతనంగా సుధీర్‌కి రాసిన ఆ ఉత్తరాన్ని ఆమెకెలా ఇచ్చింది? అసలు సునీత ఆ ఉత్తరాన్ని సుధీర్‌కి ఇచ్చి వుండదు. అసలే తనంటే ఈర్ష్యతో ఏడుస్తున్న ఆమెని తన ప్రేమ విషయంలో రాయబారిగా ఎలా ఎన్నుకుంది?

రాధకి ఏం చెయ్యాలో పాలుపోవడం లేదు. ఆమెకి సునీతపై ఆగ్రహంగా వుంది. తన తెలివి తక్కువ తనానికి తనపై తనకే ఆగ్రహంగావుంది. ఇంట్లోంచి బయటకి వెళ్లేందుకు మార్గంలేదు. తను సుధీర్‌ని కలుసుకోవాలి. ఎలా? సుధీర్ కంటే ముందు సునీతని కలుసుకుని ముఖం వాచేట్టు తిట్టాలి.

ఆ ఆలోచన రాగానే హరిని పిలిచింది.

"ఒకసారి సునీతని నేను రమ్మన్నానని చెప్పు"

హరి వెళ్లినవాడల్లా వెంటనే తిరిగి వచ్చాడు. "సునీత చదువుకోవలసినది చాలా వుందిట. ఇప్పుడు రానందక్కా!"

"చదువు! మహా లావు చదువు. వున్నట్టుండి దీనికి చదువుమీద అంత శ్రద్ధ పుట్టుకొచ్చిందేమిటి? " రాధ మనసు మండిపడింది. సునీత తను ఎందుకు పిలిచిందో గ్రహించింది కాబట్టే చదువు నెపంతో తన దగ్గరకి రాలేదన్పించింది ఆమెకి. ఆమె రెండు నిముషాలు ఆలోచించి, తల్లి దగ్గరకి వచ్చి చెప్పింది.

"నేను సునీత దగ్గరకి వెళ్తున్నాను"

"నువ్వు వీధి గడపదాటడానికి వీల్లేదు" శాసిస్తున్నట్టుగా వుంది విశాలాక్షి స్వరం.

రాధ ఉక్రోషాన్ని, అవమానాన్ని దిగమ్రిం





గుకుంటూ శాంతంగా అంది.

"ఇంగ్లీషు నోట్సు తెచ్చుకుని వచ్చేస్తాను. నాతోబాటు హరిని పంపు"

"సరే! మీ నాన్నగారు ఇంటికి రాకముందే త్వరగా వచ్చెయ్యి" విశాలాక్షి మెత్తబడింది.

రాధ హరితోబాటు బయటకి వచ్చింది. సునీతని తలచుకుంటే ఆమె మనశ్శరీరాలు క్రోధంతో వణికిపోతున్నాయి. యుద్ధానికి సన్నద్ధుడైన సైనికునిలా నడుస్తోందామె.

సునీత వాళ్లింటిని సమీపించిన రాధ తనని పలుకరిస్తున్న ఆమె తల్లిని పట్టించుకోలేదు. సరాసరి డాబాపై కూర్చున్న సునీత దగ్గరకి నడిచింది.

ఆమె కళ్లలోని అరుణిమ, ముఖంలోని తీవ్రత చూసిన సునీత చదువుతున్న పుస్తకం వదిలి, అప్రయత్నంగానే లేచి నిలబడింది.

"నేను సుధీర్‌కిమ్మని నీకిచ్చిన ఉత్తరాన్ని ఏంచేసావ్? " సునీత సమాధానం చెప్పేలోగానే అడిగింది మళ్లీ.

"నువ్వాఉత్తరాన్ని సుధీర్ కివ్వలేదు కదూ? "

"ఇచ్చాను"

"అబద్ధం! నువ్వివ్వలేదు. అయినా నేను నిన్నెలా నమ్మేను? నీ స్నేహం వెనుక ఇంత కుటిలాలోచన వుందని తెలియదు నాకు. కాదు నన్నంతగా నమ్మించావ్? "

"నాపై అంత నమ్మకం లేని దానివి నీ ప్రియుడికి ప్రేమ సందేశాన్ని నువ్వే ఇచ్చుకోలేకపోయావా? " వ్యంగ్యంగా అంది సునీత.

రాధ ముఖం ఎర్రబడింది. "నిజం చెప్పు. నువ్వా ఉత్తరాన్ని సుధీర్‌కివ్వలేదు కదూ?" అదే స్వరంతో అంది.

"ఇచ్చాను"

"ఇస్తే... సుధీర్ నా ఉత్తరానికి ఎందుకు సమాధానం ఇవ్వలేదు? "

"ఎవరికి తెలుసు? దేముడినడుగు" నిర్లక్ష్యంగా అంది సునీత.

"దేముడిని అంత చులకనగా లాగకు! నీకు సంబంధం లేని ఉత్తరం నీ దగ్గర వుంచుకుని నాటకమాడుతున్నావ్! ఎంత నమ్మకద్రోహం చేశావు!" రాధ ఛీత్కరిస్తూ వెనుదిరిగింది.

సునీత కోపంతో ప్రజ్వరిల్లుతున్న కళ్లతో రాధని వెనుకనుంచి చూస్తోంది.

రాధని తను ఆ ఉత్తరాన్ని సుధీర్‌కిచ్చానని నమ్మించదలచుకోలేదు. నమ్మించే అవసరం కూడా లేదనిపించిందామెకి. రాధ కనుక 'సుధీర్ నా ఉత్తరానికి జవాబివ్వలేదు చూశావా సునీతా' అని తన గోడు చెప్పుకుంటే ఆమెను ఓదార్చి సుధీర్ ఆమెని నిజంగా ప్రేమించలేదని పెళ్లి చేసుకునే ఉద్దేశం అసలే లేదని, తనతో సమాన హోదాలో వున్న మరో అమ్మాయిని పెళ్లి చేసుకోబోతున్నాడని నిజం చెప్పేసి వుండేది. కానీ రాధ వస్తూనే తనపై నింద మోపింది. తను ఆమె సుధీర్‌కి రాసిన ఉత్తరాన్ని సుధీర్‌కి అందనివ్వనట్టు మాట్లాడింది. సుధీర్ ఆమెపై ప్రేమ నటించాడని రాధ పెళ్లి ప్రస్తావన తేగానే ఆమెను వదిలించుకోడం కోసమే ఆమె ఉత్తరానికి సమాధానం ఇవ్వలేదని సునీత రాధకి చెప్పదలచుకోలేదు. ఇంక ముందు చెప్పదు కూడా

శరవేగంతో క్రిందికి వచ్చిన రాధ తనేం చెయ్యాలో ఆ క్షణంలోనే ఆలోచించుకుంది.

"సుధీర్ దగ్గరకి వెళ్లాలి. అవును ఏ గుడిలోనో పెళ్లి చేసుకోవాలి. ఆ పెళ్లి కూడా కొన్ని గంటల్లోనే జరిగిపోవాలి. మళ్లీ ఇలాంటి అవకాశంరాదు. రాధ కృతనిశ్చయంతో ముందడుగు వేసినదల్లా గేటు దగ్గర నిలబడివున్న తండ్రిని చూసి కొయ్యబారిపోయింది.

"ఏదీ నోట్సు!" లోకేశ్వర్రావు ఆరాగా చూశాడు.

"రే... రేపు ఇస్తానంది!" రాధ గొంతు తడారిపోయింది.

"నోట్సు తెచ్చుకునే వంకన ఇంట్లోంచి

బయటకి వచ్చి ఎవడితో పోదామనే ముండా!" అది రోడ్డు అని కూడా చూడకుండా లోకేశ్వర్రావు తిడుతున్నాడు.

తన మనసులోని ఆలోచనని ఆయన కనిపెట్టినట్టు అసహ్యకరమైన పదజాలంతో తిడుతుంటే రాధ తలెత్తుకోలేకపోతోంది.

తండ్రి వెనుకే తలదించుకుని ఇంటికి వచ్చిన రాధ ఇల్లు చేరాక తల ఎత్తింది. ఎదురుగా విశాలాక్షి ఏడుస్తోంది. ఆమె చెంప ఎర్రగా తట్టుతేలి వుంది.

★ ★ ★

శారద సునీత నుంచి వచ్చిన ఆ ఉత్తరం చదివి చాలాసేపు ఖిన్నవదనంతో అలాగే కూర్చుండిపోయింది. కొద్దిసేపటి తర్వాత మళ్లీ ఆ ఉత్తరాన్ని చదవడం మొదలుపెట్టింది.

"డియర్ శారదా,

ఎలా వున్నావ్? నేను పరీక్షలకి బాగానే ప్రిపేరవుతున్నాను. నీ సంగతి అడగక్కర్లేదనుకో! ఫస్టుక్లాసుస్టూడెంటువి. మన రాధని తలచుకుంటేనే బాధగా వుంది. రాధ చదువు మానేసింది. అది ఎవరితోనో ప్రేమలో పడిందిట. నాకూ సరిగ్గా తెలియదులే! ఎవరో చెప్తే వినడమే. ఆ విషయం వాళ్ల నాన్నగార్కి తెలిసి దాన్ని చదువు మానిపించేశారు. అది ఇలా చెయ్యగలదని ఎవ్వరం ఊహించలేదనుకో. ఇంకేమిటి విశేషాలు? సినిమాలేవైనా చూశావా?"

శారదకి ఇకపై చదవబుద్ధి కాలేదు.

"ఒక చెంప తమ ప్రాణమిత్రురాలయిన రాధ చదువు ఆగిపోయిందని రాస్తూనే మరో చెంప సినిమాలు చూశావా అంటుంది. దీనికి అసలు సినిమా తప్ప వేరే ప్రపంచం లేదా?

శారద ఆ రోజంతా అన్యమనస్కంగానే గడిపింది. సాయంకాలం రాధకి ఉత్తరం రాయడానికి కూర్చుంది. తీరా రాయడం మొదలు పెట్టిందేకాని, ఏం రాయాలో తోచలేదు. రాధ తనకి ఎంత స్నేహితురాలయినా "నువ్వేదో ప్రేమలోపడ్డావని విన్నాను. చదువు, మనలక్ష్యం మరచిపోయి ప్రేమ ఏమిటే" అని చనువుగా ఎలా ఉత్తరం రాయగలుగుతుంది?

చాలాసేపు ఆలోచించి, మామూలుగా ఉత్తరం రాసింది.

డియర్ రాధా!

నీ దగ్గరనుంచి చాలాకాలంగా ఉత్తరాలు లేవు. నేను పరీక్షలకి బాగానే చదువుతున్నాను. మరి నీ సంగతేమిటి? పరీక్షలవగానే కాంపిటేటివ్ ఎగ్జామ్స్‌కి ప్రిపేరవు. నామటుకు నాకు పి. జి. చెయ్యాలని వుంది. కాని ముందు చిన్నదో, పెద్దదో ఏదో ఒక ఉద్యోగంలో చేరి, తర్వాతే, ప్రైవేటుగా చదువుతాను.

ఉద్యోగం పురుష లక్షణం అనే రోజులు పోయాయి. ఉద్యోగం స్త్రీ లక్షణం కూడా. అందుకే బాగా చదువుకుని నీ భవిష్యత్తుకు పునాది వేసుకో! ఉత్తరం రాస్తావుగా?

నీ శారద"



"రాధా! నీకు ఉత్తరం వచ్చింది. తల్లి అందించిన ఆ ఉత్తరాన్ని చేతిలోకి తీసుకుని చూసింది రాధ. కవరు ఓపెన్ చేసి వుండడాన్నిబట్టి తల్లి ఆ ఉత్తరాన్ని తను ముందు చదివి అది ప్రమాదకరమైనది కాదు అని నిర్ధారణ చేసుకున్నాకే ఆ ఉత్తరాన్ని తనకి ఇచ్చిందని అర్థమయిందామెకి. నిస్సహాయ




తతో, కోపంతో ఆమెకి కన్నీళ్లు వచ్చాయి. ఆ ఉత్తరాన్ని వుండగా చుట్టి మూలకి విసిరే సింది.

తనని దోషిలా చూస్తున్న తండ్రి, చీటికి మాటికీ తిట్టే తల్లి బందిఖానాలాంటి ఆ ఇంట్లోనుంచి బయటపడాలని సుధీర్‌ని చేరుకోవాలని రాధ మనసు ఉవ్విళ్లూరు తోంది. ఆమె తీవ్రంగా ఆలోచించసాగింది. ఎలా బయటపడాలి?

తను కాలేజీకి వెళ్లడం మానేసి దగ్గరద గ్గర నెల రోజులయింది. సుధీర్ తనకోసం కాలేజీకి వచ్చివుంటాడు. తను రాసిన ఉత్తరం సునీత వలన అతనికి అందకుండా పోయింది. అందివుంటే ఈపాటికి వచ్చి తనను తీసికెళ్లి వుండేవాడే! అతనిలోని ధైర్యం, చొరవ అతని కళ్లలో తనపై వ్యక్త మయ్యే ఆరాధన గుర్తుకు వచ్చిన రాధకి అతను తప్పక తనని ఆదుకుంటాడని నమ్మకం వుంది. కానీ తను ఈ ఇంట్లో బందీ అనే విషయం అతనికి తెలియాలి, ఎలా?

ఆలోచిస్తున్న రాధ తల్లి పిలుపుతో ఉలి క్కిపడింది.

"ఎవరో నీ క్లాస్‌మేటట. తన పెళ్ళి శుభ లేఖ నీకు పంపింది"

యధాలాపంగా దాన్ని అందుకుని ఓపెన్ చేసిన రాధ తలపై పిడుగులు పడ్డట్ట యింది.

చి॥ సుధీర్‌కి చి॥సౌ॥ భవ్యనిచ్చి...

వెర్రిగా, విహ్వలంగా నీళ్ళు నిండిన కళ్ళతో నమ్మశక్యంకానట్టు చూస్తోందామె.

"సుధీర్ పెళ్ళి... తనని ప్రేమించిన సుధీర్ పెళ్ళి వేరే అమ్మాయితో జరగబో తోంది, నో!" అరవాలనుకుంది. చెంపలపై నుంచి స్రవిస్తున్న కన్నీటిని తుడుచుకోడం మరచిపోయి చేతిలోని శుభలేఖని చూస్తోం దామె.

ఇది నిజమేనా? రాధకి ఇంకా నమ్మశ క్యంగాలేదు. ఆమె వెక్కివెక్కి ఏడుస్తోంది. ఏ సుధీర్‌ని తను మనసారా ప్రేమించిందో, ఏ సుధీర్ కారణంగా తన చదువు మధ్య లోనే ఆగిపోయిందో అతను తనకి దక్క లేదు.

ఆమె మరోసారి శుభలేఖని తీసి చూసింది.

ఎమ్. పి. కూతుర్ని చేసుకోబోతున్న సుధీర్ తనలాంటి సామాన్యురాలిని చేసుకుంటాడని తనెలా నమ్మిందనే అనుమానం ఆమెకి రాలేదు. సుధీర్ తనని ప్రాణాధికంగా ప్రేమించాడు. కేవలం తనెలాంటి పరిస్థితు లలో ఇరుక్కుని పోయిందో అతనికి తెలి యదు. అందుకే మరో అమ్మాయిని పెళ్ళిచే సుకుంటున్నాడు! రాధ చెంపలమీదనుంచి అశ్రువులు దొర్లిపోతున్నాయి.

కాని, సుధీర్ నిజంగా తనని ప్రేమిస్తున్న ట్టయితే, తనని కలుసుకునే ప్రయత్నం ఎందుకు చెయ్యలేదనే అనుమానం ఆమెకి కలగలేదు.

ఆరాత్రి రాధ చేయబోయిన ఆత్మహత్యా ప్రయత్నానికి విశాలాక్షి సమయానికి అడ్డుప డింది.



ఆ సాయంకాలం రాధకి క్లాస్‌మేట్ పంపిన పెళ్ళికార్డు, అదే రాత్రి రాధ ఆత్మ హత్యా ప్రయత్నం! విశాలాక్షికి భర్త తమ కూతురు ఎవరో అబ్బాయితో స్నేహం చేస్తోందన్న కారణంగా ఆమె చదువు మాన్పించాడే కాని, ఆ అబ్బాయి ఎవరు, ఆ ఇద్దరి మధ్య స్నేహం ఎలాంటిది అని అడ గలేదని స్ఫురించింది. భర్తే కాదు, తనూ అడగలేదు.

అప్పుడు అడిగిందావిడ. "ఎవరీ సుధీర్ నీతో స్నేహంచేసిన అబ్బాయేనా"

రాధ తల దించుకుంది.

"చెప్పు... మీనాన్నగారు నీతో చూసిన అబ్బాయేనా? "

"అవును"

"నీకెలా పరిచయం?"

"చెప్తే ఏం చేస్తారిప్పుడు? సుధీర్‌కి పెళ్ళి అయిపోతోందిగా?"

"అంటే...అతన్ని నువ్వు పెళ్ళిచేసుకోవాలనుకున్నావా?"

"అవును" రాధ ఏడుస్తోంది.

"నీ సంగతి సరే, అతను నిన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పాడా"

"చెప్పలేదు కాని, నాకు తెలుసు. నేనంటే అతనికి ప్రాణం"

"మరి నువ్వు కాలేజీకి వెళ్లడం మానేసి దగ్గరదగ్గర నెలరోజులవుతున్నా, అతను కనీసం నీకోసం రాలేదేం?"

"నేను కాలేజీకి రావడంలేదేమని సునీతని అడిగేడుట. అప్పుడు నేను "మన స్నేహం సంగతి ఇంట్లో తెలిసి నన్ను కాలేజీకి పంపడంలేదనీ, ఇంట్లో బంధించారనీ అతడిని వచ్చి నన్ను తనతో తీసికెళ్లమని ఉత్తరం రాసి సునీత చేతే పంపించాను" విశాలాక్షి వెర్రిగా కళ్ళప్పగించి చూస్తూండిపోయింది.

తను ఇంతకాలం అమాయకురాలు అని నమ్ముతున్న రాధ ఇదంతా చేసిందా! ఎలా చెయ్యగలిగింది?

"నీ ఉత్తరం అందుకున్నా సుధీర్ ఇక్కడకి రాలేదంటే అతనికి నీ ఎడల వున్నది కేవలం ఆకర్షణేనని, ప్రేమ కాదని అర్థంఅవుతూనే వుందిగా?"

"సునీత ఆ ఉత్తరాన్ని సుధీర్‌కివ్వలేదు. నా ఉత్తరం చదివాక, అతను నాకోసం రాకుండా వుండడు" గట్టిగా అంది రాధ.

"సుధీర్ నిన్ను అడిగాడని రాయబారం తీసుకొచ్చిన సునీత నువ్వు రాసిన ఉత్తరాన్ని అతనికెందుకివ్వదు?"

"అసూయ! దానికి నేనంటే అసూయ!" కసిగా అంది.

"అయినా, ఇదంతా ఎలా చెయ్యగలిగేవు? నేను చదువుకోలేదు. ఈ ఇంట్లో నాకు ఒక గుర్తింపు లేక, నా అస్తిత్వాన్ని మరిచిపోయి, జీతం బత్తెంలేని బానిసలా బతుకుతున్నాను. ప్రతి రూపాయికోసం మీ నాన్నని దేవిరిస్తూ ముష్టిదానికంటే హీనంగా బతుకునీడుస్తున్నాను. నువ్వయినా చదువుకుని, నీకాళ్ళమీద నువ్వు నిలబడతావని కాలేజీకి పంపించి చదివిస్తుంటే ఇదా నువ్వు చేసిన నిర్వాకం! ప్రేమిస్తున్నానని వాడెవడో వెంటపడితే నువ్వు కూడా వాడితో సై అంటావా? పైగా వాడితో లేచిపోవాలని ప్లాను వేస్తావా? నీ చేతులతో నువ్వే నీ భవిష్యత్తుని నాశనం చేసుకున్నావు కదే!" విశాలాక్షి గాద్గదిక స్వరంలో ఆవేశం, ఆవేదన ప్రతిఫలించాయి.

రాధకి తల్లి బాధ అర్థమయింది. కాని, ఆమె మాటలలో 'లేచిపోవడం' అనే పదప్రయోగం ఆమె ముఖాన్ని ఎరుపెక్కేలా చేసింది.

"నిజం చెప్పు. వాడితో స్నేహం హద్దులు మీరలేదుకదా!" హఠాత్తుగా ఏదో స్ఫురించినట్టు అడిగింది.

రాధ ఏడవడం మరచిపోయి, దిమ్మెరపోయి చూస్తోంది. తల్లి అడిగిన ఆ ప్రశ్నతో ఆమె ముఖం జేవురించింది. అవమానంతోను, అసహ్యంతోనూ నిలువెల్లా వణికిందామె. కూతురు తనవైపు చూస్తున్న చూపుకి మరో అర్థాన్ని వెదుక్కున్న విశాలాక్షికి వున్నట్టుండి ఆమె ఇంకా ఆ నెల బయట చేరని సంగతి గుర్తొచ్చి నిలువెల్లా వణికిపోయింది.

ఆవిడ తల కొట్టుకుంటూ అక్కడనుంచి నిష్క్రమించింది.

★ ★ ★

రాజ్యలక్ష్మి ఎవరిమీదో గట్టిగా అరుస్తుంటే చదువుకుంటున్న సునీత ఏకాగ్రత కుదరక, చిరాగ్గా బయటకి వచ్చింది.

"నువ్వు నాకు నలభై రూపాయలివ్వాలి. ముప్ఫయ్యే అంటావేమిటి?"

"కాదు. ముప్ఫయ్యేనమ్మగారూ! పోయిన నెలలో రెండు కె.జి.ల బియ్యం పుచ్చుకు




న్నాను. అంతకుముందు నెల పెసరపప్పు అరకిలో ఇచ్చారు. మొత్తం ముప్ఫై రూపాయలే.

"మరి చింతపండు మాటేమిటి? అరకిలో చింతపండు పుచ్చుకున్నావు. దానికి డబ్బులివ్వవా? "

"అది పోయిన నెల సంగతి. ఆ డబ్బులు అప్పుడే ఇచ్చేశాను"

"ఇవ్వలేదు. ఇస్తానని అన్నావు. కాని, జీతమంతా తీసుకుపోయావు"

"నేనెంత చెబుతున్నా డబ్బివ్వలేదనే అంటున్నారు. నేను మీలాగ చదువుకోకపోయినా ఎవరికి ఎంత డబ్బు ఇవ్వాలో నాకు గుర్తే. అలాంటిది వెధవ పదిరూపాయల కోసం నన్ను నిలదీస్తున్నారా? మీ డబ్బు ఎడమచేత్తో విసిరేస్తాను" చేతులూపుకుంటూ అరుస్తోంది ఆదెమ్మ.

"ఇదుగో, మాటలు తిన్నగా రానియ్యి. ఏదో నాకు పూర్తికే డబ్బులిస్తున్నట్టు తెగనీలుగుతున్నావు. పట్టికెళ్ళిన సరుకులకి డబ్బు అడుగుతున్నాను. ఇచ్చి మరీ వెళ్ళు" ఆమెకేం తీసిపోనట్టు అరుస్తోంది రాజ్యలక్ష్మి.

రొంటిలోనుంచి నలిగిన నోట్లు తీసి విసురుగా ఆమె చేతిలో పెట్టి వెళ్ళిపోయింది ఆదెమ్మ.

"ఎందుకమ్మా, దానితో వెధవ గొడవ? " విసుగ్గా అంది సునీత.

"చింతపండు తీసుకుని డబ్బివ్వలేదు. ఇచ్చానని బుకాయిస్తోంది"

"వెధవ పది రూపాయలకోసం దానితో తగవు పెట్టుకున్నావు. రేపు అది పని మానేస్తే..."

"మానేస్తే మానెయ్యనీ! అందరికీ... ఆఖరికి పనిమనిషికి కూడా భయపడి బతకవలసివస్తోంది. వెధవ బ్రతుకు!" రాజ్యలక్ష్మికి కన్నీళ్లు వస్తున్నాయి.

"అంత భయపడుతూ ఎందుకమ్మా నీ ఇంట్లో నువ్వే దొంగలా మారేవు? " అని అడగలేదు సునీత. తన సరదాలు తీర్చే కల్పవృక్షం తల్లి.

ఆదెమ్మ సునీత భయపడినట్టు పనిమానలేదు. మామూలుగానే వచ్చి తనపని తను చేసుకుపోతోంది. అందుకు కారణం కూడా సునీతకి అర్ధమయింది. ఏ వస్తువయినా షాపులో ధరకంటే రెండు రూపాయలు తగ్గించే దానికి అమ్ముతుంది తల్లి. ఒక మాటపడినా తను కూడా లాభపడుతూండటంతో పని మానలేదు ఆదెమ్మ.

★ ★ ★

వూరినుంచి విశాలాక్షి అక్కయ్య వచ్చింది. ఆవిడ రాగానే, ఇంట్లో వున్న రాధని చూసి ఆశ్చర్యపోయి "నువ్వు కాలేజీకి వెళ్ళలేదేమే ఇవాళ సెలవా? " అని అడిగింది.

రాధ సమాధానం చెప్పేలోగానే విశాలాక్షి అందుకుంది. "సంబంధాలు చూస్తున్నాం. ప్రయివేటుగా చదివి పరీక్షలు వ్రాస్తుంది"

గంట తర్వాత భర్త ఆఫీసుకి వెళ్ళాక తోడబుట్టిన దానితో రాధని కాలేజీ మాన్పించిన కారణం చెప్పకుండా వుండలేకపోయింది.

గొంతు తగ్గించి తల్లి మాట్లాడుతున్న ధోరణి, పెద్దమ్మ ముఖంలోని ఆశ్చర్యం చూశాక, రాధకి వాళ్లు మాట్లాడుకుంటున్నది ఎవర్ని గురించో అర్ధమై తలకొట్టేసినట్టయింది.

"కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుందని ఎవరితో చెప్పుకోవాలో తెలియక నాలో నేను కుమిలిపోతున్నానంటే నమ్ము అక్కయ్యా! అటు ఆయనగారూ నన్నే సాధింపు. ఇటు ఈ పిల్ల పరిస్థితి చూస్తే భయం! నెలమీద పదిరోజులు దాటినా, ఇది బయట చేరకపోయేసరికి ఇది వాడితో ఏం వెధవ పనిచేసిందోనని హడలిచచ్చాననుకో! ఏదో దేముడు నాయందున్నాడు. ఆ

గండం గడిచింది"

"ఛ! చిన్నతనంకొద్దీ పిల్ల ఏదో ఆకర్షణలో పడినా, అంత తప్పు చెయ్యదే విశాలా! అయినా, ఈ రోజులలో ఈ కాలేజీ చదువులు వచ్చాక, ఇవన్నీ మామూలే అయిపోయాయి"

భూమి బ్రద్దలై తను అందులోకి కూరుకుపోతే బాగుండునన్పిస్తోంది రాధకి. అవమానంతో, సిగ్గుతో ఆమె ఒళ్ళంతా వణుకుతోంది. తను గర్భవతినని తల్లికి అనుమానం వచ్చిందా? ఏ తల్లీ తన కన్నబిడ్డని అనుమానించకూడదని అనుమానం...

ఆమెకి ఏడుపొస్తోంది.

"కాలేజీకి వెళ్తేనే అంతంతమాత్రం చదువులు! ఇంక ఇంట్లో చదవమంటే ఈ పరిస్థితులలో ఇదేం చదువుతుంది? ఇంకా రెండేళ్లు చదివితేనేగాని, డిగ్రీ చేతికి రాదు. అయినా చదువుకుని ఇదేమైనా ఉద్యోగం చెయ్యాలా, వూళ్ళేలాలా? ఏదో ఒక సంబంధం చూసి పెళ్ళి చేసెయ్యండి" పెద్దమ్మ సలహా ఇస్తోంది.

తల్లి ఏమంటోందో రాధకి విన్పించలేదు. వినాలనీ అన్పించలేదు.

తండ్రిపై అసహ్యం! తల్లిపై అసహ్యం! తనమీద తనకే అసహ్యం! రాధకి ఉప్పెనలా దుఃఖం వస్తోంది. ఆత్మహత్య చేసుకుందామన్నా చావలేని పిరికితనం!

సుధీర్ జ్ఞాపకాలతో మనసు నలిబిలి అవుతోంది. ఎన్ని కలలు కంది అతని తోడి వైవాహిక జీవితాన్ని గురించి? అవన్నీ ఉత్తి కలలుగానే మిగిలిపోయాయి. నింద తను మోస్తోంది. అతను మాత్రం వేరే అమ్మాయిని పెళ్ళి చేసుకుని సుఖంగా వున్నాడు. రాధకి కన్నీళ్లొస్తున్నాయి.

ఆమె పెద్దమ్మ మరునాడు భోజనాల దగ్గర చెప్పింది.

"నాకు తెలిసిన ఒక మంచి సంబంధం వుంది. అబ్బాయి ఏదో ఆఫీసులో క్లర్కుగా పనిచేస్తున్నాడు. అతనికి రాధనిస్తే బాగుంటుందని నా ఉద్దేశం. నేను వూరికి వెళ్ళాక ఆ సంబంధం తాలూకు వివరాలన్నీ కనుక్కుని వ్రాస్తాను"

రాధ చివ్వున తల ఎత్తింది. తనకి పెళ్ళా? పెళ్లి అనగానే సుధీర్ గుర్తుకొస్తాడు. అతను గుర్తు రాగానే గుండెల్లో మంటలు రేగాయి.

పెద్దమ్మ ఇంకా ఆ సంబంధం వివరాలు చెబుతోంది. "అబ్బాయి బుద్ధిమంతుడు. కట్నకానుకల విషయంలో పెద్దగా పట్టింపు వుంటుందనుకోను"

రాధకి తింటున్న అన్నం చేదుగా అన్పించింది. "సుధీర్‌ని మరచిపోయి వేరొకరిని పెళ్లి చేసుకోవడం సాధ్యమయ్యేదేనా? ఖరీదైన బట్టలతో అందంగా, హుందాగా... సరదాగా, చిలిపిగా అతను మాట్లాడేధోరణి, స్టీరింగ్‌పై ఒక చెయ్యి, విండోపై మోచేతిని ఆనించి అతను కారు నడిపేవిధం అన్నీ గుర్తువస్తున్నాయి రాధకి.

"నేను పెళ్లి చేసుకోను" గట్టిగా అరిచింది.

విశాలాక్షి, ఆమె అక్కయ్యా క్షణం అలా వుండిపోయారు. తేరుకుని కోపంగా అరిచింది విశాలాక్షి.

"పెళ్లి చేసుకోవూ? మరేం చేస్తావ్? చదువు నాశనం చేసుకున్నావుగా? అటు చదువు లేక, ఇటు పెళ్ళి చేసుకోక ఏం చేద్దామనే"

"నా చావు నేను చస్తాను. నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు"

"ఆ మాట నాన్నగారితో చెప్పు. సంతోషిస్తారు?" తండ్రి పేరు వినగానే రాధ ముఖం కందగడ్డలా మారింది. అసహ్యంతో ఆమె పెదవులు అదిరాయి. ఆమె కంచంలో చెయ్యి కడుక్కుని వెళ్ళిపోయింది.

"ఇదీ వరస అక్కయ్యా! గట్టిగా ఏదైనా అంటే ఏడుస్తుంది. ఈ ఇంటికి ఏ అప్రతిష్ట తెస్తుందోనని భయంగా వుంది" తల్లి ఏడుపు స్వరంతో అంటున్న మాటలు రాధ




చెవినపడ్డాయి.

జుగుప్సతో ఆమె శరీరం వణికిపోతోంది. కళ్లు నీటిచెలమలయ్యాయి.

ఆ రాత్రి ఆమె నిద్రపోలేదు.

సుధీర్ గుర్తుకొస్తున్నాడు. ఈపాటికి సుధీర్ భార్యగా అతని కౌగిలిలో ఆదమరచి నిద్రపోవలసిన తను కటిక నేలపై కన్నీళ్లే ఆహార పానీయాలుగా, నిద్ర కరువై, గుండె బరువై... రాధ కిటికీ బయట చిమ్మచీకటిగా వున్న శూన్యంలోకి చూస్తోంది. అది సునీతే కదూ ఇందుకు కారణం! తనకి సుధీర్‌కి మధ్య అడ్డుగోడ కట్టిన రాక్షసి. రాధకి సునీతని కసితీరా పొడిచి చంపాలనిపిస్తోంది. ఆమె అందమైన ముఖంపై యాసిడ్ పోసేయాలనివుంది

★ ★ ★

సుధీర్‌తో పెళ్లికోసం కలలు కన్న రాధ రాఘవ భార్యగా జీవితం ప్రారంభించి అప్పుడే నెలాపదిరోజులు. విశాలాక్షి అక్కయ్య రాధకి సంబంధం చెప్పి వూరుకోలేదు. పెళ్లి కొడుకు కుటుంబంతో బాగా పరిచయం వున్న ఆవిడ ఒకవిధంగా ఆ పెళ్ళికి మధ్యవర్తిత్వం నెరపింది.

మనసునిండా సుధీర్ జ్ఞాపకాలతో వున్న రాధకి వేరొక వ్యక్తిని పెళ్లి చేసుకోవాలనే ఊహే కంపరంగా వుంది. ఆమెకసలు బ్రతకాలని లేదు. కాని బ్రతకాలి. ఆత్మహత్య చేసుకోడానికి ధైర్యమూ లేదు. సుధీర్ పెళ్లి శుభలేఖ చూసినరోజు ఏదో వేడిలో, ఆవేశంలో, దుఃఖంలో చచ్చిపోయే ప్రయత్నం చేసిందేకాని, నిజంగా బ్రతుకుమీద ఆశ చచ్చికాదు.

ఏమో తన అదృష్టం బాగుంటే సుధీర్ కంటే మంచివాడు, యోగ్యుడు, డబ్బున్నవాడు తనకి భర్తగా లభించవచ్చు ఆశ చిరంజీవి. ఆశ అర్హత చూడదు. అంతస్తులని ఆలోచింపనివ్వదు. రాధ తాత్కాలికంగా సుధీర్‌ని మరచిపోయి ఇంట్లోవాళ్ళు తనకి పెళ్లి సంబంధాలు చూస్తుంటే వాళ్ళలో తన ఊహాసుందరుడు ప్రత్యక్షమవకపోతాడా అని ఆశగా ఎదురుచూస్తోంది.

పెళ్లికి అందం ఒక్కటే ప్రధాన అర్హత కాదని, ఆస్తి, అంతస్తు ఇవన్నీ అర్హతలుగా పరిగణించబడతాయని ఆమెకి కొద్దికాలంలోనే తెలిసివచ్చింది. గుమాస్తా ఉద్యోగం చేస్తూ వెనుక రూపాయి ఆస్తి లేనివాడు అరవై డెబ్బైవేలు కట్నం అడిగినప్పుడు ఆమెకి ఆ విషయం బాగా అర్థమయింది. రాధ తన ఇష్టాఇష్టాలతో ప్రమేయం లేకుండానే రాఘవ భార్య అయింది. రాఘవతో తన పెళ్ళి నిశ్చయమయ్యాక రాధకి మళ్ళీ సుధీర్ గుర్తుకొచ్చాడు. రాఘవని సుధీర్‌తో పోల్చుకోకుండా వుండలేకపోయిందామె.

రాఘవ సుధీర్‌కంటే అందగాడే. కాని అతనికి సుధీర్‌లోని హుందాతనం, దర్జా ఎక్కడివి? రాధ మనసు ఈ పెళ్లికి అంగీకరించవద్దని ఎదురు తిరుగుతోంది. కాని తనని చూస్తేనే మండిపడే తండ్రి కదలినా, మెదిలినా వెయ్యి కళ్లతో పహారా కాసే తల్లి, గృహనిర్బంధం... ఆ ఇంట్లోనుంచి బయటపడాలంటే పెళ్ళి ఒక్కటే మార్గం. రాధ తప్పనిసరి పరిస్థితులలో పెళ్లికి తలవంచింది.

రాఘవ భార్యగా జీవితం ప్రారంభించి నెలా పదిరోజులు. ఆ నలభై రోజులలో కొన్నాళ్లు పుట్టింట్లో, కొన్నాళ్లు అత్తవారింట్లో వుండడంవలన ఆమెకి రాఘవ వ్యక్తిత్వాన్ని అంచనా కట్టడానికి అవకాశం లభించలేదు.

రాఘవ వుండేది వైజాగ్‌లో ఒక మూడు గదుల అద్దె ఇంట్లో. ఆ ఇంటిముందు రిక్షా దిగుతున్న రాధ ముఖం ఆ ఇంటిని చూడగానే అసంతృప్తితో ముడుచుకుపోయింది.

"నువ్వు కోరితే ఇంద్రభవనాన్ని నేలకి దింపనూ?" ఒకప్పుడు సుధీర్ అన్న మాటలు ఆమెకి గుర్తువచ్చి ముఖం మ్లానమయింది.

తలుపుతాళం తెరిచిన రాఘవ "అక్కడే నిలబడిపోయావేం, లోపలకి రా!" అన్నాడు.

రాధ లోపలకి అడుగుపెడుతూ తల ఎత్తి చూసింది. వెంటనే ఆమె కళ్లలో ఛమక్ మనే కాంతి ఎగిరివచ్చింది.

ముందు గదిలో వున్న నాలుగు కేన్ కుర్చీలు, మధ్యలో చిన్న టీపాయ్‌మీద ఫ్లవర్‌వేజు, మధ్యగదిలో వున్న డబుల్ కాట్, వంటగదిలో వున్న ఫ్రిజ్. ఆమె రాఘవ అభిరుచిని మెచ్చుకోకుండా వుండలేకపోయింది. తన కలల్లో కొన్నయినా సాఫల్యం చెందుతున్నందుకు ఆమెకి ఆనందంగా వుంది.

"వంట చెయ్యి. డబ్బాలో బియ్యం వున్నాయి" అన్నాడు రాఘవ.

"ఇప్పుడా? " రాధకి నీరసం వచ్చింది. "ఈ పూటకి బయట ఎక్కడైనా తినేద్దాం" అంది.

"ఇంకా నయం. మనం తినే గుప్పెడు మెతుకులకి ముప్పై ఆరు రూపాయలు దండగ. అన్నం వండేస్తే ఏ పచ్చడో వేసుకుని తినెయ్యవచ్చు"

రాధ తన అసంతృప్తిని బయటపడనివ్వకుండా అన్నంవండే ప్రయత్నంలో పడింది.

ఆ రాత్రి అతను భోజనానికి ఉపక్రమించబోతూ అన్నం గిన్నెమీద మూతతీసి చూసి "అన్నం మిగిలిపోతుందేమో! బియ్యం ఎక్కువ పోశావా? " అనడిగేడు.

రాధ తికమకగా చూసింది. నిజానికి ఆమెకి తల్లి వెనకాలే ఏదో పనిచేశాననిపించుకోవడం తప్ప స్వయంగా గృహబాధ్య తను వహించడం ఇదే మొదటిసారి. రాఘవతో ఆ మాటే అంది.

"అన్నం మిగిలిపోతే రేపు పొద్దుట పులిహోర చేస్తానులెండి. బ్రేక్‌ఫాస్ట్‌కి పనికి వస్తుంది!"

"ఎందుకూ నూనె దండగ. ఇప్పుడు వండిన అన్నం రేపు పొద్దుటకి పాడవదు. వేడిచేసి తినెయ్యవచ్చు" ఆ రాత్రి అతను చెప్పాడు.





"ఇరుగు పొరుగువాళ్ళతో ఎక్కువ పరిచయాలు పెంచుకోకు. ఓ కప్పుడు కాఫీ పొడి ఇవ్వమనో, గ్లాసుడు పంచదార కోసమో అప్పుకి రావడం మొదలుపెడతారు"

"అలాగే" అంది రాధ.

"అంతేకాదు. పరిచయాలు పెరగడంవలన మరొక రకం ఇబ్బందులు ఎదురవుతాయి. వాళ్లు చేసిన పిండివంటలవీ మనకి రుచి చూపించడం మొదలుపెడతారు. ఇంక మనం కూడా వాళ్ళకి ఇస్తూవుండాలి"

"ఊఁ!" అంది రాధ. ఆమెకి ఆ సంభాషణ రుచించలేదు. కిటికీలోనుంచి బయట కనబడుతున్న వెన్నెలని చూస్తోంది.

"నేను చెప్పేది సరిగ్గా వింటున్నావా? "

"విన్నాను. మీరే పుస్తకాలు చదివారు? " మాట మారుస్తూ అడిగింది.

"నేనసలు పుస్తకాలు చదవను"

"ఒకప్పుడు నేనూ చదివేదాన్ని కాదు. కాని శారద అని నాకో స్నేహితురాలు వుంది. ఆమెవల్లనే నాకు పుస్తకాలు చదవడం అలవాటయింది. చదివిన పుస్తకాలలోని మంచి కొటేషన్లని, కవితలని డైరీలో వ్రాసుకోవడం ఆమే అలవాటు చేసింది. వుండండి. చూపిస్తాను" రాధ తన పెట్టెలో నుంచి డైరీ తీసి పేజీలు తిప్పింది.

"శిశువులాంటి వెన్నెల
నవవధువు లాంటి మధువులాంటి వెన్నెల
శిశిరానిలానికి చలించే
పొరల పొరల వెన్నెల
శరద్రధుని సౌధానికి కట్టిన
తెరల తెరల వెన్నెల
ఎంత..."

కరెంటు పోయింది. రాధ చటుక్కున తల ఎత్తి చూసింది. లైటు స్విచ్ ఆఫ్‌చేసి అతను చెప్పాడు. గదంతా అలుముకున్న చీకట్లో అతని స్వరం వినిపించింది.

"సాయంకాలం 6 నుంచి రాత్రి 9 గంట

లవరకు ఇలా లైట్లు వెలిగితే, నెలకి ఎన్ని యూనిట్లు కరెంటు కాలుతుందో తెలుసా? ఇల్లంతా లైట్లు వెయ్యకు... ఏ గదిలో అవసరమైతే ఆ గదిలోనే లైటు వెయ్యి"

రాధ ముఖం మాడిన బల్బులా అయింది.

* * *

తలుపు తట్టిన శబ్దం విన్న రాధ వెళ్ళి తలుపుతీసింది. ఎదురుగా ఎవరో అపరిచిత వ్యక్తి. "బడ్జెట్ రాఘవ వున్నాడా"

రాధకి అతనేమంటున్నాడో అర్థం కాలేదు. "ఎవరూ?" అడిగింది.

"మీరు రాఘవ..." అర్థోక్తిలో ఆగాడతను.

"నేను రాఘవగారి మిసెస్‌ని"

"సారీ!" అన్నాడతను. అతను దేనికి సారీ చెప్పాడో, కూడా ఆమెకి అర్థం కాలేదు.

"రాఘవ వున్నాడాండీ?"

"లేరు. బయటకి వెళ్లారు"

"నేను రాఘవ కొలీగ్‌ని. నా పేరు మోహన్. రేపు మా అబ్బాయి పుట్టినరోజు. సాయంకాలం 5 గంటలకి చిన్న పార్టీ వుంది. మీరిద్దరూ తప్పక రావాలి రాఘవకి పెళ్లయిందని తెలుసుకాని, మీరిక్కడే వున్నారని తెలియదు. మీరు వున్నారని తెలిస్తే మా శ్రీమతి కూడా వచ్చి మిమ్మల్ని పిలిచేది"

"ఫర్వాలేదండీ" అంది రాధ మొహమాటంగా. మోహన్‌ని లోపలికి రమ్మంది. అతను "నేను మళ్ళా వస్తానండీ" అంటూ వెళ్ళిపోయాడు. మరో గంట తర్వాత మోహన్ భార్యతోసహా మళ్ళీ వచ్చాడు. అప్పటికి కూడా రాఘవ ఇంటికి రాలేదు.

అతను వచ్చాక రాధ చెప్పింది, మోహన్ తమని బర్త్‌డే పార్టీకి పిలిచిన విషయం.

"రేపా? అలాగేలే వెళ్దాం" అన్నాడు.

"రేపు సాయంకాలం మీరు ఆఫీసునుంచి వచ్చాక మనం బజారుకి వెళ్లేసరికి ఆలస్యమవుతుందేమో"

"బజారుదేనికి?"

"వాళ్ళబ్బాయికి ప్రెజంటేషన్ కొనాలి కదా!"

"నేను చూస్తాను కదా!" అన్నాడతను.

మరునాడు సాయంకాలం రాఘవ ఆఫీసు నుంచి ఇంటికి వచ్చేసరికి రాధ తయారయి వుంది. భర్తతో మొదటిసారి బయటకి వెళ్ల బోతున్న రాధకి ఉత్సాహంగా వుంది. పెళ్ళినాడు అత్తగారు పెట్టిన పట్టుచీర కట్టుకుని, ముస్తాబయి వుంది. రాఘవ ఇంటికొస్తూనే చెప్పాడు.

"నాకు కాఫీ కలపకు! అక్కడ వాళ్ళెలాగా ఇస్తారు కదా!"

రాధ వింతగా చూసింది.

"అహఁ! రెండుసార్లు కాఫీ తాగడం నాకు అలవాటులేదు" అన్నాడు సర్దుకుంటూ.

పావుగంటసేపు బస్‌స్టాపులో నిలబడ్డాక బస్సు దొరికింది. ఒకళ్ళ నొకళ్ళు తోసుకుంటున్న ఆ జనం మధ్య నిలబడి పావుగంట ప్రయాణం చేశాక గమ్యం చేరారు. నలిగిపోయిన చీరని, రేగిపోయిన జుట్టుని సర్దుకుంటూ నడుస్తున్న రాధ రాఘవతో అంది,

"మీరు ఒక స్కూటర్ కొనుక్కోవలసిందండీ!"

"శుద్ధ దండగ! స్కూటర్ వుంటే ఇంక ఎవరో ఒకళ్ళు లిఫ్ట్ ఇమ్మంటారు. మొహమాటపెట్టి రైల్వేస్టేషన్‌కి వెళ్ళొస్తామనో, హాస్పిటల్‌లో వున్న తమ బంధువుని చూసి వస్తామనో స్కూటర్ అడుగుతారు" వెంటనే అన్నాడు.

రాధకి సుధీర్ గుర్తుకొచ్చాడు. "హీరో హోండామీద సుధీర్... మారుతీ జిప్సీ నడుపుతున్న సుధీర్... రాధ మనసులో అసంతృప్తి... అంతర్మథనం... రాఘవ భార్యగా బతుకుతూ సుధీర్‌ని తలచుకోడం తప్పు!" అంతరాత్మ గగ్గోలు పెడుతోంది. ఆమె అతిప్రయత్నంమీద తననితాను సంబాళించుకుంది.

మోహన్ ఇల్లు చేరేసరికి మరో పదినిము

షాలు...

రాఘవ ఆఫీసు వాళ్ళంతా అక్కడే వున్నట్టున్నారు. పలుకరింపులు, చిరునవ్వులు... పరిచయాలు... నమస్కార ప్రతినమస్కారాలు అయ్యాక అందరూ కూర్చున్నారు.

వెనుకనుంచి గుసగుసలు విన్పిస్తుంటే అందులో రాఘవ పేరు స్పష్టంగా వినిపించి, చెవులు రిక్కించింది రాధ.

"బడ్జెట్ రాఘవ పెళ్ళాం చాలా అందమైనది"

"హుష్! మెల్లిగా! వినబడగలదు. జాగ్రత్త!"

రాధకి తింటున్న స్వీటు చేదుగా అన్పించింది.

'బడ్జెట్ రాఘవ!' తన భర్తకి నిక్‌నేమ్ వుంటే వుండవచ్చు కాని, అతని కొలీగ్స్ అతని భార్య వినేట్టు ఆ పేరుతో పిలవడం ఎంత దురదృష్టకరం?

భర్త మోహన్ కొడుకు చేతిలో పెడుతున్న బిస్కట్ పేకెట్టు చూసి ఆమె ముఖం మరింత పాలిపోయింది.

ఇంటికి వచ్చేప్పుడు మోహన్ భార్య తన చేతిలో పెడుతున్న ఖరీదైన జాకెట్టు గుడ్డని చూసి ఆమె తల ఎత్తుకోలేకపోయింది.

ఇంటికి వస్తుండగా రాధ అంది, "మీరు కనీసం ఒక పాతిక రూపాయలు పెట్టి ఒక బొమ్మ అయినా కొనుక్కురావలసింది. మీ ఆఫీసు వాళ్ళంతా అంతకుమించిన ఖరీదైన బహుమతులనే కొన్నారు"

"బహుమానం ఖరీదు ముఖ్యం కాదు. దాని వెనుకవున్న ఆప్యాయత ముఖ్యం" అన్నాడు రాఘవ.

రాధ ఇంక సంభాషణ పొడిగించదలచుకోలేదు.

★ ★ ★

రాఘవ నిజంగా బడ్జెట్ రాఘవే! బడ్జెట్ ప్రకారమే ఖర్చు చేస్తాడు.

ఆ ఇంట్లో ఫ్రిజ్ వుంది. అందరిలా పళ్ళు కూరలు, పాలు, పెరుగు పెట్టుకోడానికి కాదు వండిన కూరలు, మిగిలిపోయిన అన్నం పెట్టుకోడానికి.

పెరిగిపోతున్న ధరల దృష్ట్యా ఆలోచిస్తే ఏదీ వేస్టు కానివ్వని రాఘవ మనస్తత్వం మంచిదేనేమో!

పొదుపు ఎప్పుడూ అభిలషణీయమే.

కాని, లోభిత్వమే బాధపెడుతుంది.

రాధ, కాపురానికి వచ్చిన పదిరోజుల తరువాత జరిగిందా సంఘటన.

రాధకి అనుభవంలేక అయితేనేం ఎంత వండాలో అంచనా తెలియక అయితేనేం ఆరోజు ప్రొద్దుట క్యాబేజికూర కొంచెం ఎక్కువగానే చేసింది. రాఘవ ఆఫీసుకి వెళ్తూ అన్నం తింటాడు.

కూరగిన్నె మూత తీసిన అతని కళ్ళు వెడల్పయ్యాయి.

"ఇంత కూర వండావేమిటి? " అనడిగేడు.

"కొంచెం ఎక్కువే వుంది. పోనీలెండి. రాత్రికి వుంటుంది"

"క్యాబేజి కూర రాత్రికి నిలవవుండదు. ఫ్రిజ్‌లో పెడదామంటే కరెంటు ప్రొద్దుటనగా పోయింది. వర్షానికి కరెంటు స్తంభం పడిపోయి లైన్లు తెగిపోయాయిట. బాగుచేసేటప్పటికి సాయంకాలం అవచ్చు అంటున్నారు" అతను కూర మొత్తం తీసి ఇద్దరి, కంచాలలో వడ్డించేసాడు. రాధ చెయ్యి అడ్డం పెట్టేసరికే ఆలస్యమయింది.

అతను చారు, మజ్జిగ అన్నీ మానేసి కూరతోనే అన్నమంతా తిన్నాడు.

"రాత్రికి ఇంక కూర వండకు. పచ్చడితో తిందాం" అన్నాడు ఆఫీసుకి వెళ్తూ.

రాధ నోట మాట రానట్టు చూస్తోంది. ఆమె అలా వుండగానే అతను వెళ్ళిపోయాడు

★ ★ ★

రాధ స్నానం చేసివచ్చి బొట్టుపెట్టుకుందామని తిలకం సీసా చేతిలోకి తీసుకుంది. తిలకం లేదు. వారంరోజులకిందటే




అయిపోయింది. అడుగున వున్న కాస్త తిలకంలో నీళ్ళు పోసి బాగా గిలకరించి వారం రోజులుగా బొట్టుపెట్టుకుంటూ వచ్చింది.

రాధ అంటీ అంటనట్టుగా వున్న తిలకంతో బొట్టు పెట్టుకున్నాననిపించి, పైన కుంకుమ పెట్టుకుంది. ఆఫీసుకి వెళ్తున్న రాఘవతో చెప్పింది.

"తిలకం అయిపోయింది. సాయంకాలం తెచ్చిపెడతారా? "

"ఈ నెలలో మోహన్ కొడుకు బర్త్‌డే పార్టీకి వెళ్ళాం కదా! బడ్జెట్‌ని మించి ఖర్చయింది. తిలకం సీసా వచ్చే నెలలో కొంటాను"

"వచ్చేనెలలో కొంటారా? అంతవరకు బొట్టుపెట్టుకోకుండా వుండనా? " రాధ ఉక్రోషం దిగమింగి నవ్వుతూనే అడిగింది.

రాఘవ ఒకసారి ఆమె ముఖాన్ని పరిశీలనగా చూసి, "కుంకుమ పెట్టుకో" అనేసి వెళ్ళిపోయాడు.

రాధ కళ్లలో చివ్వున నీళ్లూరాయి.

నాలుగు రూపాయల తిలకం సీసా కొనడానికి డబ్బులు లేవని చెబుతున్న భర్త!

"బడ్జెట్!" నిరసనగా అనుకుంది.

"బడ్జెట్!" ఏహ్యంగా, తిరస్కారంగా అనుకుంది. అప్రయత్నంగానే ఆమెకి సుధీర్ గుర్తుకొచ్చాడు. అతను తనకి నెయిల్ పాలిష్, పెర్ఫ్యూమ్ బాటిల్స్‌ని బహుమతిగా ఇవ్వడం గుర్తుకొచ్చింది.

సుధీర్ భార్యగా భోగభాగ్యాలమధ్య తులతూగవలసిన తను మామూలు గుమాస్తాకి భార్య అయినందుకు ఆమె బాధ పడడం లేదు. కనీస అవసరాలు తీర్చని వ్యక్తికి భార్య అయినందుకు బాధపడుతోంది.

ఒకరకంగా సుధీర్‌ని మరిచిపోయి రాఘవని భర్తగా ప్రేమించడానికి మనసుని ఆయత్తం చేసుకుంటున్న ఆమెకి సుధీర్ గుర్తుకి వచ్చాడు.

ఆ సంఘటన రాధ మనసులో భర్తపై ఇప్పుడిప్పుడే అంకురిస్తున్న ప్రేమస్థానంలో ద్వేషాన్ని కలిగించడానికి కారణమయింది.



"ఇవాళ సాయంకాలం పెందరాళే ఇంటికి రండి"

"ఏం? " అడిగేడు రాఘవ.

"సినిమాకి వెళ్దాం"

"ఎందుకు, దండగ, బోలెడు డబ్బు వేస్టు"

"మన పెళ్ళయి ఎన్నాళ్ళయింది? "

"ఏం? నీకు తెలియదా? "

"ముందు నేను అడిగిన దానికి జవాబు చెప్పండి" గట్టిగా అంది.

"ఆరునెలలు"

"ఈ ఆరు నెలల్లోను మనం ఎన్ని సినిమాలకి వెళ్ళాం? "

"రెండు"

"కట్టుకున్న పెళ్ళాన్ని కనీసం నెలకో సినిమాకైనా తీసికెళ్ళాలని మీకు అన్పించదూ? "

రాధకి ఉక్రోషంతో కన్నీళ్ళొస్తున్నాయి.

"అదేమీ భార్యకి అన్నంపెట్టనంత పెద్ద నేరమేమీ కాదే!" రాఘవ ప్రశాంతంగా చూసాడు. అతనిలో గొప్ప గుణం అదే. దేనికీ ఇరిటేట్ అవడు. కోపంకాని, ఆవేశం కాని అతని ముఖంలో ప్రతిబింబించవు. మిన్ను విరిగి మీదపడినా చలించనట్టే వుంటాడు.

"అంటే... అంటే... నాకు అన్నం పెడుతున్నందుకు సంతోషించమంటారా? "

"నేను అలా అనలేదే! అలా నువ్వనుకుంటే అది నీ ఇష్టం" అతను జుట్టు దువ్వుకోడం పూర్తిచేసి దువ్వెన శుభ్రంగా తుడిచి, "నేను ఆఫీసుకి వెళ్ళి వస్తాను" అని అతి మామూలుగా చెప్పి వెళ్ళిపోయాడు.

వెనకనుంచి రాధ కసిగా ఆవేశంగా ఛీత్కారంగా అగ్నిగోళాల్లాంటి కళ్లతో అతన్ని

చూస్తోంది.

రాఘవ తనతో తగవు పెట్టుకుని వుంటే బాగా దెబ్బలాడి తన మనసులోని మంటని చల్లార్చుకునేది. కానీ అతను కూల్‌గా వెళ్ళిపోవడంతో ఆమెకి దుఃఖం ఆగింది కాదు.

"ఏం సాధించిందీ పెళ్ళితో" ఒక పంజరం లోనుంచి మరొక పంజరంలోకి అడుగుపెట్టింది. అంతేగా? తన తండ్రికి ప్రతిబింబం రాఘవ. తండ్రి రెండు పూటలా అన్నం పెట్టేవాడు. ఇతను తిండి కూడా తినని వ్వడు. రాధకి తల్లి గుర్తువచ్చింది. తన అవసరాలకోసం డబ్బిమ్మని తండ్రిని దేవిరించే తల్లి!

తల్లి బిచ్చగత్తె కంటే హీనంగా తండ్రిని డబ్బుకోసం ప్రాధేయపడేది.

తను తన అవసరాలు తీర్చమని భర్తతో దెబ్బలాడుతోంది! అంతే తేడా!

రాధకి సుధీర్ జ్ఞాపకం వచ్చాడు! "సుధీర్ భార్యగా సుఖమయమైన జీవితాన్ని గడపవలసిన తను ముష్టిదానికంటే హీనంగా... అది.. ఆ సునీతే కదూ ఇందుకు కారణం!

తను సుధీర్‌కి రాసిన ఆ ఉత్తరం సునీత అతడికి అందనిస్తే ఈ పాటికి సుధీర్ భార్యగా..." సునీతని తలచుకుంటే ఆమె పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి.

కసి... ఉన్మాదం... ఉద్రేకం... అసహ్యం... రాఘవకి ఇష్టంలేని పనులు చెయ్యాలి. తన ఇష్టాన్ని గౌరవించని అతన్ని తనెందుకు గౌరవించాలి?

రాధ త్వరగా తయారయి ముఖం కడుక్కుని పక్క ఇంటికి వెళ్ళింది.

పక్క ఇంట్లో వుంటున్నా ఎప్పుడూ తమ ఇంటికి రాని రాధని ఆవిడ నిలువు గుడ్లేసుకుని చూస్తోంది.

రాధ ఆవిడకి తాను తెలియదేమోనని తననితను పరిచయం చేసుకుంది.

"నాకు మీరు తెలుసు. లోపలకి రండి" అందామె.

"ఏమీ తోచడంలేదని వచ్చానండీ. పుస్తకాలేమైనా వున్నాయా? " అడిగింది రాధ.

"కూర్చోండి" అందావిడ. మాటల సందర్భంలో ఆమె పేరు నాగమణి అని, ఆమె భర్త బ్యాంకు ఆఫీసరని తెలుసుకోగలిగింది.

ఆ ఇంట్లో కూర్చున్న అరగంటలోనూ రాధ ఆమె గురించి చాలా విషయాలు తెలుసుకోగలిగింది. నాగమణికి ఆడంబరం ఎక్కువ. ముఖ పరిచయంలోనే తనకి పుట్టింటివాళ్ళిచ్చిన ఆస్తి వివరాలు, భర్త సంపాదన వగైరా వివరాలన్నీ చెప్పింది. తనకంటే ఉన్నతమైన స్థితిలో వున్న వాళ్లెవరిని చూసైనా అసూయపడే రాధకి నాగమణి ఎడల అసూయ కలిగింది.

తనతో మాట్లాడుతూన్న ఆమె చూపులు తదేకంగా కొద్దినిముషాలు తనపై నిలవడం, ఆ చూపులలోని అసూయ గమనించి తనకి తెలియకుండానే గర్వంగా ఫీలయింది రాధ.

"మీరు ఏ బ్యూటీపార్లర్‌కి వెళ్తారు రాధా? " వున్నట్టుండి అడిగింది నాగమణి.

"నేను ఇంతవరకు ఏ బ్యూటీపార్లర్‌కీ వెళ్లలేదండీ!" అంది రాధ ఆమె ఎందుకలా అడిగిందో ఊహిస్తూ.

"అదృష్టవంతులు మీరు" అందామె నున్నగా మెరుస్తున్న రాధ చెక్కిళ్ళని, తీర్చిదిద్దినట్టున్న ఆమె కనుబొమలని చూస్తూ.

రాధ పెదవులపై సన్నని హాసరేఖ మెరిసింది.

ఆమె చుబుకం చిరుగర్వంతో పైకి లేచింది.

"తనని చూసి అసూయపడుతోంది" అలా అనుకోగానే ఆమెకి తృప్తిగా అనిపించింది.

మరునాటి ఉదయం పదిగంటలకి తమ ఇంటికి వచ్చిన నాగమణిని సాదరంగా ఆహ్వానించింది రాధ. ఆ సమయంలో ఆమె తలంటిపోసుకున్న జుట్టుని ఆరపెట్టుకుంటోంది.

నల్లని వత్తైన ఆమె తలకట్టుని రెప్పలార్పకుండా చూసిన నాగమణి "తలకి ఏ నూనె





వాడతారు మీరు రాధా? " అనడిగింది.

రాధ గర్వంగా నవ్వింది. "నేను నా శరీరం గురించి ప్రత్యేకించి ఏ శ్రద్ధా తీసుకోనండీ!" అంది.

"మీరు అదృష్టవంతులు!"

ఆమె స్వరంలో ధ్వనిస్తున్న అసూయకి రాధ ముఖం క్షణం మ్లానమయింది.

"అందం తప్ప తన దగ్గర ఏముంది? తిలకం సీసా కూడా కొనివ్వని భర్త... తన అందానికి ఏ రాకుమారుడో తనని వలచివస్తాడని కలలు కంది" రాధ నిస్పృహగా నిట్టూర్చింది.

నాగమణి చేతిలోని కప్పుని ముందుకి జాపుతూ అడిగింది.

"కాస్త ఈ కప్పుడు కాఫీపొడి ఇస్తారా? ఫస్టు తారీఖున సరుకులు తేగానే ఇస్తాను"

రాధకి తను కాపురానికి వచ్చిన రోజు భర్త చెప్పిన మాటలు గుర్తుకువచ్చాయి.

"ఇరుగు పొరుగు వాళ్ళతో ఎక్కువ పరిచయాలు పెంచుకోవద్దని, అప్పులకి వస్తారనే కదూ చెప్పాడు! తనకి విలువనివ్వని భర్త మాటలకి తనెందుకు విలువనివ్వాలి?"

ఆమెకి కసిగా వుంది. ఆమె లోపలకి వెళ్ళి కాఫీపొడి తెచ్చి ఇచ్చింది.

నాగమణి థ్యాంక్స్ చెప్పి వెళ్ళిపోయింది. రాధ వెనుకనుంచి ఆమెనే చూస్తోంది. ఆమె మనసు అసూయతో మండుతోంది.

★ ★ ★

శారదకి యూనివర్సిటీ ఫస్ట్ వచ్చింది. "తర్వాత ఏం చేయాలనుకుంటున్నావు?" అని కూతుర్ని అడగలేదు సాంబశివరావు.

తర్వాత ఏం చెయ్యాలో ఆయనే నిర్ణయించినట్టు చెప్పాడు.

"నిన్ను చూసుకోడానికి రేపు పెళ్ళివారు వస్తున్నారు" తండ్రి అనూహ్యంగా తన పెళ్ళి ప్రస్తావన తేవడం శారదకి షాకింగ్‌గా అన్పించింది.

"నేను కొన్నాళ్ళు ఏదైనా ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నాను నాన్నగారూ!"

"నువ్వు ఉద్యోగం చెయ్యవలసిన అవసరం ఏముంది? " తండ్రి సౌమ్యంగానే అడిగినా, శారదకి అది కఠినంగా తోచింది.

"ఆర్థికంగా నా కాళ్ళమీద నేను నిలబడగలగాలి నాన్నగారూ! తర్వాతనే పెళ్ళి"

సాంబశివరావు కొత్త విషయం వింటున్నట్టు కళ్ళు పెద్దవి చేసి చూస్తున్నాడు.

"నా అవసరాలకోసం ప్రతి పైసాని భర్తని దేవిరించడం ప్రతి చిన్న అవసరానికి అతనిపై ఆధారపడడం నాకు అసహ్యం నాన్నగారూ! అందుకే కొంతకాలం ఎంత చిన్న ఉద్యోగమైనా చేసి నాకంటూ కొంత డబ్బు సంపాదించుకోవాలనుకుంటున్నాను" శారద స్వరంలో స్థిరనిర్ణయం లాంటిది ధ్వనించింది.

"చూడమ్మా! నువ్వేదో లేనిపోనివి ఊహించుకుని, భర్తని డబ్బు అడగడం నామోషీ అనుకుంటున్నావు. మన వివాహవ్యవస్థలోనే వుంది భరించేవాడు భర్త, భరింపబడేది భార్య అని. మగవాడు భార్యా, పిల్లలకోసం, సంసారంకోసం సంపాదించాలి. అది అతని ధర్మం. నువ్వు చదువుకున్న దానివి కాబట్టి ఉద్యోగం చేసి సంపాదించాలనుకుంటున్నావు. మరి చదువుకోని వాళ్ళమాటేమిటి? "

"అవకాశం వుంది కాబట్టే ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నాను. భర్త సహృదయంతో భార్యకేవో అవసరాలుంటాయి అని గ్రహించగలిగి ఆమెకంటూ కొంత డబ్బు యిస్తే ఫర్వాలేదు. డబ్బు పెత్తనాన్ని గుప్పిటలో పెట్టుకుని, స్త్రీని ఆర్థికంగా అస్వతంత్రురాలిని చేసిననాడు ఆ స్త్రీ జీవితం నరకప్రాయమే అవుతుంది"

తన అభిప్రాయాన్ని నిర్భయంగా చెప్పిన శారద ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోయింది కాని, సాంబశివరావుకి మాత్రం నిద్రపట్టలేదు.

మరునాటి ఉదయం జానకి కూతురిని పిలిచి అంది.

"నువ్వు మీ నాన్నగారితో చెప్పినది నేను విన్నాను. నీ అభిప్రాయం రైటే. కాని, ఎప్పటికైనా పెళ్ళి తప్పదు కదా! అనుకూలమైన సంబంధం వచ్చినప్పుడు ఉద్యోగం కోసం పెళ్ళి మానుకోడం అవివేకం కాదా? "

"అమ్మా! ఉద్యోగం చెయ్యాలనే నానిర్ణయం ఇవాళ్టిది కాదు. కొన్నేళ్ళ నా కల. కనీసం రెండు సంవత్సరాలు ఉద్యోగం చేసి నాకంటూ కొంత డబ్బు సంపాదించుకున్నాకనే పెళ్ళి"

"పెళ్ళికి, ఉద్యోగానికి సంబంధం ఏమిటే, పెళ్ళయ్యాకనయినా ఉద్యోగం చెయ్యవచ్చు"

"పెళ్ళయ్యాక అతను నేను ఉద్యోగం చెయ్యడానికి ఒప్పుకోకపోతే"

దీనికి జానకి సమాధానం చెప్పలేదు.

"ఈ సంబంధం మంచిది శారదా! అబ్బాయి బ్యాంకులో పనిచేస్తున్నాడు. బుద్ధిమంతుడు. ఇంతకీ నీకు నచ్చితేనే! అయినా చూసిన సంబంధాలన్నీ నిశ్చయం కావుగా? '

"పెళ్ళిచేసుకునే ఉద్దేశం లేనపుడు ఈ పెళ్ళి చూపులెందుకమ్మా" అని అడగలేదు శారద.



పెళ్ళి చూపులలో అబ్బాయిని చూసిన శారద, "మగాళ్ళలో ఇంత అందమైన వాళ్ళుంటారా? " అని ఆశ్చర్యపడింది. ఆమె స్థానంలో మరే అమ్మాయి అయినా వుండి వుంటే, ఎగిరి గంతేసి పెళ్లికి ఒప్పుకునేదే కాని, పెళ్ళిపట్ల ఏమాత్రం ఉత్సాహం లేని ఆమె మనసుని అతను కదిలించ లేకపోయాడు.

"ఎలా వున్నాడమ్మా అబ్బాయి? " పెళ్ళివారు అలా వెళ్ళగానే కూతుర్ని అడిగాడు సాంబశివరావు.

శారద నిర్లిప్తత నిండిన స్వరంతో క్లుప్తంగా అంది, "నేను ఆలోచించుకోవాలి నాన్నగారూ" ఆయన హతాశుడైనట్టు చూసాడు. ఆ రాత్రి భార్య దగ్గర కోపంగా అన్నాడు.

"దీని వాలకం చూస్తే పెళ్ళిపట్ల ఏమాత్రం ఆసక్తి వున్నట్టు లేదు. అబ్బాయి ఎంత అందంగా వున్నాడు. పైగా బ్యాంకులో పనిచేస్తున్నాడు. వెయ్యి జన్మలెత్తినా ఇంతకంటే మంచి సంబంధం దానికి దొరకదు."

"మనకి నచ్చితే చాలా? వాళ్లకీ మనం నచ్చాలిగా? " అంది జానకి.

పదిరోజులు గడిచాక, అబ్బాయి తరపువారినుంచి ఉత్తరం వచ్చింది. తమకి అమ్మాయి నచ్చిందని, మిగతా విషయాలు మాట్లాడుకున్నాక ముహూర్తం నిర్ణయించుకోవచ్చని దాని సారాంశం.

"ఇదుగో, వాళ్లకి మనమ్మాయి నచ్చిందని ఉత్తరం వ్రాశారు. మరి దాని అభిప్రాయం కనుక్కో" భార్యని పిలిచి చెప్పాడాయన.

"మీరే కనుక్కోండి" అంది జానకి. శారద ఈ సంబంధం పట్ల మొదటినుంచీ ఆసక్తి చూపించకపోవడంతో ఆమెకి లోలోన భయంగానే వుంది. తను అబ్బాయికి నచ్చిందని తండ్రి చెప్పిన వార్తని కూడా శారద నిర్లిప్తతతోనే వింది.

"నేను ఆలోచించుకోవాలి నాన్నగారూ? నాకు వారంరోజులు టైమ్ కావాలి" అంది.

సాంబశివరావు పళ్ళు కొరుక్కున్నాడు.

"ఆనంద్‌గారికి,

నమస్తే నేను మీకు గుర్తుండే వుంటాను. పదిరోజుల క్రిందట మీరు పెళ్ళిచూపులు చూసుకున్న అమ్మాయిని. మీకు నేను నచ్చానని మీ పెద్దలు వ్రాసిన ఉత్తరాన్ని మా నాన్నగారు ఇప్పుడే చూపించారు. చాలా సంతోషం. కాని, మీ వైపునుంచి పెళ్లికి పూర్తి అంగీకారం లభించలేదు. మీకు నా చదువు, అందం మానాన్నగారిచ్చే కట్నం (క్షమించండి) నచ్చి నన్ను మీ జీవితభాగస్వామినిగా నిర్ణయించుకుని వుండవచ్చు కాని, నాకు పెళ్ళి, భర్త విషయంలో కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి.

ముఖ్యంగా నేను ఆర్థికంగా ఎవరిపైనా ఆధారపడకూడదు. మీ మీ ద ఐ మీన్ నా భర్త మీద కూడా. పోషించేవాడు భర్త, పోషింపబడేది భార్య అనే సాంప్రదాయం కల మన వివాహ వ్యవస్థపైన నాకెందుకో నమ్మకం లేదు. ఎంత కట్నం ఇచ్చినా భార్య భర్తపైన ఆధారపడవలసిందే. ఇలాంటి పరిస్థితులలో స్త్రీకి భద్రత ఎక్కడ? ఇవీ నా అభిప్రాయాలు. పెళ్ళిచూపులలోనే నా అభిప్రాయాలను మీకు తెలియచేయాలనుకున్నాను. కాని, అందుకు అవకాశం లభించలేదు. నేను చిన్నదైనా, పెద్దదైనా ఏదో ఒకటి నా అర్హతలకి తగిన ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నాను. ఆ ప్రయత్నంలో నేను వుండగానే మా వాళ్ళు మీ సంబంధం కుదిర్చే ఆలోచనలో వున్నారు. నేను ఉద్యోగం చెయ్యడం మీకు ఇష్టమైతే మన పెళ్లి జరుగుతుంది. ఈ విషయంలో మీ అంగీకారాన్నయినా, అనంగీకారాన్నయినా నిస్సంకోచంగా చెప్పండి.

శారద"

ఉత్తరం వ్రాయడం పూర్తిచేసిన శారద మరోసారి చదువుకుని, కవరు అతికించి,




చెప్పులు వేసుకుని బయలుదేరింది.

"ఎక్కడికమ్మా ఇంత ఎండలో? " తండ్రి ప్రశ్నతో ఉలిక్కిపడిందామె.

"ఉత్తరం పోస్ట్ చేద్దామని" అని చెప్పి వడివడిగా వీధిలోకి నడిచింది. ఆమె కెందుకో తండ్రి ఆ ప్రశ్న అడగడంలో అపశృతి ధ్వనించింది.

ఆ రాత్రి సాంబశివరావు కూతుర్ని మళ్ళీ అడిగాడు, "ఏమ్మా! అబ్బాయి నచ్చాడా? "

"బాగానే వున్నాడు? " క్లుప్తంగా అంది. ఆ క్షణంలో ఆయన ముఖంలోని వెలుగుని ఆమె గమనించలేదు.

వారం రోజులు గడిచాయి. ఆనంద్ నుంచి ఉత్తరంలేదు. శారదకి ఆరాటంగా వుంది. అతని ఉత్తరం కోసం మరో రెండు రోజులు ఎదురు చూసింది.

అతను ఉత్తరం రాయలేదు.

ఆనంద్ తను ఉద్యోగం చేయడానికి విముఖతనీ వ్యక్తం చెయ్యలేదు. అంగీకారాన్నీ తెలుపలేదు. ఇంక అతను తన ఉత్తరానికి జవాబు వ్రాయడని అర్థమయింది శారదకి. ఆమెకి అర్థమవనిదొక్కటే.

అతనికి తను ఉద్యోగం చెయ్యడం ఇష్టం లేకపోతే, ఆ విషయం స్పష్టం చేస్తూ జవాబు వ్రాయవచ్చుకదా! తన ఉత్తరానికి జవాబివ్వని కారణం ఏమిటి? నిర్లక్ష్యమా? అతని మౌనాన్ని అనంగీకారంగా భావించిన శారద ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు.

ఆరోజు సాయంకాలం జానకి కూతుర్ని పిలిచి చెప్పింది. "బజారుకి వెళ్ళి చీరలు కొనుక్కుందాం రా!"

"ఇప్పుడేం వద్దమ్మా"

"వద్దా? పదిరోజులలో నిశ్చయతాంబూలాలు. మరోపదిహేను రోజులలో పెళ్ళి. టెయిలర్ జాకెట్లు కుట్టి ఇవ్వద్దూ? "

"నిశ్చయ తాంబూలాలా? ఎవరికి? " శారద నిర్ఘాంతపోయింది.

"అదేమిటే, అలా అడుగుతున్నావ్? నీకే! అబ్బాయి నచ్చాడా అని మీ నాన్నగారు అడిగితే నచ్చాడని చెప్పావుగా? "

"నేను అతన్ని పెళ్ళిచేసుకుంటానని చెప్పలేదమ్మా! నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు"

జానకి క్షణం నిశ్చేష్టురాలయింది. తేరుకుని, కోపంగా అడిగింది.

"ఏం? ఎందుకని? "

శారద క్షణం సందేహించింది. తను అతనికి ఉత్తరం రాసిన విషయం తల్లికి చెప్పాలా, వద్దా? చెప్పినా ప్రయోజనం ఏమిటి?

"నేను ఉద్యోగం చేస్తాను"

"నీకు ఉద్యోగం దొరికి నీకు కావలసిన డబ్బు సంపాదించుకునే దాకా ఈ సంబంధం ఆగుతుందా? "

"వీళ్ళు కాకపోతే మరొకళ్ళు. నాకసలు పెళ్ళి చేసుకోవాలని లేదు" శారద అక్కడ నుంచి వెళ్లిపోయింది. జానకి ఆమె వెనుకనే ఆత్రంగా వెళ్ళింది.

"నామాట విను శారదా! మరో పది రోజులలో నిశ్చయతాంబూలాలు ఇవ్వడానికి మీ నాన్నగారు వెళ్తున్నారు. నీపెళ్లి స్థిరపడిన విషయం మన బంధువులలో చాలామందికి చెప్పుకున్నాం కూడా. ఇప్పుడు నువ్వీపెళ్ళి వద్దంటే నష్టపోయేది నువ్వే. స్థిరపడబోతున్న సంబంధం ఎందుకు చెడిపోయింది, అమ్మాయిలో ఏదో లోపం వుంది అంటూ నీపైనే నిందవేస్తారు తప్ప నిజానిజాలేమిటో ఆలోచించరు"

"అమ్మా!" శారద సహనాన్ని కూడదీసుకుంటూ అంది. "నా భవిష్యత్తుని గురించి నువ్వు భయపడుతున్నావో లేక నన్ను భయపెడుతున్నావో నాకు తెలియదు. కాని, నువ్వు భయపెడుతున్నంత పెద్ద సమస్యేమీ కాదు ఇది. పెళ్ళి నిశ్చయమవబోతోంది తప్ప ఇంకా నిశ్చయమవలేదుగా? అయినా నేను పెళ్ళి చేసుకోనని అనడంలేదే! ముందు ఉద్యోగం సంపాదించుకున్నాక



పెళ్ళి చేసుకుంటానంటున్నాను. అదే మగపిల్లవాడైతే ఉద్యోగం లేనిదే పెళ్ళి చెయ్యరు కదా! ఎందుకమ్మా, ఆడపిల్ల అంటే అంత పక్షపాతం? "

జానకి నిరుత్తరంగా చూస్తోంది.

కూతురి మాటలలో అసత్యంలేదు. కాని, భర్త? అతను ఎలాగైనా కూతురి పెళ్ళి చేసెయ్యాలని పట్టుదలగా వున్నాడు. ఈ సంబంధం దాదాపు స్థిరపడబోతుండగా కూతురు పెళ్ళిపట్ల విముఖంగా వుందని తెలిసి ఆయనేమంటాడు?

సాంబశివరావు వచ్చి భార్యని పిలిచాడు. "జానకీ, ఇదుగో నిశ్చయతాంబూలాలలో వాళ్ళకి పెట్టే బట్టలు. లోపల పెట్టు"

జానకి భయపడుతూనే అంది. "శారదకి ఈపెళ్ళి ఇష్టమో, కాదో కనుక్కున్నారా? "

"శారద ఆ అబ్బాయి నచ్చాడని చెప్పిందిగా? "

"శారద పెళ్ళి చేసుకోనంటోందండీ"

ఆయన అదిరి పడ్డాడు. "ఏం? ఎందుకని? "

"కొన్నాళ్ళు ఉద్యోగం చేస్తానంటోంది"

"దేనికి, ఉద్యోగం? నేను చచ్చాననా? "

"ఏమండీ! ఆవేశపడకండి" జానకి కన్నీళ్ళతో ప్రాధేయపూర్వకంగా అంది.

"అవతల పెద్ద మనుషులతో వ్యవహారం. ఒకవైపు నిశ్చయతాంబూలాలకి ముహూర్తాలు పెట్టుకున్నాక, ఇప్పుడు పెళ్ళి వద్దంటే లోకం నా ముఖాన ఉమ్మేస్తుంది. మన అమ్మాయిలో ఏదో లోపం వుందని, అందుకే కుదిరిన సంబంధం కాస్తా వెనక్కి వెళ్ళిందని అనుకుంటారు. దానికీ జన్మలో పెళ్లి అవదే" సాంబశివరావు ఆవేశంతో రొప్పుతూ కూతురి దగ్గరికి వచ్చాడు.

"ఏం... పెళ్లి చేసుకోనని మీ అమ్మతో చెప్పావుట? "

"కొన్నాళ్ళు ఏదైనా ఉద్యోగం చేయాలనుకుంటున్నాను"

తండ్రి ముఖంలో ఆవేశానికి సంకేతంలా వున్న ఎరుపురంగుని, అరుణిమదాల్చిన ఆయన కళ్ళలోని తీవ్రతని చూసి కొంచెం జంకినా శారద నిర్భయంగా చెప్పింది.

"ఉద్యోగం చెయ్యి. పెళ్ళి చేసుకోకు. నేను చచ్చేదాకా పెళ్లి చేసుకోకు" ఆయన ఉద్రేకంతో వూగిపోతున్నాడు.

జానకి గభాల్న వచ్చి ఆయన్ని పట్టుకుంది.

"నువ్వుండు" ఆయన భార్యని విదిలించాడు. "నన్ను తలెత్తుకోకుండా చేస్తోంది. భగవంతుడా! నాకు చావు రాదేం? "

"అలా మాట్లాడకండీ!" జానకి గాద్గదికంగా అంది.

"నేను వాళ్ళ ముందు ఎలా తల ఎత్తుకోగలను జానకీ" దీనంగా అన్నాడాయన.

"మీరు ఆవేశపడకండి. స్థిమితంగా ఆలోచిద్దాం" ఆమె ఆయన్ని అవతలి గదిలోకి తీసికెళ్ళింది.

శారద కన్నీళ్లతో తండ్రిని చూస్తోంది. ఇంత ప్రతిఘటనతో ఉద్యోగం సంపాదించుకుని తనేం సాధించగలదు? అనే విరక్తి ఒకవైపు, తన లక్ష్యం మరొకవైపు ఆమె మనసుని నలిబిలి చేస్తున్నాయి.

ఆరాత్రి ఆ ఇంట్లో ఎవరూ భోజనం చెయ్యలేదు. భర్త నిద్రపోయాడని నిర్ధారణ చేసుకున్నాక జానకి వచ్చి కూతుర్ని లేపింది. నిజానికి శారద నిద్రపోలేదు. ఆమె లేచి తల్లి వెనుకనే పెరట్లోకి వచ్చింది.

"మీ నాన్నగారు చాలా బాధ పడుతున్నారు శారదా!"

ఉపోద్ఘాతంగా అంది "అయినా పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేనప్పుడు సంబంధం స్థిరపరచుకుంటూంటే ఎందుకు మౌనం వహించినట్టు? "

"అబ్బాయి ఎలా వున్నాడని అడిగారే తప్ప ఈ సంబంధం స్థిరపరుస్తున్నారని నాతో మాటమాత్రంగానైనా చెప్పారా? "

"పోనీ ఆ విషయం వదిలెయ్యి. ఆ

అబ్బాయి అందగాడు. ఈ సంబంధంలో వంకపెట్టడానికి ఏముంది? పెళ్ళయ్యాక నువ్వు ఉద్యోగం చేస్తానంటే అతను కాదంటాడా?"

"అతనికి నేను ఉద్యోగం చెయ్యడం ఇష్టం లేదమ్మా!"

"నీకెలా తెలుసు?" జానకి భ్రుకుటి ముడిపడింది.

"నేను అతనికి ఉత్తరం రాశాను. దానికతను జవాబివ్వలేదు. నా ఆర్థిక స్వతంత్రతని గౌరవించని మనిషిని నేనెలా పెళ్లిచేసుకోగలను?"

"అదా నీ సమస్య?" తేలిగ్గా అంది. "అతను మొహమాటపడి నీకు ఉత్తరం రాసి వుండడేమో? అయినా, అతని మౌనాన్ని అర్ధాంగీకారంగా భావించవచ్చుగా?"

"అర్ధాంగీకారమే కాని పూర్తి అంగీకారం కాదు కదా!"

శారద వాదనతో అప్రతిభురాలయిందామె.

"ఇంతకీ ఏమిటీ, నువ్వనేది? మీ నాన్నగారి గౌరవంకంటే నీ పట్టుదలే ముఖ్యమంటావా?" ఎంతో సహనవతి అయిన జానకి కూడా ఆ క్షణంలో కోపాన్ని కంట్రోల్ చేసుకోలేకపోయింది.

"నా ఆత్మగౌరవం ముఖ్యం!" శారద స్థిరంగా అంది.

ఇంక తనేం చెప్పినా, కూతురి నిర్ణయం మారదని జానకికి అర్థమయిపోయింది. ఆమె తీవ్రంగా ఒకసారి కూతురిని చూసి వెళ్ళిపోయింది.

★ ★ ★

రెండు రోజులు నిశ్శబ్దంగా వున్న ఆ ఇంట్లో మౌన చిత్రాల్లా గడిపారు ఆ ముగ్గురూ. మూడవ రోజు నిశ్శబ్దం బద్దలయింది. ఆఫీసులో పనిచేస్తుండగా సాంబశివరావుకి గుండెనెప్పి వచ్చిందనే వార్త విని జానకి గుండె బద్దలయింది.

హాస్పిటల్ బెడ్‌పై మగతగా పడుకుని వున్న తండ్రిని చూసి శారద కన్నీరు ఆపుకోలేకపోయింది. జానకి పరిస్థితి కూడా ఏమంత మెరుగ్గా లేదు. కూతురి పెళ్ళి సమస్యే ఆయన్ని ఈ స్థితికి తీసుకువచ్చిందని ఆమెకి తెలుసు. భర్త మామూలు మనిషి అవుతాడా అన్నదే ఆమె భయం!

ఆ మధ్యాహ్నం తల్లికి భోజనం తండ్రికి హార్లిక్స్ తీసుకుని హాస్పిటల్‌కి వచ్చిన శారద గాద్గదికంగా విన్పిస్తున్న తండ్రి స్వరం విని గుమ్మంలోనే ఆగిపోయింది.

"శారదకి ఉద్యోగం చెయ్యాలనే బుద్ధి ఎందుకు పుట్టిందో, అలాగే కానియ్యి. నేను మరణిస్తే నువ్వు, పిల్లలు వీధిన పడకుండా..."

"ఏమండీ!" విహ్వలంగా వుంది తల్లి స్వరం.

"అలా మాట్లాడకండి. నేను భరించలేను"

శారద రెండడుగులు వెనక్కివేసి పక్కకి తప్పుకుంది. తండ్రి మరణిస్తాడా? ఆ ఊహకే ఆమెకి దుఃఖం పొంగివచ్చింది. ఎప్పుడూ చిర్రున చీది ఎరగని తండ్రి అసహాయంగా హాస్పిటల్‌లో వుండడం చూస్తే ఆమెకి కన్నీరు ఆగడంలేదు.

ఆయన అనారోగ్యం సహజమైనదా లేక తన పెళ్ళి సమస్య కలిగించిన ఆందోళన వలన వచ్చినదా అన్నది వేరే విషయం. ప్రస్తుత పరిస్థితిలో కేవలం తన డిగ్రీ చూసి ఎవరూ ఉద్యోగం ఇవ్వరు.

ఈ పరిస్థితులలో నిశ్చయమైన పెళ్ళి సంబంధాన్ని కాదనుకుని తండ్రికి భారమవడం న్యాయమేనా? తండ్రి అనారోగ్యం కేవలం శారీరకమైనదే కాదు. మానసికంగా కూడా ఆయన కృంగిపోయాడు.

కాని శారద మనసు తన లక్ష్యాన్ని మరిచి తొందరపడి పెళ్ళి చేసుకోవద్దంటోంది.

కుటుంబ పరిస్థితులు, తండ్రి అనారోగ్యం

ఆమెని పెళ్ళికి అంగీకరించి తండ్రికి మన శ్శాంతిని కలిగించమంటున్నాయి.

శారద కళ్ళు తుడుచుకుని గదిలో అడుగు పెట్టే సరికి నిస్త్రాణగా పడుకుని వున్న తండ్రి, కన్నీళ్ళొత్తుకుంటున్న తల్లి కనిపించారు. ఆమె హృదయం ద్రవించింది. ఎప్పుడూ మేరు పర్వతంలా నిబ్బరంగా వుండే తల్లిని ఆ స్థితిలో చూసేప్పటికి.

"అన్నం తినమ్మా! నాన్నగారి దగ్గర నేను కూర్చుంటాను"

జానకి సమాధానం ఇవ్వలేదు. ఒక్క చూపు చూసింది. ఆ చూపులో లక్ష అర్థాలు చదవగలిగింది శారద.

"చూసావా, మీ నాన్న పరిస్థితికి నువ్వే కారణం" అన్నట్టు తీవ్రంగా వుందా చూపు.

శారద తల వంచుకుంది.

మరో పన్నెండు గంటల అంతర్మధనం తర్వాత ఆమె తను పెళ్ళిచేసుకుంటానని తండ్రితో చెప్పింది.

శారద పెళ్ళికి అంగీకరించిన నాలుగు గంటల తర్వాత డాక్టరు సాంబశివరావు టెస్ట్ రిపోర్ట్సు చూసి, రిపోర్టులన్నీ నార్మల్‌గానే వున్నాయని. ఆయనకి వచ్చినది హార్ట్ ఎటాక్ కాదని, కేవలం పని వత్తిడివలన వచ్చిన కండరం నెప్పి అని చెప్పారు.

జానకి మంగళసూత్రం తీసి కళ్ళకద్దుకుని సంతోషంగా అంది.

"భగవంతుడు నా పట్ల వున్నాడు. మీ నాన్నగారికి గండం తప్పింది!" ఆమె మాటలలోని నిశ్చింత వెనుక శారద పెళ్ళికి అంగీకరించిందనే తృప్తి కూడా ప్రస్ఫుటమయింది.

శారద పెదవులపై విషాదపూరితమైన నవ్వు కదలాడింది.

★ ★ ★

సునీత తల్లి దగ్గరకి వచ్చి అడిగింది.

"పది రూపాయలివ్వమ్మా! సినిమాకి వెళ్తాను"

"నాదగ్గరలేవు. అయినా ఈ నెలలో రెండు సినిమాలు చూశావు. ఎప్పుడూ సినిమాలు చూసేకంటే ఏదైనా చదువుకోకూడదూ?"

"ఇంకేం చదువు... పరీక్ష ప్యాసయ్యానుగా?" ప్రపంచంలోని విజ్ఞానాన్నంతటినీ పుక్కిట పట్టినంత ధీమాగా అంది సునీత. "ఖాళీగా వుండి బోర్‌గా వుందమ్మా!"

కూతురినే చూస్తున్న రాజ్యలక్ష్మికి అప్పటికప్పుడు ఒక ఆలోచన వచ్చింది.

ఆ సాయంకాలం ఆవిడ బయటకి వెళ్తూ చెప్పింది.

"ఒక గంటలో వచ్చేస్తాను. మీనాన్నగారు వస్తే కాఫీ ఇవ్వు!"

"అలాగే లే!"

రాజ్యలక్ష్మి ఇంటికి తిరిగివచ్చేసరికి రామారావు ఇంటికి వచ్చి వున్నాడు.

"ఎక్కడికివెళ్ళావ్ ఇంతసేపు?" అనడిగేడు.

"ఇందిరాదేవిగారి దగ్గరకి"

"ఏ ఇందిరాదేవి?"

"బెస్ట్ కాన్వెంటు హెడ్ మిస్ట్రెస్‌గారి దగ్గరకి"

"ఆవిడతో నీకేం పని?"

"పనంటే... మరేం లేదు. మన సునీతకి ఏదైనా ఉద్యోగం ఇస్తారేమోనని అడగడానికి వెళ్ళాను"

"అన్ ట్రెయిన్డ్ టీచర్స్‌ని వాళ్ళు తీసుకోరేమో!"

"తీసుకుంటారుట. ఎల్.కె.జి. క్లాసులకి చెప్పడానికి ఫర్వాలేదు అన్నారు"

"వాళ్ళ మొహం! జీతమేం ఇస్తారు?"

భర్తనుంచి అభ్యంతరం లేకపోయేసరికి రాజ్యలక్ష్మికి ఉత్సాహం వచ్చింది.

"ఎంతో కొంత ఇస్తారు. దానికీ కాలక్షేపం! దాని ఖర్చులకోసం మిమ్మల్ని అడగక్కర్లేదు" అంది.

సునీత ఉద్యోగం చెయ్యడానికి ఆయన అభ్యంతర పెడతాడేమోనని భయపడింది. కానీ, ఆ అభ్యంతరం సునీతనుంచే ఎదుర





యింది.

"టీచర్ ఉద్యోగమా? నేను చెయ్యను" అంది.

"నిన్ను ఈ ఉద్యోగం పర్మినెంటుగా చెయ్యమనడం లేదు సునీతా" నచ్చచెప్పే ధోరణిలో అంది. "పొద్దుట 9 నుంచి సాయంకాలం 3 గంటలవరకు స్కూలు. తరువాత ఇంటికి వచ్చి ఏ బ్యాంకు పరీక్షలకో ప్రిపేరవు. ఈలోగా ఏదైనా మంచి ఉద్యోగం వస్తే ఈ ఉద్యోగం వదిలెయ్యి. నెలకి మూడు వందలు జీతం. ఏదో నీ ఖర్చులకోసం మీ నాన్నగారిని డబ్బు అడగక్కర్లేకుండా గడచిపోతుందిగా?"

"అయినాసరే పంతులమ్మ ఉద్యోగం ఏమిటి అసహ్యంగా? ముష్టి మూడువందల కోసం పగలంతా గొంతు జీరబోయేలా అరిచి... ఛీ...ఛీ! నేను చెయ్యను"

"చెప్తే అర్థం చేసుకోవేం?" రాజ్యలక్ష్మి కోపంగా చూసింది. "పంతులమ్మ ఉద్యోగం అంత చులకనగా ఉందా?"

"నాకేం చెప్పకు. నేను చెయ్యను"

"మరేం చేస్తావ్? అడ్డమైన చెత్త పుస్తకాలు చదువుతూ, సినిమాలు చూస్తూ నిరర్థకంగా రోజులు గడిపేస్తావా? రేపు పెళ్ళయ్యాక నీ ఖర్చులకోసం ప్రతి రూపాయి నీ మొగుడి దగ్గర దేవిరిస్తూ హీనంగా బ్రతుకుతావా?"

"నువ్వు నాన్న దగ్గర దేవిరించే బ్రతకడం లేదుగా?" నిర్లక్ష్యంగా చూస్తూ సునీత అన్న మాటలు ఆమె గుండెల్లో గునపంలా గుచ్చుకున్నాయి. కూతురి మాటలలోని వ్యంగ్యం ఆమె మనసుని ఛిద్రం చేసింది.

"అవునే! నేను మీ నాన్నని యాచించి బ్రతకడం లేదు. నా ఇంట్లో నేను దొంగలా బ్రతుకుతున్నాను. ముందు నా కోసం! ఇప్పుడు మీ కోసం! నువ్వు నాలాగ బ్రతకకూడదనే, నీ కాళ్ళమీద నువ్వు నిలబడగలగాలనే నేను నిన్ను ఉద్యోగం చెయ్యమంటున్నది. అంతేకాని, సంపాదించి నా ఒళ్లో పోస్తావని కాదు" ఆవిడ ఏడుస్తూ అవతలకి వెళ్ళిపోయింది.

సునీతని తల్లి ఏడుపు కరిగించలేదు. ఆవిడ హితోక్తులు ఆమె మనసుకి పట్టలేదు. తను గొప్పగా బ్రతకాలని కాదు. గొప్పగా బ్రతుకుతున్నానని లోకం అనుకోవాలని వాంఛించే సునీతకి మూడు వందల రూపాయల కోసం టీచర్‌గా పనిచెయ్యాలనే ఊహే కంపరంగా వుంది.



రామారావు ఆఫీసుకి వెళ్ళాడు. సునీత తండ్రి అటు ఆఫీసుకి వెళ్లగానే చక్కగా సింగారించుకుని తనూ బయలుదేరింది.

"ఎక్కడికి సునీతా?" రాజ్యలక్ష్మి అడిగింది.

"సారథిగారింటికి. కేబుల్ టి.వి.లో సినిమా చూడడానికి!"

రాజ్యలక్ష్మి నోరుతెరిచి ఏదో చెప్పేలోగానే సునీత ఇంటి మెట్లు దిగేసింది. అలా వెళ్తున్న కూతుర్ని చూస్తూ వ్యధగా నిట్టూర్చింది ఆవిడ. సునీత జీవితానికో గమ్యం లేదు. తన జీవితాన్ని ఉదాహరణగా తీసుకుని, ఆమె బ్రతుకుని చక్కదిద్దుకోవాలనే తపన లేదు.

ఆరోజే కాదు ప్రతిరోజూ సారథిగారింటికి సినిమా చూడ్డానికి వెళ్తూనే వుంది.

పక్కింటి అరుంధతికి బియ్యం, కంది పప్పు ఇచ్చి నోట్లు లెక్కపెట్టుకుంటున్న

రాజ్యలక్ష్మి ఆవిడ ఏదో చెప్పబోయి తటప టాయించడం చూసి అంది.

"ఏమిటండీ? "

"మరేం అనుకోకండి వదినగారూ! ఏదో నోరు వూరుకోక చెబుతున్నాను. మీ సునీ తని సారధిగారింటికి అస్తమానూ వెళ్లవద్దని చెప్పండి. సారధిగారి భార్య నాతో ఏమందో తెలుసా? ఇలా టి.వి. ఆన్ చేసేప్పటికి ఆ పిల్ల తయారవుతుంది. మధ్యాహ్నం మా ఆయన ఇంటికి వచ్చినా కదలదు. సిగ్గులే కుండా సోఫాలో చేరగిలబడి కూర్చుని స్వంత ఇంట్లోకి మల్లే టి.వి. చూస్తుంది అని"

రాజ్యలక్ష్మి ముఖం ఎర్రబడిపోయింది. అతిప్రయత్నంమీద తన ముఖంలో మారు తున్న రంగులు ఆవిడ కంట పడనివ్వ కుండా జాగ్రత్తపడుతూ అంది.

"పరీక్షలయిపోయాయికదూ? ఏమీ తోచడం లేదంటే నేనే వెళ్ళమన్నాను. అయినా రోజూ సినిమా చూడ్డమే దానిపనా ఏమిటి? బ్యాంకు పరీక్షలకి చదువుకుం టోంది."

"అదే మంచిదిలెండి. బ్యాంకు ఉద్యోగం అంటే మాటలు కాదు" అంది అరుంధతి.

"ఎమ్.ఏ. చదువుతానంది. ఆడపిల్ల ఎంత చదివినా, ఒక అయ్యచేతిలో పెట్టవ లసిందేకదా అని వద్దన్నాను"

"నిజమేలెండి. నేను వస్తాను"

ఆమె వెళ్ళాక రాజ్యలక్ష్మి పళ్లు కొరు క్కుంది.

"వెధవ పీనుగు! దీని సినిమాపిచ్చి పాడు గాను! నన్ను తలెత్తుకోకుండా చేస్తోంది" కసిగా తిట్టుకుంది.

సునీత ఇంటికి రాగానే ఆవిడ మెత్తమె త్తగా మందలించింది.

"అలా వాళ్ళింటికి రోజూ సినిమా చూడ్డా నికి వెళ్ళవచ్చా? వాళ్లేమనుకుంటారు? "

"ఇందులో అనుకోడానికి ఏముంది? వాళ్లు ప్రత్యేకంగా నా కోసం టి.వి. పెడు తున్నారా? వాళ్లు సినిమా చూస్తున్నారు. వాళ్ళతోబాటు నేనూ చూస్తున్నాను"

"అదికాదే! ఆ సారధిగారు ఇంటికి రాగానే నువ్వు ఇంటికి వచ్చెయ్యవలసింది!"

"ఏం? ఆ సారధిగారితో కలిసి నా గురించి నీకెవరైనా నీచంగా చెప్పారా? "

సునీత అలా మాట్లాడగలదని ఊహిం చని రాజ్యలక్ష్మి నిశ్చేష్టురాలయింది. తేరు కుని కోపంగా అరిచింది.

"ఏమిటామాటలు? "

సునీత తల్లి ఆగ్రహానికి ఏమాత్రం చలిం చలేదు. నిర్లక్ష్యంగా తల తిప్పుకుంది.

"అలా ఇంకొకళ్ళ ఇంటికి వెళ్ళి రోజూ సినిమా చూడడమేమిటి? "

"అయితే వారానికో సినిమాకి నువ్వే పంపించు"

"సినిమాలు చూస్తూ ఇలా వ్యర్థంగా కాలం గడపడం నీకు బాగుందా? ఉద్యోగం చేసి నీకంటూ కొంత డబ్బు మిగుల్చుకో వడం నామోషీకదూ? "

"ముష్టి మూడువందల కోసం పంతు లమ్మ ఉద్యోగం చెయ్యడానికి ఒప్పుకోలేదనే కదూ నీ మంట? "

"పోనీ, బ్యాంకు పరీక్షలకైనా ప్రిపేరవు"

"అమ్మా! నీకు మళ్ళీ మళ్ళీ చెబుతు న్నాను. నాకు ఏ ఉద్యోగమూ చెయ్యాలని లేదు. ఎలాంటి బాదరబందీలు లేకుండా హాయిగా ఎంజాయ్ చెయ్యాలని వుంది"

మొండిగా మాట్లాడుతున్న కూతుర్ని చూస్తే చెంప ఛెళ్లుమనిపించాలనే ఆగ్రహం కలిగింది రాజ్యలక్ష్మికి.

"ఇదంతా మీ నాన్నగారికి తెలిస్తే ఏం జరుగుతుందో తెలుసా? "

"ఎలా తెలుస్తుంది? చెప్తే నువ్వే చెప్పాలి" సునీత స్వరంలో 'నన్ను నువ్వేమీ చెయ్యలేవులే' అనే ఎగతాళి, 'నువ్వు నాన్నగా రికి నా గురించి చెప్తే నేను నీ రహస్యా లను బట్టబయలు చేస్తాననే బెదిరింపు' ధ్వనిస్తుంటే అసహాయంగా చూసింది రాజ్యా





లక్ష్మి.

దొంగకి తేలు కుట్టినట్టుగా వుంది ఆవిడ పరిస్థితి.

★ ★ ★

కొత్త కుండలో నీళ్లు తియ్యగా వుంటాయి. కొత్త కాపురం తియ్యగా వుంటుంది. కొత్త కాపురంలో భార్యాభర్తల మధ్య సరిగమలు వుంటాయి. సంసారం సంగీతమే. కాని నూటికి తొంభై సంసారాలలో ఆ సంగీతంలో అపశృతులు ధ్వనిస్తుంటాయి. ఆ అపశృతి మొదలవడానికి కొందరికి ఆరునెలలు పడితే మరికొందరికి ఇంకా స్వల్ప వ్యవధిలోనే ఆ అపశృతి ధ్వనించవచ్చు

పెళ్ళి, హనీమూన్, ఆషాఢమాసం కారణంగా నెలరోజులు పుట్టింట్లో వుండడం వీటిమధ్య ఆనంద్ వ్యక్తిత్వం ఎలాంటిదో అంచనా కట్టే అవకాశం శారదకి లభించలేదు.

కొత్త కాపురం, కొత్త పరిసరాలు కొత్త వాతావరణానికి ఇప్పుడిప్పుడే అలవాటు పడుతోంది శారద.

ఉదయం పదిన్నరయింది. ఆనంద్ బ్యాంక్‌కి వెళ్ళిపోయాడు. శారద బట్టలు ఉతుక్కుంటోంది. ఇంతలో తలుపు తట్టిన శబ్దమయింది. శారద చేస్తున్న పని వదిలి వచ్చి తలుపు తీసింది.

ఎదురుగా గ్యాస్ సిలెండర్‌తో మనిషి. శారదకి చప్పున గుర్తు వచ్చింది. ఆనంద్ ఇంట్లోకి కావలసిన సరుకులు తెస్తున్నాడు తప్ప తనకి ఇంటి ఖర్చులకి డబ్బు ఇవ్వని విషయం.

ఇప్పుడు గ్యాస్ సిలెండర్‌కి డబ్బు ఇవ్వాలి ఎలా? శారద లోపలకి వెళ్ళి అలమరలన్నీ వెదికింది. చిల్లర డబ్బులు అన్నీ కలిపి పోగేస్తే రెండు రూపాయలు కూడా లేదు. ఆమె కొద్దిక్షణాలు ఆలోచించి "రేపు తీసుకురా. వారు ఇంట్లో లేరు" అంది.

"రేపు సార్‌ని గ్యాస్ ఏజెన్సీకి వచ్చి తీసుకోమనండి" చెప్పి వెళ్ళిపోయాడతను.

శారద అలాగే నిలబడిపోయింది. తను కాపురానికి వచ్చి నెలరోజులయింది. ఈ నెలరోజులలోను ఆనంద్ తన స్వంత ఖర్చులకోసం డబ్బెందుకు ఇవ్వలేదు? మరచిపోయి వుంటాడా? లేక రాధ తండ్రిలాంటి వాడేనా ఇతను కూడా? " ఆ ఆలోచనకే నిలువెల్లా వణికింది.

ఆ సాయంకాలం ఆనంద్ వచ్చేప్పటికి శారద చిరునవ్వుతో స్వాగతం చెప్పింది.

మాటల మధ్య అంది. "గ్యాస్ సిలెండర్ వచ్చింది. మీరు డబ్బు ఇవ్వడం మరచిపోయారు"

"మరేం చేశావ్? " ఆత్రంగా అడిగేడతను. "ఏం చేస్తాను? వెనక్కి పంపేశాను. రేపు వచ్చి సిలెండర్ తీసుకోమన్నాడు"

"సర్లే? " అన్నాడతను. అప్పుడయినా ఇంటి ఖర్చులకోసం, తన స్వంత ఖర్చులకోసం డబ్బు ఇస్తాడని ఎదురుచూసిన శారదకి నిరాశే మిగిలింది.

ఆనంద్ తత్వమేమిటో బోధపడడం లేదామెకి. ప్రతి చిన్న అవసరానికి అతడిని డబ్బు అడగవలసివస్తోందామెకి. తల్లికో, తండ్రికో ఉత్తరం వ్రాయాలంటే ఒక కవరు కొనుక్కోవాలన్నా చివరికి తిలకంసీసా అయిపోయినా అతన్ని డబ్బు అడగడం చాలా చిన్నతనంగా, సిగ్గుగా వుంది శారదకి.

చదువుకునే రోజులలో తను తన స్నేహితులు రాధ, సునీతలతో గర్వంగా చెప్పిన మాటలు గుర్తువచ్చాయి.

"ఉద్యోగం చేసి నా అవసరాలకి కొంత డబ్బు దాచుకుంటే తప్ప పెళ్లి చేసుకోను. ప్రతి రూపాయికోసం భర్తని దేవిరించను"

ప్రతి విషయంలో నిర్ణయానికి కట్టుబడి వుండేతను ఒక గమ్యాన్ని, లక్ష్యాన్ని నిర్దేశించుకుని, ఆ లక్ష్యాన్ని సాధించేవరకు అహోరాత్రాలు శ్రమించే తను పెళ్లి విషయంలో

తను అనుకున్నది సాధించలేకపోయింది.

తను ఉద్యోగం చెయ్యడం తండ్రికి ఇష్టం లేదు. కారణం వయసు దాటిపోతే పెళ్లి అవడం కష్టం కాబట్టి. పెళ్ళి చేసుకోకుండా జీవితాంతం కన్యగా వుండిపోగలిగే ధైర్యం తనలో లేదు.

తమ్ముళ్ల చదువులు, చెల్లెలి చదువు, పెళ్లి, అన్నింటినీ మించి తండ్రి అనారోగ్యం- ఇవన్నీ దృష్టిలో వుంచుకుని కన్నవాళ్లకి భారం కాకూడదని పెళ్ళికి సిద్ధపడింది"

శారద భారంగా నిట్టూర్చింది.

ఆ రాత్రి ఆమె భర్తతో చెప్పింది.

"నేను ఉద్యోగం చెయ్యాలనుకుంటు న్నాను"

"ఉద్యోగమా? " ఆనంద్ నవ్వాడు.

"నేను తమాషాకి అనడంలేదు. నిజం గానే ఉద్యోగం చేస్తాను"

"నీకు ఉద్యోగమెందుకు? నేను సంపాదిం చేది మన ఇద్దరికీ సరిపోదా? "

శారద నిదానంగా చెప్పింది. "నేను ఉద్యోగం చెయ్యాలనే నిర్ణయం ఈనాటిది కాదు. నా చదువు పూర్తయిన వెంటనే అను కున్నాను. కాని, పెళ్ళి విషయంలో మావాళ్లు నాపై ఒత్తిడి తెచ్చారు. నాకో కల వుండేది. చాలా అందమైన కల..." ఆమె గొంతు వణికింది. "ఎంత చిన్న ఉద్యోగ మైనా సంపాదించుకుని, నాది అనే డబ్బు సంపాదించుకోవాలని, నా అవసరాలకి భర్తపై ఆధారపడకూడదనే నా కల నిజం కాలేదు"

ఆనంద్ మళ్ళీ నవ్వేడు.

"అంటే, ఇప్పుడు నీ అవసరాలకి నాపై ఆధారపడడం నీకు నామోషీగా వుందన్న మాట" అతని స్వరం ఎగతాళిగా ధ్వనిం చింది.

"మీరెలా అనుకున్నా ఫర్వాలేదు. నా అభిప్రాయం చెప్పాను".

"ఓహో! నీ అవసరాలు అంటే చీరలు, నగలు అవేగా? లేకపోతే నేను పెట్టే తిండి తినడం కూడా చిన్నతనమేనా? "

శారద నవ్వడానికి ప్రయత్నిస్తూ అంది.

"మీకు కోపం వచ్చినట్టుంది? "

"లేదు. చాలా ఆనందంగా వుంది. నువ్వు కొత్త సిద్ధాంతాలని, సూత్రాలని చెబుతుంటే! బహుశా ఏ భార్యా భర్తకి ఇలాంటివి చెప్పి వుండదేమో! చెప్పు. వింటాను. ఇంకేమైనా వున్నాయా? "

"ఆడవాళ్ళకి చీరలు, నగలు తప్ప ఇంకేమీ అవసరాలుండవా? మన పెళ్ళయి మూడు నెలలు దాటింది. ఈ మూడు నెలల కాలంలో నాకు డబ్బుతో చాలా అవ సరం వచ్చింది. కాని, డబ్బు చేతిలో లేక చాలా మానుకున్నాను"

"నీకు ఏమైనా కావాలంటే నన్ను అడగవ చ్చునుగా? ఇంట్లో బియ్యం అయిపోతే చెబుతావుగా? అలాగే నీకేం కావాలన్నా నన్ను అడగవచ్చుగా? ఇందులో సిగ్గుపడవ లసిందేముంది? "

"నాకు సంబంధించినంతవరకు నా ఖర్చు లన్నీ మీ దృష్టిలో అనవసరమైనవి. ఉదా హరణకి నేను ఒక అనాథకిచ్చే అయిదు రూపాయలు మీ దృష్టిలో అనవసరపు ఖర్చు"

ఆనంద్ ముఖం ఎర్రబడింది.

"ఎప్పుడో ఒకసారి నువ్వడిగిన ఆ అయిదు రూపాయలు నేను ఇవ్వనందుకన్న మాట ఇదంతా"

"అంతే కాదు. నా ఖర్చులకోసం ప్రతి పైసా మిమ్మల్ని దేవిరించడం నాకసహ్యం. ఒకటికి రెండుసార్లు అడిగితేకాని మీరు డబ్బు ఇవ్వరు నాకు. అది మరీ అస హ్యంగా, చిన్నతనంగా వుంది నాకు"

"అంత మొగుడిపై ఆధారపడడం చిన్న తనం అయినప్పుడు పెళ్ళెందుకు చేసుకు న్నావ్? " తీవ్రంగా వుంది ఆనంద్ స్వరం. అతని ముఖం జేవురించి, కళ్లు నిప్పుకణి కల్లా వున్నాయి. అతని కెందుకంత కోపం





వచ్చిందో శారదకి అర్థం కాలేదు.

"నాకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. అవి ఇవాళ ఏర్పడినవి కావు. చిన్నతనంనుంచి నాలో వయసుతోబాటు పెరుగుతూ వచ్చినవి. నేను మీ అభిప్రాయాలను గౌరవిస్తూ మీ ఇష్టాన్ని మన్నిస్తున్నప్పుడు మీరూ నా అభిప్రాయాలను గౌరవించడం ధర్మం"

"నీ ఖర్చులకి నన్ను డబ్బు అడగడం నీకు ఇష్టం లేకపోతే మీ నాన్నని అడిగి తెచ్చుకో"

"మా నాన్నగారిని అడగడం కూడా ఇష్టం లేదు. అందుకే ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నాను"

ఆనంద్ ముఖం మరింత ఎర్రబడింది. ఆ క్షణంలో అతని ముఖం చూస్తే తనపై చెయ్యి చేసుకుంటాడేమో అన్పించింది శారదకి. అయినా ఆమె జంకలేదు. అతను ఆమెవైపు మాడ్చేసేలా చూసి అవతలకి వెళ్ళాడు.

అతనికి బాగా కోపం వచ్చిందని గ్రహించింది శారద. అతను ఆ కోపాన్ని ఆమెతో మాట్లాడకుండా మౌనవ్రతంతో ప్రకటించాడు. శారదకి అతని మౌనం బాధగా వున్నా తన లక్ష్యం, నెరవేరేవరకూ తనూ బింకంగానే వుండదలచుకుంది.

మూడవరోజు ఉదయం హఠాత్తుగా వచ్చిన తల్లిని, తండ్రిని చూసి ఆశ్చర్యపడినా తరువాత ఆనందంగా ఆహ్వానించింది.

ఆ ఇద్దరి చూపులలో కూతుర్ని చూసిన ఆనందంకంటే ఏదో ఆరాటం కన్పిస్తుంటే వాళ్ళ రాకలోని ఆంతర్యమేమిటో శారద ఊహించింది.

ఆనంద్ బ్యాంక్‌కి వెళ్ళాడు. శారద వంట గదిలో ఏదో సర్దుతుంటే, జానకి వచ్చి పిలిచింది.

"మీ నాన్నగారు పిలుస్తున్నారు. ఆ పని నేను చూస్తానుకాని, వెళ్ళు" శారద యుద్ధానికి సమాయత్తమవుతున్న సైనికునిలా ముందు గదిలోకి వెళ్ళింది. ఎదురుగా కూర్చున్న తండ్రి యుద్ధభూమిలో శత్రుబలాన్ని అంచనా కడుతున్న సేనాధిపతిలా తననే తేరిపారి చూడడం గమనించి శారదకి నవ్వొచ్చింది.

"ఆనంద్ మమ్మల్నిద్దరినీ రమ్మని నాకు ఉత్తరం వ్రాశాడు" ఉపోద్ఘాతంగా అన్నాడు సాంబశివరావు.

" తెలుసు నాన్నగారూ!"

"ఎలా తెలుసు? నీకు చెప్పాడా? "

"లేదు. ఊహించాను"

"అయినా నీకిప్పుడేం లోటని నువ్వు ఉద్యోగం చెయ్యడం? అతని జీతంతో మీరిద్దరూ బతకలేరా? "

"బ్రతకడానికి, జీవించడానికి తేడా వుంది నాన్నగారూ! అసంతృప్తితో నిస్సారంగా జీవితం గడపడాన్ని బ్రతకడం అంటారు. తృప్తి, ఆనందంతో ప్రతిక్షణం సార్థకం చేసుకోవడాన్ని జీవించడం అంటారు"

"ఓహో! ఇప్పుడు నువ్వు అసంతృప్తితో బ్రతుకుతున్నానంటావ్? "

"నిజమే!"

"దేనికి అసంతృప్తి? నీ భర్త సంపాదనపై ఆధారపడడం నీకు అసహ్యమా? అతన్ని డబ్బు అడగడం అవమానమా? "

"అతను భార్యకి కూడా అవసరాలు వుంటాయి. అందుకుగాను ఆమెకి కొంత డబ్బు ఇవ్వాలనే సహృదయుడు కాడు"

"అతను ఇవ్వకపోతే నువ్వడిగి పుచ్చుకో"

"అడగను. అలా అడగడమే నాకసహ్యం! అందుకే నా ఖర్చులకు నేను సంపాదించుకోవాలనుకుంటున్నాను"

"నువ్వు ఉద్యోగం చెయ్యడం ఆనంద్‌కిష్టం లేదు"

"నాతో కూడా చెప్పారు ఆ విషయాన్ని. కానీ నేను ఉద్యోగం చేస్తానంటున్నది లగ్జరీస్ కోసమో, సోషల్ స్టేటస్ కోసమో కాదు నాన్నగారూ! కేవలం నా అవసరాలకి అత

నిపై ఆధారపడకుండా వుండడం కోసం. ఇలాంటి సమస్య ఎదురవుతుందని నాకు తెలుసు. అందుకే మా పెళ్ళి నిశ్చయం కావడానికి ముందే అతనికి ఉత్తరం వ్రాశాను. నేను ఉద్యోగం చెయ్యడం అతనికిష్టమైతేనే మా పెళ్ళి జరుగుతుందని. బహుశా ఆ ఉత్తరం అతనికి అందివుండదేమో. అతను నా ఉత్తరానికి జవాబు వ్రాయలేదు"

సాంబశివరావు ముడివడిన భ్రుకుటితో చూస్తూ అడిగేడు. "ఇంతకీ నువ్వనేదేమిటి? "

"నేను ఉద్యోగం చేస్తాను"

ఒళ్లు తెలియని కోపంతో ఆయన గొంతు పెంచాడు. కూతురి తెలివితక్కువతనాన్ని, భర్తకిష్టంలేని పనిచెయ్యబోతున్న ఆమె మొండితనాన్ని నిందించాడు.

శారద పెదవి విప్పలేదు. మౌనంగా వింది. అంతమంది తన నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నా ఆమెలో పట్టుదల పెరిగింది. జానకి లోపలనుంచి గాభరాగా వచ్చి భర్తని వారించింది. "శారదకి నేను నచ్చచెబుతాను. మీరు ఆవేశపడకండి" అంది. సాంబశివరావు కూతుర్ని మింగేసేలా చూస్తూ లోపలకి వెళ్ళాడు.

"ఆనంద్‌కిష్టంలేని పని ఎలా చేస్తావు శారదా? సంసారంలో భార్యాభర్తల మధ్య పరస్పర అవగాహన, సహకారం వుండాలి. నువ్వు ఉద్యోగం చెయ్యడానికి నీ భర్త సహకారంకంటే ముందు అంగీకారం అవసరం. అతనికి నువ్వు ఉద్యోగం చెయ్యడం సుతరామూ ఇష్టం లేదని తన మాట నువ్వు వినడంలేదని మమ్మల్ని వచ్చి నచ్చచెప్పమని ఉత్తరం వ్రాశాడు. మా పెద్దరికాన్ని మన్నించి, నీ నిర్ణయాన్ని మార్చుకో"

"ఎందుకమ్మా? మీరందరూ నేనేదో కాని పని చేస్తున్నట్టు బాధపడుతున్నారు? నేను ఉద్యోగం చెయ్యడం తప్పా? నన్ను ఉద్యోగం చెయ్యవద్దంటున్న నాన్నగారు నిన్నెలా ఉద్యోగం చెయ్యనిస్తున్నారు"

"మన కుటుంబ పరిస్థితి దృష్ట్యా నేను ఉద్యోగం చెయ్యడం తప్పనిసరి శారదా! అప్పట్లో మీ నాన్నగారికి జీతం తక్కువ. కుటుంబ భారమంతా తనొక్కరే మొయ్యలేక నన్ను ఉద్యోగం చెయ్యమన్నారు. ఇటు కుటుంబ బాధ్యత, అటు ఉద్యోగ నిర్వహణతో అలసిపోయి ఎప్పటికప్పుడు ఉద్యోగం మానెయ్యాలనుకుంటున్నా సముద్రపు కెరటాల్లా ఒక సమస్య తరువాత మరొక సమస్య వచ్చిపడి నా ఆలోచనని ఎప్పటికప్పుడు వాయిదా వేస్తూనేవున్నాను. నీ పరిస్థితి నా పరిస్థితిలాంటిది కాదుగా? మీరిద్దరూ సుఖంగా బతకడానికి నీ భర్త ఉద్యోగం చాలు. నా మాట విను"

"నా అవసరాలు తీరడం లేదమ్మా! అందుకే నేను ఉద్యోగం చేస్తానంటున్నది"

"నీకు కావలసినవి అతను కొంటానంటున్నాడుగా? అడిగి కొనిపించుకో!"

"అతను ఇంట్లోకి ఏంకావాలన్నా ఒకటికి పదిసార్లు అడిగితేనే కాని కొనడమ్మా! అతను పని హడావుడిలో మరచిపోతాడు. పోనీ నాకు డబ్బు ఇవ్వడు. కనీసం ఇంటి ఖర్చులకైనా... అందుకే నేను బాగా ఆలోచించి ఈ నిర్ణయం తీసుకున్నానమ్మా!"

"ఇది నీ స్వంత సమస్య కాదు శారదా నువ్వే నిర్ణయించుకోడానికి! నీ సంసారానికి సంబంధించినది. ముఖ్యంగా నీ భర్త సమ్మతి, అంగీకారం లేకుండా నువ్వు స్వతంత్రించి నిర్ణయం తీసుకుంటే, మీ ఇద్దరిమధ్య కలతలు పెరగవచ్చు ఆలోచించుకో! ఇంకో విషయం. ఉద్యోగంచేసి ఆర్థికంగా నిన్ను నువ్వు నిలదొక్కుకోవచ్చు కాని శారీరకంగా అలసిపోతావు. అటు గృహిణిగా, ఇటు ఉద్యోగినిగా రెండు పాత్రలు పోషించలేక మానసికంగా కూడా అలసిపోతావు. పిల్లలు పుడితే సమస్య మరింత జటిలమవుతుంది. ఇంటిపని, ఉద్యోగం వీటిమధ్య పిల్లలని పెంచలేక




వాళ్ళని క్రష్‌లలో వదిలిపెట్టి బాధపడే ఆడవాళ్ళెందరో నాకు తెలుసు"

"అమ్మా!" అసహనంగా అడ్డుపడింది శారద. "నేను పుట్టబోయే పిల్లల గురించి వాళ్ళ వలన ఉత్పన్నమయ్యే సమస్యల గురించి ఆలోచించడం లేదు. ప్రస్తుతం నా సమస్య నేను నా భర్త ముందు చెయ్యి జాపడం. అది నాకిష్టంలేదు"

జానకి హతాశురాలయింది. శారద ఎవరేం చెప్పినా వినదని అర్థమయింది ఆవిడకి.

"నీ ఇష్టం ఆలోచించుకో శారదా! నీ పట్టుదల ఫలితంగా మీ ఇద్దరి మధ్య మనస్పర్థలు రావడం బాగుండదు"

మరునాడు ఉదయమే సాంబశివరావు, జానకి ప్రయాణమయ్యారు.

"నిన్ననేగా వచ్చారు? మరి రెండురోజులు వుండండి మామగారూ" అన్నాడు ఆనంద్. అతనికి అత్తమామలు తన ఇంట్లో వుండాలనే కోరికకంటే శారద విషయంలో వాళ్లు తనకేమీ హామీ ఇవ్వకుండానే వెళ్ళిపోతున్నారనే బెంగ ఎక్కువగా ధ్వనించింది.

"లీవ్ లేదు... వెళ్ళాలి" అన్నాడు సాంబశివరావు.

"మీ ఇష్టం" అసంతృప్తిగా అని బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. సాంబశివరావు కూతుర్ని పిలిచి, జేబులోనుంచి అయిదువందలు తీసి ఆమె ముందుకి జాపాడు.

"ఇవి వుంచు"

"దేనికి నాన్నగారూ? " ఆశ్చర్యంగా అడిగింది.

"నీ ఖర్చుల కోసం!"

"వద్దు... నా పెళ్ళికి చాలా ఖర్చుపెట్టారు. ఇప్పుడు మళ్ళీ ఇంత డబ్బు మీ దగ్గరనుంచి తీసుకోడం... నాకిష్టంలేదు నాన్నగారూ!"

"ఖర్చుకేముంది? ఇద్దరం సంపాదిస్తున్నాం. ఎలాగో అప్పు తీర్చేస్తానులే"

"వద్దు నాన్నా!" మెల్లిగా అయినా స్పష్టంగా చెప్పింది. "ఆయన్ని అడిగి తీసుకుంటానులెండి" కావాలనే అంది.

తండ్రి ముఖంలో సంతృప్తి కనిపించింది.

శారదకి ఒక విషయం బాగా అర్థమవసాగింది. స్త్రీ పురుషుడి ఆధిక్యతముందు తల వంచుతూనే వుండాలి. అప్పుడే అతనికి సంతృప్తి. తన కంటే అధికురాలయిన స్త్రీని అతని అహం అంగీకరించదు.

ఆ రాత్రి శారద ఆనంద్‌ని అడిగింది.

"మిమ్మల్నొక విషయం అడగవచ్చా? "

"అడుగు" ముభావంగా అన్నాడు.

"నేను మన పెళ్ళికి ముందు మీకో ఉత్తరం వ్రాశాను. మీరు దానికి జవాబు వ్రాయలేదేం? "

"ఉత్తరమా? ఏ ఉత్తరం? " అతని కనుబొమలు ముడివడ్డాయి. కొత్త విషయం వింటున్నట్టు చూశాడు.

"మన పెళ్ళి చూపులు జరిగిన పదిరోజుల తర్వాత అంటే నవంబర్ 9వ తారీఖున మీకు ఉత్తరం వ్రాశాను"

"నాకు ఉత్తరం అందలేదు" శారద రెప్ప వాల్చకుండా కొన్ని క్షణాలు అతని ముఖంలోకి చూసింది. అతను నిజం చెబుతున్నాడా, లేక నటిస్తున్నాడా తెలుసుకోడానికన్నట్టుగా.

"ఇంతకీ ఏం వ్రాశావ్ ఆ ఉత్తరంలో? "

"ఏమీలేదు" శారద ముఖం తిప్పుకుంది.

"ప్రేమలేఖా? " నవ్వేడతను.

"ఏమీ లేదన్నానుగా! ఏమీ లేదు" గోడ వైపు తిరిగి పడుకుంది.



"పెళ్ళికి ముందు శారద ఆనంద్‌కి ఉత్తరం వ్రాశానని మీతో చెబుతుంటే విన్నాను" అంది జానకి. శారద తనకా విషయం ఎప్పుడో చెప్పినా తెలియనట్టే అడిగింది.

"అవును వ్రాసింది"

"మీకెలా తెలుసు? "

"ఒక ఆడపిల్ల తండ్రిగా అనుక్షణం అదేం

చేస్తోందో తెలుసుకోవలసిన బాధ్యత నాకు వుంది"

"ఆ ఉత్తరం..."

"నేను చదివాను. అంతేకాదు, దాన్ని ఆనంద్‌కి అందకుండా చేశాను. ఆ ఉత్తరంలో అదేం వ్రాసిందో తెలుసా? తను ఉద్యోగం చెయ్యడానికి అతను అంగీకరిస్తేనే అతన్ని పెళ్లి చేసుకుంటానని షరతు పెట్టింది. అది ఉద్యోగం చెయ్యడం అతనికిష్టంలేదని ముందే తెలిస్తే ఈ సంబంధం వదులుకోడానికి సిద్ధపడేది. ఉద్యోగం కారణంగా బంగారంలాంటి సంబంధాన్ని వదులుకోడం ఎంత అవివేకం?"

"ఎంతపని చేశారండీ!" ఆవేదనగా ధ్వనించింది జానకి స్వరం. "శారద ఎంత పట్టుదల మనిషో తెలిసివుండే ఎందుకిలా చేశారు? ఈ సంబంధం కాకపోతే దానికి పెళ్లే అవదా? ఉద్యోగం చెయ్యడానికి ఇష్టపడిన వ్యక్తితో పెళ్లి జరిపిస్తే అది సుఖంగా వుండేది. ఇప్పుడీ సమస్య ఎదురయ్యేది కాదు"

"వాళ్లే సర్దుకుంటారు" తేలిగ్గా అన్నాడు సాంబశివరావు.

"ఉద్యోగం కోసం కాపురం వదులుకునేటంత మూర్ఖురాలు కాదు శారద"

జానకికి బాధగా వుంది. నెలకి రెండువేలకి పైగా సంపాదిస్తున్నా తన జీతం అంతా ఆయన తీసేసుకుని, తనని ఆయన ముందు చెయ్యి జాపేలా చేసినప్పుడు కూడా ఆమె అంత బాధపడలేదు.

★ ★ ★

అతను లోపలకి అడుగుపెట్టగానే ఫారిన్ పెర్‌ఫ్యూమ్ ఘుమఘుమలతో ఆ గది నిండిపోయింది. ఖరీదైన దుస్తులు ధరించి వున్న అతనిపై సునీత చూపులు నిర్నిమేషంగా క్షణకాలం నిలిచాయి. అతనూ తనని అలాగే చూస్తున్నాడని గ్రహించగానే ఖంగారుగా చూపులు తిప్పుకుంది. అతను ఆమెని దాటి లోపలికి వెళ్ళాడు.

సునీతకి సినిమా చూడబుద్ధి కాలేదు కళ్ళముందు అతను కన్పిస్తున్నాడు. అతను మన్మధుడూ, నలకూబరుడూ కాదుకాని, డబ్బు తెచ్చిన హుందాతనంతో వున్నాడు.

'ఎవరక్కా ఆ అమ్మాయి?' వంటగదిలోకి వెళ్లిన అతను సరోజినిని అడిగాడు.

"సునీత అని ఈ వీధి చివరనే వాళ్ళిల్లు. రోజూ మనింటికి సినిమా చూడడానికి వస్తుందిలే" సునీత ఎడల సదభిప్రాయం లేని సరోజిని ఆమె గురించి అయిష్టంగానే చెప్పింది.

"ఇప్పుడు లోపలకి వచ్చినతను ఎవరండీ" కొద్దిసేపటి తర్వాత బయటకి వచ్చిన సరోజినిని అడిగింది సునీత.

"నా తమ్ముడు రమేష్" క్లుప్తంగా చెప్పింది.

తనకి సంబంధించని విషయాలలో తల దూర్చడం అలవాటున్న సునీతకి తనకే మాత్రం సంబంధంలేని ఆ వ్యక్తి ఎడల కనబరచిన ఆసక్తి తన జీవితాన్ని అనూహ్యమైన మలుపు తిప్పుతుందని తెలియదు.

★ ★ ★

"నా తమ్ముడు రమేష్... బిజినెస్ చేస్తున్నాడు. హైదరాబాద్‌లో రెండు మేడలున్నాయి. కారు వుంది" సరోజిని చెబుతున్నది వింటూనే ఆశ్చర్యంతో నోరు తెరిచేశాడు రామారావు.

"కట్నకానుకల పట్టింపు లేదు. అమ్మాయి నచ్చితే చాలు. మా రమేష్‌కి సునీత చాలా నచ్చింది"

రాజ్యలక్ష్మి రామారావు ముఖాలు చూసుకున్నారు. "ఆలోచించుకునే చెప్పండి. తొందరేంలేదు"

ఇంటికి వచ్చాక రాజ్యలక్ష్మి అంది. "వింతగా లేదూ? అంత డబ్బున్న అతగాడు ఏమీలేని మనమ్మాయిని పెళ్ళిచేసుకుంటాననడం?"

"అవును"





"తప్పకుండా దీంట్లో ఏదో లొసుగు వుంది. అన్ని హంగులూ వున్న అతను ఇంతకాలము పెళ్ళి చేసుకోకుండా ఎందుకు వుండిపోయాడు? వయసు ముప్పై సంవత్సరాలుంటుంది. కాని ఇంకా ఎక్కువ వయసున్నవాడిలాగే వున్నాడు. మనమ్మాయికీ అతనికీ పదేళ్లు తేడా. పైగా మనమ్మాయి పక్కన అతన్ని ఊహించుకోడానికే కంపరంగా వుంది. కాకి ముక్కుకి దొండపండులా..."

"నిజమే" అన్నాడు రామారావు. "మనకి మాత్రం ఏ పదిమంది పిల్లలున్నారని. ఒక్కగానొక్క ఆడపిల్ల. వున్నంతలో కట్నం ఇచ్చి మంచి సంబంధమే చేద్దాం"

"అవును"

"సునీతని అసలు వాళ్ళింటికి వెళ్ళనివ్వకు. ఆ అబ్బాయి వాళ్లింట్లోనే వున్నట్టున్నాడు. వాళ్ళ మనసులో మనతో సంబంధం కలుపుకోవాలనే ఆలోచన వచ్చాక అది ఆ ఇంటికి వెళ్ళడం అసహ్యంగా వుంటుంది"

"నిజమే!"

మరునాడు సునీత సారధిగారింటికి బయలుదేరుతున్నప్పుడు రాజ్యలక్ష్మి అభ్యంతర పెట్టింది.

"ఏమిటమ్మా! రోజూ వాళ్ళింటికి వెళ్తూనే వున్నానుగా? ఇవాళేమిటి కొత్తగా?" కోపంగా అడిగింది.

"మీ నాన్నగారు వెళ్ళనియ్యవద్దన్నారు"

"కారణం ఏమిటి?"

"నాకు తెలియదు"

"నీకు తెలుసు... అదేమిటో చెప్పు. సంతోషిస్తాను"

"సరోజినిగారి తమ్ముడు వాళ్లింట్లోనే వున్నాడా?"

"వున్నాడు... వుంటే?"

"ఆవిడ నిన్ను అతనికిచ్చి పెళ్ళి చెయ్యమని అడిగింది"

"తప్పేమిటి?"

"మీ నాన్నగారికి ఆ సంబంధం ఇష్టం లేదు"

"ఎందుకని?"

"ఏమిటే ఇన్ని ప్రశ్నలు అడుగుతున్నావ్, నీకు సమాధానం చెప్పవలసిన అవసరం నాకు లేదు" కోపంగా అంది.

"రమేష్‌గారు చాలా మంచివారమ్మా! ఆయన్ని పెళ్ళి చేసుకోవడం నాకిష్టమే"

"ఏమిటే!" నిర్ఘాంతపోయింది.

"మనం వున్న పరిస్థితులలో అంత మంచి సంబంధం దొరుకుతుందా? అంత డబ్బున్న వ్యక్తి కోరి నన్ను పెళ్లి చేసుకుంటాననడమే అదృష్టం"

"అంత డబ్బువున్న వ్యక్తి ఇన్నాళ్లూ పెళ్ళెందుకు చేసుకోలేదో ఆలోచించావా? అయినా పెళ్లే చేసుకోవాలంటే అతనికి సమవుజ్జీలయిన అమ్మాయిలే కరువయ్యారా? పైగా కట్నం కానుక ఏమీ వద్దట"

"కట్నం తీసుకోవడం ఆయన ఆదర్శానికి వ్యతిరేకమట"

"అలా అని నీతో చెప్పాడా?"

"అవును... ఆయన అసలు పెళ్లి చేసుకోకూడదు. జీవితాంతం బ్రహ్మచారిగానే వుండిపోదామనుకున్నారుట. నన్ను చూసిన మొదటిక్షణంలోనే తనకి భార్య కాబోయే అమ్మాయి ఇలా వుండాలన్పించిందిట"

కెంజాయకాంతులు ప్రతిఫలిస్తున్న ఆమె చెంపలు, అరమోడ్పులవుతున్న కళ్లు చూస్తే కథ చాలా దూరం వెళ్ళివుంటుందన్పించింది రాజ్యలక్ష్మికి.

"దీంట్లో ఏదో లొసుగు వుంది సునీతా! బాగా ఆలోచించు"

"నువ్వు అర్థంలేని అనుమానాలతో భయపడుతూ నన్ను భయపెడుతున్నావు. రమేష్‌గారికేం తక్కువ? డబ్బున్నవాడు. చదువుకున్నవాడు"

మధ్యలోనే అడ్డుపడి అరిచింది రాజ్యలక్ష్మి.

"ఏమిటే, అంతా నీ ఇష్టమేనా? మాకు ఇష్టం వుండద్దా? అతనికీ నీకూ వయసులో పదేళ్లకి పైగా వ్యత్యాసం వుంది"

"ఇవేమీ చెప్పుకోదగిన లోపాలు కావు. అసలు రమేష్‌గారంతటి వ్యక్తి నన్ను పెళ్ళి చేసుకుంటాననడమే గొప్ప అదృష్టం"

రాజ్యలక్ష్మి అవాక్కయి చూస్తోంది.

"కేవలం డబ్బుకోసమే. అతన్ని పెళ్ళి చేసుకుంటున్నావన్పిస్తోంది నీ వరస చూస్తుంటే? "

"సినిమా హీరోలా వున్నాడని ఏ కూలి పనిచేసుకునేవాడినో పెళ్ళి చేసుకోలేంకదా?"

నోటమాట రానట్టు చూస్తోంది ఆవిడ.

సునీత రమేష్‌ని పెళ్లి చేసుకోడానికి నిశ్చయించుకుందని తెలిసిన రామారావు కోపంతో చిందులు తొక్కాడు.

"మేం చచ్చామనుకున్నావా? నీ పెళ్లి నువ్వే నిర్ణయించుకునేటంత పెద్ద దానివయ్యావా? "

"నేను పెళ్ళి చేసుకుంటానంటుంది అనామకుడినేం కాదు. డబ్బు, హోదా అన్నీ వున్న వ్యక్తిని. మీరయితే ఇంతకంటే మంచి సంబంధం తేగలరా? "

రామారావు జవాబివ్వలేనట్టు చూశాడు.

"చాలీచాలని జీతంతో వచ్చిన జీతం మూడు వారాలకే ఖర్చయిపోయి మళ్ళీ ఫస్ట్ తారీఖు ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తూ అంతవరకు ఎక్కడ అప్పు దొరుకుతుందా అని మధనపడుతూ, కనీస అవసరాలు కూడా తీరక, అనుక్షణం రాజీపడుతూ... ఛీ...ఛీ... అలాంటి బ్రతుకు నాకు వద్దు నాన్నా! అంతేకాదు, నాకు ఉద్యోగం చెయ్యాలని లేదు. ఇంటా బయటా చాకిరీ చేసి అలసిపోయి, జీవితంలో చిన్న చిన్న అనుభూతులకు కూడా నోచుకోకుండా గానుగెద్దులా నాకు బ్రతకాలని లేదు. నేను కోరుకోకుండానే అన్నీ వున్న సంబంధం నన్ను వెదుక్కుంటూ వచ్చింది. ఈ సంబంధాన్ని వదులుకోవడం అవివేకమని నా అభిప్రాయం నాన్నగారూ? "

రామారావుకి కూతురి మాటలతో పూర్తిగా అర్ధమయిపోయింది ఆమె నిర్ణయంలో మార్పులేదని.

ఆయన మరేం మాట్లాడలేకపోయాడు. రమేష్ సంబంధం విషయం ఒకళ్ళిద్దరు మిత్రుల దగ్గర ప్రస్తావించినప్పుడు వాళ్లు కూడా ఆమాటే అన్నారు.

"వెయ్యి జన్మలెత్తినా ఇలాంటి సంబంధం తీసుకురాలేవు. ఇంకేమీ ఆలోచించక, ఈ సంబంధం నిశ్చయం చేసుకో. తిరిగి చూడక్కర్లేని రాజాలాంటి సంబంధం. పిల్ల సుఖపడుతుంది"

రామారావుకి కూడా అదే సరయినదన్పించింది.

శుభలేఖలు దగ్గరపెట్టుకుని ఎడ్రస్‌లు రాస్తున్న సునీతకి వున్నట్టుండి తన స్నేహితురాళ్లిద్దరూ గుర్తుకొచ్చారు.

రాధకి పెళ్లయిందని, ఆమె భర్త వైజాగ్‌లో ఏదో గవర్నమెంటు ఆఫీసులో క్లర్కు అని ఆమెకి తెలుసు. తెలియనిదల్లా శారద విషయమే. ఏం చేస్తూ వుండి వుంటుంది శారద? ఆర్థిక స్వాతంత్ర్యం అంటూ ఉద్యోగం చేసుకుంటూ కన్యగానే వుండి వుంటుందా? ఏమైనా తమ స్నేహితురాళ్లు ముగ్గురిలోకి తనే అదృష్టవంతురాలు. సునీతకి ప్రపంచాన్ని జయించినంత ఆనందంగా గర్వంగా వుంది.

★ ★ ★

శారద అపాయింట్‌మెంట్ లెటర్‌ని ఆనంద్‌కి అందిస్తూ అంది. "నాకు ఉద్యోగం వచ్చింది"

ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది. అతను ఆ కాగితాన్ని చించి, ముక్కలు చేసి తన ముఖాన్ని కొడతాడేమోనని భయపడుతూ ఆమె తల దించుకుంది.

ఆనంద్ క్షణంసేపు ఆ లెటర్‌ని పరిశీలించి, "వెరీగుడ్! కంగ్రాచ్యులేషన్స్! మొత్తానికి సాధించావ్!" అన్నాడు.

ఆ అభినందనతో శారదకి ధైర్యం వచ్చింది. కాని అతను తనని మనస్ఫూర్తిగా అభినందించలేదని, పళ్ల బిగువున ఆగ్రహాన్ని దిగమ్రింగుకుంటున్నాడని ఆమెకి తెలియదు.

"రేపు జాయినవుతున్నాను" ఉత్సాహంగా చెప్పింది.

"నీ ఇష్టం! అయినా రేపు అమావాస్య! మొదటిసారి ఉద్యోగానికి మంచిరోజు చూసుకునే వెళ్లవచ్చుగా? "

"నాకలాంటి పట్టింపులేం లేవండీ! అయినా దేముడు రోజులన్నీ ఒకేలా సృష్టించాడు. కొన్ని మంచిరోజులు కొన్ని చెడ్డరోజులూ లేవు"

"నీ ఇష్టం"

తను ఉద్యోగం చెయ్యడానికి వ్యతిరేకతను చూపించిన భర్త ఆమాత్రం మంచితనంగా మాట్లాడినందుకే ఆమె పొంగిపోయింది.

మరునాడు... ఉదయం అయిదు గంటలకి లేచి నీళ్లు పట్టుకుని, వంట చేసుకుని భర్తకి, తనకి టిఫిన్ బాక్స్‌లు సర్ది, బయలుదేరేసరికి ఆమెకి నీరసం వచ్చింది. అలా పరుగులు పెడుతూ హడావుడిగా పనిచెయ్యడం అలవాటు లేక, ఆమెకి కాళ్లుచేతులు పట్టుకుపోయాయి. ఆమెకి తల్లి గుర్తుకొచ్చింది. యాభై ఏళ్లు దగ్గరపడుతున్న వయసులో కూడా పిల్లలకి వండిపెట్టి తనకి, భర్తకి బాక్స్‌లు సర్ది ఆఫీసుకి ఆదరాబాదరా వెళ్లేది.

రాత్రి పన్నెండు గంటలదాకా చదువుకున్న తను ఉదయం ఆలస్యంగా నిద్రలేచేది. "ఎంత కష్టపడేది తన తల్లి? తల్లి పడుతున్న కష్టం ముందు తన కష్టం ఏపాటిది? " అలా అనుకోగానే శారదకి ఊరట కలిగింది.

మొదటిరోజు కావడంవలన ఆఫీసులో ఆమెకి అంతగా పనిలేదు. సాయంకాలం ఇంటికి రాగానే స్నానం చేసి, కాఫీ తాగి రిలాక్సయింది. ఆమె ఇంటికి వచ్చిన అర గంట తర్వాత ఆనంద్ వచ్చాడు.

"ఎలా వుంది ఉద్యోగం? " అనడిగేడతను.

"మొదటిరోజు కదా! పనేంలేదు" అందామె నవ్వుతూ. కాఫీ తాగి పేపరు పట్టుకుని కూర్చున్నాడతను.

శారద వంటకి ఉపక్రమించింది. కూర దింపి, చారుకి తాలింపు పెడుతూ ఓరగా భర్తవైపు చూసింది. అతను కుర్చీలో వెనక్కివాలి నిద్రపోతున్నాడు.

ఆమె వంట పూర్తయి అన్నీ టేబుల్ మీద సర్ది మరునాటి బ్రేక్‌ఫాస్ట్ కోసం మినప్పప్పు రుబ్బుకుంటూండగా అప్పుడు లేచాడు ఆనంద్.

"వంటయిందా, అన్నం పెట్టు"

ఆమె చేస్తున్న పని మధ్యలో ఆపి, అన్నం వడ్డించింది. భోజనాలయ్యాక ఆమె వంటిల్లు సర్ది తలుపులన్నీవేసి వచ్చి పడుకునేసరికి మరో అరగంట పట్టింది.

ఆనంద్ పడుకుని పుస్తకం చదువుతున్నాడు. మామూలుగా అయితే లైటు వుంటే నిద్రపట్టని శారదకి ఆ రోజు పట్టపగలు ఎండలో పడుకున్నా నిద్రవచ్చేంతగా నిద్ర ముంచుకొస్తోంది. అయిదు నిముషాలలోనే నిద్రలోకి జారుకుంది. తన ముఖానికి దగ్గరగా వెచ్చని ఊపిరి... తన శరీరంపై వెచ్చని చేతుల స్పర్శతో ఆమె ఉలిక్కిపడి లేచింది.

ఆనంద్... అతనికి దాదాపు ప్రతి రాత్రీ కావాలి.

"సారీ అండీ! నిద్ర పట్టేసింది"

"నేను లేపేశానుగా!" అతను నవ్వాడు. ఆ రాత్రి పన్నెండు గంటలదాకా అతనామెని పడుకోనివ్వలేదు.

. మరునాడు ఉదయం ఆమె నిద్ర లేచేస

రికి ఆరు గంటలు. ఆమె మరింత పరుగులు పెట్టవలసి వచ్చింది. ఎనిమిది గంటలకి ఆనంద్ లేచేప్పటికి బ్రేక్‌ఫాస్ట్, లంచ్ బాక్సు రెడీ చేసి పెట్టినా అతనికి కాఫీనుంచి షేవింగ్ కిట్‌దాకా అన్నీ అందించవలసిందే! ఇవన్నీ రోజూ చేసే పనులే అయినా, ఆమె కూడా ఆఫీసుకి వెళ్లడానికి తయారవాలి కాబట్టి హడావుడిగా పరుగులు పెట్టే సరికి ఆమె అలసిపోతోంది.

ఆమె అలసటకి అన్నింటికంటే ముఖ్యమైన మరోకారణం ఆనంద్ ఏ రాత్రీ పన్నెండు గంటలలోగా ఆమెని నిద్రపోనివ్వడం లేదు. గతంలో ఏదో హడావుడిగా ముగించి పది గంటలకల్లా నిద్రపోయే అతను ఇప్పుడు పన్నెండు గంటలయినా పడుకోడంలేదు. రాత్రి ఆలస్యంగా పడుకున్నా శారద అయిదున్నరకల్లా లేవవలసిందే. ఆమెకి తను పరీక్షలప్పుడు రాత్రి పన్నెండుదాకా చదువుకుని, ఉదయం అయిదు గంటలకల్లా లేవడం గుర్తొచ్చి ఉత్సాహాన్ని తెచ్చుకుంటోంది. కాని ఇవి పది రోజులలో ముగిసిపోయే పరీక్షలు కావు, పరీక్షలయిపోయాయి హమ్మయ్య అని తృప్తిగా ఊపిరిపీల్చుకుని, రాత్రి ఎనిమిది గంటలకే పడుకోడానికి.

ఆ రాత్రి ఆనంద్ తన ఒంటిపై చెయ్యి వెయ్యగానే ఆమె మొదటిసారిగా అభ్యంతర పెట్టింది.

"నాకు నిద్ర వస్తోందండీ!"

"ఏం? ఆఫీసులో ఫైళ్ల చాటున కునుకు లాగించడం లేదా?" నవ్వుతూ అడిగేడు.

"నేను ఉద్యోగం చేస్తున్నది గవర్నమెంటు ఆఫీసులో కాదు. ప్రైవేటు ఆఫీసులో" తను నవ్వుతూనే అంది.

"ఇవాళ చాలా అందంగా వున్నావ్ శారదా!" అతనామెని ఊపిరాడనివ్వకుండా చేస్తూ అన్నాడు. శారద గతంలో అతని ప్రతిచర్యకీ స్పందించేది. కాని అతను ఇప్పుడు తనపై చెయ్యివేసినా ఆమెలో స్పందనే లేదు. అలసట... నిస్సత్తువ నిద్ర... గట్టిగా కుదపడంతో ఆమెకి నిద్రా భంగమయింది.

"ఏమిటంత మొద్దునిద్ర?" విసుగ్గా అన్నాడతను. ఇంకా మత్తు విడని కళ్లతో అయోమయంగా చూస్తోంది.

"ఛీ! ఛీ! నీతో రొమాన్స్ చేసినా ఒకటే, శవంతో రొమాన్స్ చేసినా ఒకటే!"

ఛెళ్లున ముఖంపై కొట్టినట్టు అయింది. బాధావేదనలు రెపరెపలాడుతున్న కళ్లతో అతన్ని చూస్తోంది.

ఆనంద్ ఆమెనుంచి దూరంగా జరిగి పడుకున్నాడు. శారద సర్వద్రష్టురాలిలా చూస్తోంది.

'శవం... తను శవం!'

ఆమె కళ్లలో నీళ్లు కమ్ముకొస్తున్నాయి. శారద గుండెల్లో శూలం గుచ్చి రక్తం చిందుతున్న ఆమె మనసుని, కన్నీళ్లతో అలసిపోయిన ఆమె కళ్లని పట్టించుకోకుండా ఆనంద్ మాత్రం గుర్రుపెట్టి పడుకున్నాడు.

ఆమెకి అతని ప్రవర్తన అర్థమయింది. అతనికి తను ఉద్యోగం చెయ్యడం ఇష్టం లేదు. ఆ మాట డైరెక్టుగా ముఖంపై చెప్పి తను చెడ్డవాడు కాదలచుకోలేదు. తనని శారీరకంగా అలసిపోయేలా చేసి తనంతట తానుగా ఉద్యోగం మానేసేలా చెయ్యాలని అతని ఎత్తుగడ. శారదకి అతని ప్రయత్నాలు అర్థమయ్యేసరికి మరింత పట్టుదల కలిగింది.

కొన్ని సుఖాలు పొందాలంటే, కొన్నింటిని త్యాగం చెయ్యాలి తప్పదు. కొన్ని కష్టాలూ పడాలి. ఆమె రాత్రిళ్లు ఎక్కువసేపు మెలకువగావున్నా ఉదయం పెందరాళే లేవడం అలవాటు చేసుకుంది.

★ ★ ★

ఎయిర్ కండిషనర్ చిన్నగా చేస్తున్న శబ్దం, గదంతా అలుముకుని వున్న ఎయిర్ ఫ్రెషనర్ సువాసనలు, మెత్తని యు-ఫోమ్

బెడ్... సునీతకి తెలి మబ్బులపై తేలియాడుతున్న అనుభూతి కలుగుతోంది. పూలపల్లకిలో వూరేగుతున్నట్టు వుంది.

సునీత మత్తుగా, బద్ధకంగా కళ్లు విప్పి పక్కకి చూసింది. పక్కన రమేష్‌లేడు. అతను బాత్‌రూమ్‌కి వెళ్లి వుంటాడేమో అనే ఉద్దేశంతో ఆమె కొద్ది క్షణాలు ఎదురు చూసింది. క్షణాలు నిముషాలుగా మారుతున్నా అతను రాలేదు. సునీత అసహనంగా లేచి బాత్‌రూమ్‌వైపు వచ్చి తలుపు తోసి చూసింది. లోపల అతను లేడు.

'ఎక్కడకి వెళ్లివుంటాడు ఇంతరాత్రివేళ?'

ఆమె భ్రుకుటి ముడిపడింది. నిముషాలు భయంకరంగా గడచిపోతున్నాయి. అతను రాలేదు. మరి రెండు నిముషాల తర్వాత తలుపు తీసుకుని బయటకి వచ్చింది. వరండాలో నడుస్తున్న ఆమె హఠాత్తుగా తమ గదికి వ్యతిరేక దిశలో వున్న గెస్ట్ రూమ్‌లో నుంచి వినవస్తున్న స్వరాలు విని అప్రయత్నంగానే ఆగిపోయింది. ఆ స్వరం రమేష్‌ది.

సిక్స్త్ సెన్స్ ప్రేరేపణతో ఆమె ఆ గది కిటికీ దగ్గరకి నడిచింది.

లోపల రమేష్ చేతుల మధ్య ఆ ఇంటి పనిమనిషి ఆదిలక్ష్మి! సునీత రక్తం చల్లబడిపోయింది. తలపై పిడుగుపడ్డట్టు స్తంభించిపోయింది. తన చుట్టూ వున్న ప్రపంచమంతా గిరగిర తిరిగిపోతున్న అనుభూతి! తన గదిలోకి ఎలా నడిచి వచ్చిందో ఆమెకే తెలియదు. పెళ్లయిన మూడవరోజునే తన పక్కలోనుంచి లేచి వెళ్లి పనిమనిషితో కులుకుతున్న తన భర్త!

అసహ్యంతో, జుగుప్సతో ఆమె ఒళ్లంతా కంపిస్తోంది. తన భర్తకి తను మొదటి స్త్రీ కాదనే నిజం గుండెలని దహిస్తోంది.

తలుపు చప్పుడవడంతో రమేష్ లోపలకి వస్తున్నాడని గ్రహించి, తన కన్నీళ్లు అతను చూడడం ఇష్టం లేదన్నట్టు ఆమె దిండులో ముఖం దాచుకుంది. అతను వచ్చి ఆమె పక్కనే పడుకున్నాడు. అతను తన ఒంటిపై చెయ్యి వేస్తాడేమో ఆ చేతిని విసిరికొడదామనుకుంది. కాని అతను ఆ ప్రయత్నమేమీ చెయ్యలేదు. సునీతకి ఆ గదిలో వుండాలనిపించలేదు. కాని ఏదో అదృశ్యశక్తి ఆమెని ఆపేస్తోంది.

రమేష్‌కి సునీత నిద్రపోవడం లేదని, ఏడుస్తోందని తెలుసు. అతను ఆమెని ఓదార్చే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు.

★ ★ ★

తెల్లవారింది. సునీత రాత్రంతా నిద్రపోలేదు. తలంతా భారంగా వుంది. కళ్లు మంటలు పెడుతున్నాయి. అంతకుమించి ఆమె మనసు మండిపోతోంది.

"ఏం చెయ్యాలిప్పుడు? తన భర్త నిజస్వరూపం తెలిసాక కూడా అతనితో ఎలా బతకాలి? "

"అబ్బాయి లేచాడామ్మా! కాఫీ ఇచ్చావా?" అత్తగారు అడిగింది.

సునీతకి ఆమెకి జవాబివ్వాలనిపించలేదు. పెదవి విప్పితే దుఃఖం వచ్చేలా వుంది.

"వెళ్లి కాఫీ ఇవ్వు!"

సునీత వంటగదిలోకి వెళ్లి వంటమనిషి కలిపిన కాఫీని కప్పులోపోసి పనిమనిషిని పిలిచింది.

ఆమె చేతులు నలుపుకుంటూ వినయంగా నిలబడింది. "పిలిచారా అమ్మగారూ? "

"వెళ్లి కాఫీ అయ్యగారికి ఇచ్చిరా!"

"పని మనుషులు కాఫీ యిస్తే అయ్యగారు తాగరమ్మగారూ!"

అధరామృతం తప్ప కాఫీ రుచించదు కాబోలు! కసిగా అనుకుంటూ, తన కోపాన్ని, తిరస్కారాన్ని ప్రదర్శిస్తూ విసవిసా నడుస్తూ కాఫీ పట్టుకెళ్లింది.

రమేష్ అప్పుడే లేచినట్టున్నాడు. బాత్‌రూమ్‌లోనుంచి వస్తున్నాడు.

"గుడ్‌మార్నింగ్!" పలకరింపుగా నవ్వేడు.




సునీత తల ఎత్తలేదు. ట్రే టీపాయ్‌పై పెట్టి వెనుదిరగబోయింది.

"ఎందుకలా వున్నావ్? ఒంట్లో బాగానే వుందా? " తను ఆమె చెయ్యిపట్టి ఆపబోయాడు. ఆమె అప్రయత్నంగానే రెండడుగులు వెనక్కి వేసింది.

"మాట్లాడవేమిటి? మాట్లాడకపోయినా ఫర్వాలేదు. కాని అంత దూరంగా నిలబడితే ఎలా? కొత్తగా పెళ్ళయినవాళ్ళు మొదటి ఆరు నెలలూ ఎలా వుండాలో తెలుసా? "

సునీత విసురుగా తల ఎత్తి ఏహ్యంగా, తిరస్కారంగా చూస్తూ అంది...

"తెలుసు! పెళ్ళయిన మూడవరోజునే పక్కనున్న పెళ్ళాన్ని వదిలి, పనిమనిషితో కులకాలి"

ఒకక్షణం తెల్లబోయిన అతను నవ్వేశాడు.

"సో! రాత్రి మమ్మల్ని చూశావన్నమాట"

"చూశాను... మీ నిజస్వరూపం తెలుసుకున్నాను. ఎందుకు... ఎందుకిలా చేశారు?"

"అమ్మకి ఈమధ్య చాలా జబ్బుచేసింది సునీతా! ఆమె నా పెళ్లి చూసి చచ్చిపోవాలని అనుకుంది. అందుకని తప్పలేదు" నిదానంగా, అదే స్వరంతో చెప్పాడు.

"అందుకని... ఇంతగా వంచిస్తారా? " ఆవేశంతో, అసహ్యంతో, దుఃఖంతో వణికిపోతోందామె. "మీ నిజస్వరూపం తెలిసాక, మీ నీడని కూడా భరించలేను నేను. ఇప్పుడే వెళ్లి మీ అమ్మగారికి ఇదంతా చెప్పి మీ వాళ్లందరి ముందూ మీ పరువుతీసి నా దారి నేను చూసుకుంటాను" కసిగా అంది.

"ఇప్పుడు నువ్వు కొత్తగా చెప్పేదేమీ లేదు. అమ్మకి నా గురించి అంతా తెలుసు సునీతా!"

దిగ్భ్రమతోనూ, అసహ్యంతోను అతడివైపు చూసింది.

"సో! నేను మీ నుంచి విడాకులు కోరడానికి గల కారణాన్ని నేను మీ ఇంట్లో వాళ్లకి చెప్పే అవసరంలేదన్న మాట"

"ఇది చాలా చిన్న విషయం సునీతా! భర్త తాగుతున్నాడని, మరో స్త్రీతో సంబంధం పెట్టుకున్నాడని భార్య విడాకులు కోరితే ఈ పవిత్ర దేశంలో ఇన్ని సంసారాలు నిలబడేవేకావు"

"చిన్న విషయమా? ఇది చిన్న విషయమా? మీరు నా స్థానంలో నిలబడి వుంటే నా బాధ మీకు అర్థమయి వుండేది! మీకు నేనేం లోటు చేశాను? " దుఃఖంతో ఆమె గొంతు పూడుకుపోయింది.

"మన పెళ్లయి మూడు రోజులయిందో, ముప్పై ఏళ్లయిందో నాకు అర్థం కావడం లేదు. అంత భారమైన డైలాగులు చెబుతున్నావు! అదే ప్రశ్న నేనూ నిన్నడిగితే! లక్షలు విలువచేసే ఆస్తికి నువ్వు అధికారిణివి! ఎ.సి.బెడ్ రూమ్, ఎ.సి.కారు, కోరిన్ని చీరలు, నగలు ఇవన్నీ నీవి కావూ? పనిమనిషితో అనుభవాన్ని పంచుకున్నంత మాత్రాన అది నా భార్య అవుతుందా? ఈ భోగభాగ్యాలకి అధికారిణి అవుతుందా? "

సునీత విహ్వలంగా చూస్తోంది.

"బాగా ఆలోచించుకో సునీతా! నన్ను కాదని విడాకులు తీసుకుని నువ్వు సాధించేదేమీ లేదు. మొగుడు వదిలేసిన ఆడదానిగా నిన్ను చులకన చేసేవాళ్లే తప్ప కనీసం సానుభూతిని కూడా చూపించరు. ఈ హోదా, సంఘంలో నీకు వచ్చిన గుర్తింపు ఇవన్నీ నాతో వచ్చినవి. నన్ను వదిలేసిన తక్షణం అవన్నీ పోతాయి. నీ ఇష్టం! ఆలోచించుకో!" అతను కాఫీ తాగుతూ బాల్కనీలోకి వెళ్లిపోయాడు.

సునీత మ్రాన్పడినట్టు నిలబడిపోయింది. రమేష్ ఒకరకంగా తనని బెదిరిస్తున్నాడు, భయపెడుతున్నాడు! సునీతకి అతని మాటల వలన కాదుకాని నిజంగా అతడిని వదిలి వెళ్లిపోతే తన భవిష్యత్తు ఏమవు



తుందా అని భయం వెయ్యసాగింది.

కలలోనైనా ఊహించని భోగభాగ్యాలు ఒకవైపు ఊరిస్తున్నాయి. మరొకవైపు రమేష్‌ని భర్తగా ఊహించుకోడానికే అసహ్యం వేస్తోంది. సునీతకి అసహాయతతో ఏడుపొస్తోంది.



ఆ ఉదయం హఠాత్తుగా వచ్చిన అత్తగారిని సంభ్రమంగా ఆహ్వానించింది శారద.

కామేశ్వరమ్మ లోపలకి వస్తూనే అడిగింది, "మా వాడేడి!" అని.

"స్నానం చేస్తున్నారత్తయ్యా!" చెప్పింది.

అత్తగారితో మాట్లాడుతున్నంత సేపు శారద ఆలోచిస్తూనే వుంది. "ఇంటికి మొదటిసారిగా వచ్చిన అత్తగారికి వంటిల్లు అప్పచెప్పి తను ఆఫీసుకి వెళ్తే బాగుండదు. ఈ రోజుకి సెలవు పెట్టాలి"

ఆనంద్ స్నానం చేసి వచ్చి తల్లితో కబుర్లు చెబుతుంటే తామిద్దరికీ వండిన వంట మూడో మనిషికి కూడా సరిపోదు కాబట్టి మళ్ళీ వంట ప్రయత్నంలో పడింది.

మధ్యలో భర్తని పిలిచి చెప్పింది.

"మీరు బ్యాంక్‌కి వెళ్ళేప్పుడు కాస్త ఈ లీవ్ లెటర్ మా ఆఫీసులో ఇచ్చేస్తారా? "

ఆనంద్ శారద తనకి అందించిన ఆ కాగితాన్ని విప్పి చదివాడు.

"ఇదేమిటి? ఈ ఒక్కరోజే సెలవు పెట్టావు? అమ్మ నెల రోజులు మన దగ్గరే వుంటుంది. అసలే ఆవిడ ఆరోగ్యం బాగా లేదు కూడా!"

"ఆ విషయం తర్వాత మాట్లాడదాం"

కామేశ్వరమ్మ అక్కడే వుండి ఆ ఇద్దరి సంభాషణ వింటున్నదల్లా అడిగింది.

"ఆఫీసేమిటి? సెలవేమిటి? "

"నేను ఏదో ఒక చిన్న ఉద్యోగం చేస్తున్నానత్తయ్యా! మీరు వచ్చారు కదా అని ఈ రోజుకి సెలవు పెట్టాను"

"నువ్వు ఉద్యోగం చేస్తున్నావా? "

"నువ్వు వ్యభిచారం చేస్తున్నావా? " అన్నంత ఏహ్యతని స్వరంలో ప్రస్ఫుటింపచేస్తూ అడిగిందావిడ.

"నీ సంపాదన మీ ఇద్దరికీ చాలటం లేదేమిటిరా? నువ్వే కోడలిని ఉద్యోగం చెయ్యమన్నావా లేక..." తల్లి మాట్లాడేది పూర్తికాకుండానే అన్నాడు ఆనంద్.

"ఆ విషయం నీ కోడలినే అడుగు!" అంటూ బయటకి వెళ్ళిపోయాడు

కామేశ్వరమ్మ శారదవైపు చూస్తూ తల పంకించింది.

"ఓహో! ఉద్యోగం చెయ్యాలనే బుద్ధి నీకే పుట్టిందన్నమాట"

శారదకి తనేదో ఘోరమైన తప్పు చేసినట్టు ఆవిడ తనని దోషిని చూసినట్టు చూస్తుంటే కోపం కంటే బాధగా వుంది.

"తప్పేం వుందత్తయ్యా!"

"తప్పు మాట అటుంచి అవసరం ఏముంది? "

శారదకి ఆవిడతో వాదన పొడిగించాలని లేదు. అందుకే మౌనం వహించింది.

ఆమె మౌనంతో కామేశ్వరమ్మ మరింత రెచ్చిపోయింది.

"ఆడవాళ్ళు మగవాళ్ళతో సమానంగా ఉద్యోగం చెయ్యడం మా ఇంటావంటా లేదు" అంది కొంచెం ఆగి.

"మొగుడి సుఖంకంటే డబ్బే ముఖ్యం నీకు" అనీ అంది.

ఆవిడ ఏమన్నా శారద పెదవి విప్ప





లేదు. ఆవిడ మాట్లాడుతున్నది తన గురించి కాదన్నట్టు మౌనంగా తన పని తను చేసుకోసాగింది.

మరునాడు శారద ఆఫీసుకి బయలుదేరే టైమ్ అవుతున్నా కామేశ్వరమ్మ నిద్రలేవ లేదు. ఆమె సందిగ్ధంలో పడింది. అత్తగారింకా నిద్రలేవలేదు. ఆవిడకి కాఫీ ఇవ్వకుండా ఆఫీసుకి వెళ్లడం ఎలా? ఆమెకి ఏం చెయ్యాలో పాలుపోలేదు.

ఇంక ఈరోజుకి కూడా ఆఫీసుకి సెలవు పెట్టవలసిందే అనుకుంటూండగా, అప్పుడు లేచి వచ్చిందావిడ.

"అయ్యో! మొద్దునిద్రపోయాను! కొత్త చోటుకదూ! రాత్రి నిద్రపట్టలేదు"

"ఫర్వాలేదత్తయ్యా! ముఖం కడుక్కొని రండి. కాఫీ ఇస్తాను" అంది.

ఆవిడ ముఖం కడుక్కొని వచ్చేప్పటికి కాఫీ అందిస్తూ అంది. "నాకు ఆఫీసుకి టైమయిందత్తయ్యా! నేను వెళ్తున్నాను. వంట చేసేశాను. అన్నీ బల్లమీదున్నాయి. మీరు తినెయ్యండి. సాయంకాలం వంట నేను వచ్చి చేస్తాను. మీరు రెస్టుతీసుకోండి. తోచకపోతే, అదుగో, ఆ రాక్‌లో పుస్తకాలున్నాయి. చదువుకోండి" చెబుతూనే హడావుడిగా ముందుకి నడిచింది.

సాయంకాలం శారద ఇంటికి వచ్చేప్పటికి కామేశ్వరమ్మ పడుకుని వుంది.

"అదేమిటత్తయ్యా! ఒంట్లో బాగాలేదా?" ఆదుర్దాగా అడిగింది.

"తలనెప్పి! కాఫీ ఇచ్చే దిక్కు కూడా లేదు ఈ ఇంట్లో!"

"అలమరలో పాలు, డికాషన్ వున్నాయి. మీకు చెప్పడం మరిచిపోయాను" అంది శారద. "కలుపుకోలేకపోయారా?" అనే అర్థం ధ్వనించేలా.

ఆవిడ మరింత మూలగసాగింది. "అబ్బా తల నెప్పి! తల బద్దలయిపోతోంది"

"మాత్ర వేసుకుంటారా?" కాఫీ కలిపి ఇస్తూ అడిగింది.

"అక్కర్లేదులే! అదే పోతుంది" ఆవిడ కాఫీ తాగి ముసుగు తన్ని పడుకుంది. భోజనాల వేళకి లేచి మామూలుగా భోజనం చేస్తున్న ఆవిడని చూసిన శారదకి లోలోన ఆశ్చర్యం, అనుమానం కలిగాయి.

"ఆవిడ తల నెప్పి నిజమా? నాటకమా?" అని.

మరునాటికి ఆవిడ అసలు స్వరూపం బయటపడిపోయింది. ఆ సాయంకాలం శారద ఇంటికి వచ్చేప్పటికి ఆవిడ కాఫీ తాగలేదు. రెండు బస్‌లు మారి ఉసూరుమంటూ ఇంటికొచ్చేసరికి ఆవిడ పొరుగింటావిడతో కబుర్లు చెబుతోంది.

టేబిల్‌మీద ఆవిడ తిన్న కంచం ఈగలు ముసురుతూ అలాగే వుంది. గిన్నెలమీద మూతలే లేవు. ఉదయం ఆఫీసుకి వెళ్తూ శారద దొడ్లో తీగెలమీద ఆరేసిన బట్టలు అలాగే వున్నాయి.

శారదకి అర్థమయింది. అత్తగారికి చెప్పుకోదగిన అనారోగ్యం ఏమీ లేదు. ఇంట్లో చిన్నచిన్న పనులు కూడా చెయ్యకుండా రోజూ మూడుగంటలకే కాఫీ త్రాగే అలవాటున్న ఆవిడ తను ఆరుగంటలకి ఇంటికి వచ్చేదాకా ఆగి, తనచేతే కాఫీ కలిపించుకుని తాగడం కనీసం తిన్న ఎంగిలి కంచమైనా టేబిల్‌మీదనుంచి తియ్యకపోవడం ఇవన్నీ తనని ఉద్యోగం మానిపించే ఉద్యమంలో ఆవిడ చేస్తున్న సహాయనిరాకరణ.

శారదకి ఆవిడపై కోపం రాలేదు. ఆడదై వుండీ సాటి ఆడదాని ఆర్థిక స్వావలంబనని సహించలేని ఆవిడ మూర్ఖత్వానికి జాలిపడింది. మరొకళ్ళు శారద స్థానంలో వుండి వుంటే అత్తగారితో పోట్లాడేవారే! కాని, శారదది పోట్లాడే మనస్తత్వం కాదు. పోట్లాడి సాధించేదేదీ లేదు.

"ఇవాళ ఏకాదశి. నేను భోజనం చెయ్యను. రవ్వతో ప్రసాదం చెయ్యి"

వంటంతా చేసి టేబిల్‌పై పెట్టి లంచ్ బాక్స్‌లు సర్దబోతున్న శారద అత్తగారి ఆదే

శంతో ఉలిక్కిపడి టైము చూసింది, ఎనిమి దిన్నర.

ఇప్పుడు ప్రసాదం చెయ్యాలా? ఆమెకి నీరసం వచ్చింది. పెదవి కదపకుండా మూకుడు స్టవ్‌పై పెట్టింది. ఆరోజు ఆమె ఆఫీసుకి అరగంట ఆలస్యంగా వెళ్ళింది. ఆమె పనిచేస్తున్న సెక్షన్ సూపరింటెం డెంటుకి ఉద్యోగంచేసే ఆడవాళ్ళంటే సదభి ప్రాయం లేదు. ఆడవాళ్ళు ఆఫీసులో పనిచె య్యరని, కబుర్లు చెప్పుకుంటారని ఆయన ప్రగాఢ విశ్వాసం.

"అరగంట లేటు!" అన్నాడు నీ సంజా యిషీ ఏమిటన్నట్టు.

"సారీసర్! బస్ టైర్ పంక్చరయింది" అంది శారద.

"ట్రాఫిక్ జామ్, బస్‌టైర్ పంక్చర్ ఇలాం టివన్నీ దృష్టిలో పెట్టుకుని అరగంట ముందుగానే బయలుదేరాలమ్మాయ్" అన్నాడు మరోసారి లేటయితే బావుండద న్నట్టు.

శారదకి తలకొట్టేసినట్టయింది. చదువు కునే రోజులలో చాలా చిన్నప్పటినుంచి పంక్చువాలిటీకి ప్రాణం ఇచ్చేతను ఈ రోజు పై ఆఫీసర్ దగ్గర తలదించుకోవాలసి వచ్చింది. అదీ అత్తగారి కారణంగా.

ఆమెకి ఇంత ప్రతిఘటనతో తను ఎక్కు వకాలం ఉద్యోగం చెయ్యలేననిపించింది.

భర్త, అత్తగారు తనేదో ఘోరమైన తప్పు చేసినట్టు ఎందుకు తనపై కక్షసాధిస్తు న్నారు? తను ఉద్యోగం చెయ్యాలనుకోడం తప్పా? ఆమె కొద్దిసేపటిదాకా పనిలో నిమ గ్నురాలవలేకపోయింది.



నాలుగు రోజులపాటు రమేష్ ఇంటిప ట్టునే వున్నాడు. సునీతని ప్రేమసాగరంలో ఓలలాడించాడు.

కాని, ఆ రాత్రి అతని చేతులమధ్య ఆది లక్ష్మిని చూసిన సునీత మరునాటి రాత్రి అతను తనని దగ్గరకి తీసుకున్నప్పుడు తనలో కలిగిన అసహ్యాన్ని, జుగుప్సని దిగ మింగుకోడానికి చాలా కష్టపడవలసివ చ్చింది.

ప్రపంచంలో భార్యాభర్తలమధ్య సెక్స్ కంటే గొప్ప కమ్యూనికేషన్ మరేదీ లేదు. ఆ కమ్యూనికేషన్‌ద్వారా అతనామె శరీ రాన్నే కాదు మనసుని కూడా జయించగలి గాడు.

"విరిసిన గులాబీలాంటి నిన్నుకాదని గడ్డి పువ్వులలో తేనెని ఆస్వాదించాలనుకు న్నాను"

"కవులు వర్ణిస్తారే, అంతగొప్ప అందం నీది!" వగైరా డైలాగులతో.

మరునాటి ఉదయం ఆమెను జ్యూయెలరీ షాపుకి తీసికెళ్ళి ఆమెకి నచ్చిన పగడాల సెట్ కొనిపెట్టాడు. అక్కడనుంచి బట్టలషా పుకి వెళ్ళారు. సునీత మనసులో అతనిపై ఏమూలో వున్న కాస్త ద్వేషం మటుమా యమై ఆ స్థానంలో ప్రేమ ఆక్రమించు కుంది.

ఆ అయిదు రోజులూ అయిదు నిముషా లలా గడిచాయి. ఆ రాత్రి సునీతకి మెళు కువ వచ్చింది. పక్కన రమేష్ లేడు. ఆమె చరాలున లేచి బయటకి వచ్చి చూసింది. ఆమె ఊహించినట్టుగా రమేష్ గెస్ట్ రూమ్‌లో లేడు. ఇంటివెనుక వున్న తోటలో వున్నాడు. ఈసారి ఆదిలక్ష్మితో కాదు వంట మనిషి కూతురితో.

సునీత ఒంట్లోని రక్తం సలసల మరిగిపో సాగింది. అవమానంతో, అసహ్యంతో ఏడు పొస్తోంది. గిరుక్కున వెనుదిరిగి తన గది లోకి వచ్చేసింది. అతను తెల్లవారుఝా మున ఎప్పుడో బెడ్‌రూమ్‌లోకి వచ్చాడు.

అతను రావడంకోసమే ఎదురుచూస్తున్న సునీత తీవ్రంగా అడిగింది, "ఎక్కడనుంచి వస్తున్నారు?"

అతను బడలికగా పక్కమీద వాలుతూ

అన్నాడు.

"తెలిసే అడుగుతావెందుకు? "

"ఛీ! మీరసలు మనుషులేనా? మీకు నీతి నియమాలున్నాయా? "

అతను మంచంమీద బాసింపట్టు వేసు కుని కూర్చుంటూ అన్నాడు. "మనుషులలో ఎన్ని జాతులున్నాయో తెలుసా? " క్షణం ఆగి అన్నాడు. "రెండే జాతులు. వున్న వాళ్ళు, లేనివాళ్ళు వున్నవాడు అన్నీ అను భవిస్తాడు! లేనివాడు అనుభవించలేడు. అలా అని ముక్కుమూసుకుని కూర్చోనూ లేడు. తనకి అందుబాటులో లేని సుఖా లను కొన్నింటినైనా అనుభవించాలని చూస్తాడు. ఉదాహరణకి ఒక పుల్లయ్య ఇంట్లో టి.వి. లేదనుకో! వాడు పక్కింటి కైనా వెళ్ళి టి.వి. చూసి వస్తాడు! ఇందాకా నన్ను ఏమని అడిగావ్?, "మీకు నీతి నియ మాలు లేవా" అని కదూ? నిత్యం దూరద ర్శన్‌లో ప్రసారమయ్యే ప్రోగ్రామ్స్ చూసి విసుగెత్తిన వాళ్ళకి స్టార్ టి.వి. ఎలాంటి రిలాక్సేషనో నాకు 'ఇది' అంతే!"

సునీత ముఖంలో రక్తం పొంగి వచ్చినట్ట యింది.

"ఇంట్లో టి.వి. లేనివాడు పక్కింటికైనా వెళ్ళి టి.వి. చూసివస్తాడు!" అనేమాట ఆమె గుండెలో సూటిగా దిగబడింది. సరో జిని తన గురించి అతడికి ఏం చెప్పి వుంటుందన్నది అప్రస్తుతం. అతను ఆ మాటలు ఎవరిని ఉద్దేశించి అన్నా కానీ, తనకి గుచ్చుకునేలా వున్నాయి.

ఆమె పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

తెల్లవారి అయిదు గంటలకి పడుకున్న రమేష్ మధ్యాహ్నం భోజనాల వేళకి లేచాడు. లేస్తూనే స్నానంచేసి సునీతని పిలి చాడు.

"రా, భోజనం చేద్దాం"

"నేను తినను" విసురుగా అంది.

"ఏమిటిది చిన్నపిల్లలా, రా, నాకు ఆకలి వేస్తోంది!"

"నేను తిననని చెప్పాను"

"నీకు పస్తులుండడం అలవాటుగానీ, నాకు అలవాటులేదు. అందులోనూ ప్రొద్దుట బ్రేక్‌ఫాస్ట్ తినలేదు. రాత్రంతా నిద్రలేదేమో ఒళ్ళు తెలియకుండా నిద్రపో యాను"

"నీకు పస్తులుండడం అలవాటేమో నాకు అలవాటులేదు" అతను అన్న ఈ మాటలకి అవమానంతో ఆగ్రహంతో ఆమె నిలువెల్లా వణికిపోయింది. "ఎంత చులకన? " ఆమెకి రోషంతో ఏడుపొస్తోంది.

ఆమె మాట్లాడకపోవడంతో కిందకి వెళ్తూ వంటమనిషిని పిలిచి బిగ్గరగా చెప్పాడు.

"అమ్మగారు భోజనం చెయ్యరుట. ఒక గ్లాసు మజ్జిగ ఇవ్వు! నాకు భోజనం పెట్టెయ్యి"

అతను కిందికి వెళ్ళిన కొద్దిసేపటి తర్వాత వంటమనిషి తెచ్చిన మజ్జిగ గ్లాసుని గోడకి విసిరికొట్టింది సునీత.

పదినిముషాల తర్వాత రమేష్ గదిలోకి వచ్చాడు. కింద పడివున్న గ్లాసుని నేలమీద ఒలికిన మజ్జిగని చూసి పని మనిషిని పిలిచి చెప్పాడు.

"మజ్జిగ ఒలికినట్టుంది. గదంతా శుభ్రం చెయ్యి"

ఆమె ఆ పని చేసి వెళ్ళాక, టేబిల్‌మీద వున్న కారుతాళాలను అందుకుని "నాతో రా" అని పిలిచాడు.

"ఎక్కడకి" విసురుగా అడిగింది.

"రా, నీకే తెలుస్తుంది!" అతను ముందుకి నడిచాడు.

సునీత అనుసరించింది అయిష్టంగానే.

"తప్పు చేసినప్పుడల్లా తనని ఓదార్చడా నికి బహుమతులు కొనివ్వడం బాగా అల వాటయింది" పళ్ళు కొరుక్కుంటూ, "చీర మార్చుకుని వస్తాను" అంది.

"అక్కర్లేదు... రా!"



అతను సీరియస్‌గా కారు డ్రైవ్‌చేస్తున్నాడు. సునీతకి అతను తనని ఎక్కడకి తీసికెళ్తాడా అని ఆసక్తిగా వున్నా బింకంగా కూర్చుని వుంది.

కారు బస్‌స్టాండ్ దగ్గర ఆగింది.

"దిగు" అన్నాడు రమేష్ తను దిగకుండానే. అతను తనని అక్కడకి ఎందుకు తీసుకొచ్చాడో అర్థంకాకపోయినా కారు దిగింది. అతను డోర్‌వేసేసి విండో గ్లాసు లోనుంచి వంద రూపాయలనోటు ఆమె వైపు విసిరాడు.

"చూడు, నేను నీకు నచ్చకపోతే, మీ పుట్టింటికి వెళ్ళు నాతో కలిసి వుండాలా లేదా అనే విషయం బాగా ఆలోచించుకుని నాకు ఉత్తరం రాయి. తరువాత కోర్టులో కలుసుకుందాం. అంతేకాని, ఇలా సంసారాన్ని రచ్చకీడ్చడం నాకు నచ్చదు" సునీత నోరు మెదిపేలోగా అతని కారు ముందుకి దూసుకెళ్ళింది.

సునీత దిమ్మెరపోయి నోటమాట రానట్టు చూస్తోంది. అయోమయంగా... దిగ్భ్రమగా... క్షణకాలం అతను ఏమన్నాడో అర్థంకాలేదు. అర్థం అయ్యాక ఆమె నోరు మెదిపేలోగా అతని కారు అదృశ్యమయింది. అతనిచ్చిన వందరూపాయలనోటు ఆమె చేతిలో చెమటతో తడిసిపోతోంది. కళ్ళలో నిండిన నీటికి చుట్టూ వున్న పరిసరాలు అలుక్కుపోయినట్టు కన్పిస్తున్నాయి.

ఎంత అహం! తనేం చేసినా చెల్లుబాటు అవుతుందనే ధీమా! అతను తనని కొట్టడం లేదు. తిట్టడంలేదు. మెత్తగా తన గొంతు నులిమేస్తున్నాడు. తనని కట్టుబట్టలతో బస్‌స్టాండ్‌లో వదిలేసిపోయాడూ అంటే తనని ఎంత సులువుగా వదిలించుకోగలడో అర్థమవుతోంది.

బస్ వచ్చింది. జనం బిలబిలలాడుతూ బస్‌దగ్గరకి పరిగెడుతున్నారు. సునీత అలాగే నిలబడిచూస్తోంది. పైన ఎండ మండిపోతోంది. దాహంతో గొంతు ఎండిపోతోంది... 'ఏం చెయ్యాలి ఇప్పుడు? వెనక్కి వెళ్దామంటే అంతకంటే లోకువ వుండదు' ఆమె క్షణం ఆలోచించి బస్‌వైపు నడిచింది.

★ ★ ★

మొదటి నెల జీతం అందుకుంటూంటే శారద చేతులు ఆనందోద్వేగంతో వణికాయి. తన మొదటి సంపాదన! తొమ్మిది నెలలు మోసి పురుటి నెప్పులు పడి బిడ్డ పుట్టాక తన పొత్తిళ్ళలో అమాయకంగా నిద్రిస్తున్న పసికందుని చూసి ఒక తల్లి ఎంత ఆనందాన్ని అనుభవిస్తుందో, తన రచనని మొదటిసారిగా అచ్చులో చూసుకున్నప్పుడు ఒక రచయిత ఎంత ఆనందోద్వేగానికి గురి అవుతాడో అంత ఆనందాన్నీ పొందిందామె.

సాయంకాలం ఆఫీసునుంచి వస్తూ భర్త కోసం ఒక రెడీమేడ్ షర్టు, అత్తగారికోసం ఒక చీర కొంది. బస్‌స్టాపులో చంకలో పసిపిల్లతో అడుక్కుంటున్న బిచ్చగత్తె చేతిలో అయిదు రూపాయలు పెట్టింది.

ఇంటికి రాగానే అత్తగారి చేతులలో ఆ చీర పెట్టి ఆవిడకి మనఃపూర్వకంగా నమస్కరించింది.

"ఇదేమిటమ్మా, నాకెందుకీచీర, ఆనంద్ కొనమన్నాడా? " అనడిగింది కామేశ్వరమ్మ.

"కాదత్తయ్యా! ఈ రోజు జీతాలిచ్చారు. నా మొదటి జీతంతో సరదాగా మీకోసం కొన్నాను"

ఆవిడ కనుబొమలెత్తి వ్యంగ్యంగా నవ్వింది.

"నీ స్వంత సంపాదన! నువ్వు కొనుక్కోలేకపోయావా? "

"నాకు చీరలు చాలానే వున్నాయి అత్తయ్యా!"

"నాకు ఆనంద్ కొంటాడమ్మా! నేను అడిగి కొనిపించుకుంటాను"కొడుకుని డబ్బు అడగడం తనకేమీ చిన్నతనం కాదని పరో




క్షంగా చెప్పిందావిడ.

శారద ఆవిడ దగ్గర నిలబడితే మాటా మాటా పెరిగి గొడవ పడడం తప్ప మరేం జరగదని గ్రహించి లోపలకి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి ఆనంద్‌తో చెప్పింది.

"ఇవాళ జీతం ఇచ్చారు!"

"ఆహా!" పొడిగా అన్నాడు.

"నా మొదటి సంపాదనతో మీకేమైనా కొనాలనిపించింది. ఇదుగో మీకోసం సరదాగా ఈ షర్టుకొన్నాను" అతనికి షర్టు అందించింది. అతను ఆ షర్టువైపు కన్నెత్తి కూడా చూడలేదు.

"నీ డబ్బుతో నాకెందుకు ఈ బహుమతులవీ? నన్ను డబ్బు అడగడం నీకు నామోషీ కదా! నువ్వే దాచుకోవలసింది!" అతను నవ్వుతూనే అన్నా ఆ కనుబొమల విరుపులోని వ్యంగ్యాన్ని శారద గమనించక పోలేదు.

"వచ్చే నెలలో నా పుట్టినరోజు. అప్పుడు మీరు నాకు చీర కొందురుగానిలెండి షర్టు మీకు బాగుంటుంది. వేసుకోండి" పేకెట్టు విప్పుతూ అంది.

"ఆడదాని సంపాదనతో బట్టలు కొనిపించుకునేటంత ఖర్మ నాకేం పట్టలేదు"

ఆనంద్ శారద తన చేతులలో పెట్టిన షర్టుని విసిరేశాడు. అది వెళ్ళి దూరంగా పడింది.

అతను తనిచ్చిన కానుకని తిరస్కరించాడనే బాధకంటే "ఆడదాని సంపాదన" అన్న పదాలే ఆమె నెక్కువ బాధించాయి.

ఆమె మౌనంగా షర్టు తీసి మడతపెట్టి బీరువాలో భద్రపరిచింది. ఆమెకి కన్నీళ్లొస్తున్నాయి. కాని ఏడ్చి తన బలహీనతని బయటపెట్టుకోడం ఇష్టంలేదు. ఆ గదిలో అతని సమక్షంలో వుండాలనీలేదు.

కాని మూడు గదులున్న ఆ ఇంట్లో ముందు గదిలో అత్తగారు పడుకుని వుంది. అంత రాత్రివేళ వంటగదిలో కూర్చుని తనపై సదభిప్రాయంలేని అత్తగారికి తనకి, భర్తకి మధ్య ఏదో గొడవ జరిగిందనే విషయాన్ని ఎగ్జిబిట్ చెయ్యడం ఆమెకిష్టంలేదు. ఆవిడ మెలకువగానే వుందనడానికి సూచనగా ఆవిడ దగ్గడం విన్పిస్తోంది.

శారద అలమరలో వస్తువులని తిరిగి సర్దడం మొదలు పెట్టింది. పావుగంటలో ఆ పనీ పూర్తయింది. ఆమెకి తనమీద తనకే జాలివేస్తోంది. పగలంతా రెక్కలు ముక్కలు చేసుకుని అటు ఆఫీసులోను, ఇటు ఇంట్లోను పనిచేస్తోంది. కాని ఒక్క రాత్రయినా ప్రశాంతంగా నిద్రపోయిందా? రాత్రి పన్నెండు గంటలు దాటాక నిద్రపోయి మళ్లీ ప్రొద్దుటే మెళుకువ రాదేమోనని భయంతో కలత నిద్రపోయి... ఆలోచిస్తున్న శారద ఉలిక్కిపడింది, భర్త చేతులు తనని చుట్టుకోవడంతో.

అతని చేతలకి శరీరం యాంత్రికంగా స్పందిస్తోంది. మనసు మాత్రం యధేచ్ఛగా పరుగులు తీస్తోంది. తన భర్తకి ఆడదాని సంపాదనతో బహుమతులు పొందడం నామోషీ! కాని ఆడదాని శరీరం కావాలి. ఆడది అందించే సేవలు కావాలి! చేతలతో శరీరాన్ని వేడెక్కించే విద్యే కాదు, మనసుని మండించే విద్య కూడా వచ్చునతనికి. శారద అయిష్టంగా కళ్లు మూసుకుంది.

★ ★ ★

'కరివేపాకు, కొత్తిమీర' వీధిలో ఆకు కూర లమ్మి కేక వినిపించింది. వంటింట్లో పనిచేసుకుంటున్న శారద వీధిలోకి వెళ్లి కొత్తిమీర తీసుకుంది. ఇదివరకైతే ఆ అర్ధరూపాయి కోసం బిచ్చగత్తెలా భర్తని దేవిరించవలసి వచ్చేది. అవును అక్షరాలా బిచ్చగత్తెలాగానే! ఆ అర్ధరూపాయి కూడా శారదని షర్టు జేబులోనుంచి తీసుకోమని చెప్పడతను. అతను వచ్చి ఇచ్చేవరకు ఆమె నిలబడి వుండవలసిందే! ఒక్కొక్కసారి ఆకు కూరలమ్మికి విసుగెత్తి గంపనెత్తిన పెట్టుకుని చక్కాపోయేది. ఆ రోజు వంట కరివేపాకు లేకుండానే పూర్త

య్యేది.

చేతిలో కొత్తిమీరతో లోపలకి వస్తున్న శారదవైపు ఆనంద్‌తోబాటు కామేశ్వరమ్మ కూడా ఒక కోరచూపు విసిరింది.

ఆరోజు ఆమె కొత్తిమీరతో చేసిన చట్నీ ఆ ఇద్దరూ తినలేదు.

బియ్యం అయిపోవచ్చాయని ఆ సాయం కాలం ఆనంద్‌తో చెప్పింది శారద.

అతను ఆమె చెప్పింది విన్నాడో లేదో తెలియదు కాని, బియ్యం మాత్రం తేలేదు.

మరుసటిరోజు ఆమె మళ్లీ అతనికి గుర్తు చేసింది. ఇవాళ్టికి సర్దు. రేపు కొంటాను. బ్యాంక్‌లో పని ఎక్కువగా ఉంది" అన్నాడు అక్కడకి తనొక్కడే బ్యాంకు బాధ్యతనంత టిని తన భుజస్కందాలపై మోస్తున్నట్టు.

"రేపటివరకు సరిపోవు"

"ఏం? వారం రోజులముందే చెప్పలేకపో యావా? అయిపోయేవరకు చెప్పకపోవడ మేమిటి? వెళ్లి పక్కింటివాళ్లనో, ఎదురింటి వాళ్లనో, రెండు కేజీల బియ్యం అప్పు అడుగు!" ఆనంద్ రుసరుసలాడాడు.

శారద తల వంచుకుంది. తప్పు తనదే. ప్రొద్దుట ఆఫీసుకు వెళ్లే హడావుడిలో పరుగు, సాయంకాలం పని తాలూకు అల సట వీటిమధ్య తను బియ్యం అయిపోవ చ్చిన విషయం గమనించలేదు.

ఆమె ఆ సాయంకాలం ఆఫీసునుంచి వస్తూ బియ్యం కొనితెచ్చింది.

గుమ్మంలో రిక్షావాడు పెట్టిన బియ్యం మూటని చూసిన కామేశ్వరమ్మ అడిగింది.

"బియ్యం కొన్నావా?"

"అవునత్తయ్యా!"

"ఆనంద్ తెచ్చేవాడుగా? నువ్వెందుకు కొన్నావ్? అంతగా కాకపోతే పక్కింటి ఆవి డని అడిగి కాసిని బియ్యం తేవచ్చుగా?"

"అప్పు అడగడం నాకిష్టం లేదత్తయ్యా!"

"మరీ చోద్యం కాకపోతే అప్పుకి అదునే విటే! సంసారం అన్నాక ఒకళ్లకి అప్పు ఇవ్వకా తప్పదు. మనం అప్పు చెయ్యకాత ప్పదు" సాగదీసింది కామేశ్వరమ్మ.

శారద మాట్లాడలేదు. కాళ్లు కడుక్కుని వచ్చి కాఫీ కలిపి ఆవిడకి ఇచ్చింది.

ఆ రాత్రి ఆనంద్ డైనింగ్ టేబుల్ దగ్గ రకి వస్తూ అడిగాడు.

"బియ్యం ఎక్కడవి? పక్కింటివాళ్లనడిగి తెచ్చావా?"

నిజానికి కామేశ్వరమ్మ కొడుకు చెవిలో శారద బియ్యం కొనితెచ్చిన సంగతి అతను బ్యాంకునుంచి రాగానే వూదింది.

శారదకి అతను గొడవ చేస్తాడని తెలుసు. అయినా అబద్ధం చెప్పాలన్పించ లేదు.

"కొన్నాను" అంది.

"ఏమిటి నీ ఉద్దేశం? నేను పెళ్లానికి అన్నం పెట్టలేని చవటననుకున్నావా? లేక పోతే నువ్వు భర్తని పోషిస్తున్న భార్యగా చరిత్ర సృష్టించగలిగిన నవలామణివనుకు న్నావా?" అతని స్వరం తీవ్రంగా వుంది.

"అరె! ఒక్కరోజు... ఒక్కరోజు కాసిని బియ్యం అప్పు అడగవే అంటే... బియ్యం కొనితెచ్చావ్! ఇవాళ బియ్యం కొన్నావ్! రేపు నన్ను ఉద్యోగం మానేసి ఇంట్లో చేతులకి గాజులు వేసుకుని కూర్చోమంటావ్!"

శారద స్థాణువులా నిలబడి వింటోంది.

"చిన్న విషయం... తను స్వతంత్రించి బియ్యం కొన్నందుకు... అతను ఇంత రాద్ధాంతం చేస్తాడని ఆమె ఊహించలేదు. అతను అంతగా ఇరిటేట్ అవ్వలసిన తప్పు తనేం చేసిందో ఆమెకి అర్థం కాలేదు"

ఆమె మౌనాన్ని నిర్లక్ష్యంగా భావించి అతను మరింత రెచ్చిపోయాడు.

"సంపాదిస్తున్నానని పొగరు నీకు! నన్ను డబ్బు అడగడం నీకు నామోషీకదూ! మొగు డిమీద ఆధారపడడం అంత చిన్నతనంగా భావించిన దానివి అసలు పెళ్లెందుకు చేసు కున్నావ్?"

తప్పు తాగివచ్చి భార్య చికెన్‌కర్రీ బదు

లుగా చిక్కుడుకాయ కూర వండిందని భార్యపై అరిచే తమ పక్కింటి మాధవరావు గుర్తువచ్చాడు శారదకి. అతను తాగివచ్చి అరిచేవాడు. ఇతను తాగకుండానే అరుస్తున్నాడు. అంతే తేడా!

"ఛీఛీ! ఆడపెత్తనం, మంగలి వైద్యం అన్నారందుకే!" అతను విసురుగా గదిలోకి వెళ్లి అంత విసురుగానూ తిరిగి వచ్చాడు.

"నీ డబ్బుతో నన్ను పోషించక్కర్లేదు" చేతిలో నోట్లని ఆమెపైకి విసిరేస్తూ అన్నాడు.

శారద విసురుగా తన ముఖానికి తాకి నేలమీదపడిన ఆ డబ్బుని అలాగే చూస్తూ కళ్లలో చివ్వున ఉబకబోయే నీటిని బలవంతాన నిగ్రహించుకుంటోంది.

'తను ఏడవకూడదు! ఏడ్చి తన బలహీనతను బయటపెట్టుకోకూడదు' ఆమె పొంగి పొరలే బాధావేదనలను బలవంతాన నిగ్రహించుకుంటోంది.

శారద తెచ్చిన బియ్యానికి డబ్బు ఇచ్చిన ఆనంద్ తన పురుషాధిక్యతను చాటుకుని కడుపు నిండా భోజనం చెయ్యగలిగాడు, కాని శారద మాత్రం అభోజనంగా వుండిపోయింది.

ఆమె వంట గది సర్దుకుని వచ్చేప్పటికి ఆనంద్ పడుకుని పుస్తకం చదువుతున్నాడు. ఆమె అడుగుల శబ్దం విని కూడా అతను తల ఎత్తలేదు. శారద నిశ్శబ్దంగా కూర్చుంది. ఆ నిశ్శబ్దం ఆమెకి భరింపరానిదిగా వుంది.

ఒంటరితనం కాదు... తను ఒంటరిననే భావమే ఆమె మనసుని నలిబిలి చేస్తోంది.

"రా, వచ్చిపడుకో!" ఆనంద్ లైటు ఆర్పుతూ అన్నాడు. అతని స్వరం ఆజ్ఞాపిస్తున్నట్టు వుంది. శారద కదలలేదు. అతను తనని ఎందుకు పిలుస్తున్నాడో ఆమెకి తెలుసు. ఆమె మనసు ఏహ్యతతో, తిరస్కారంతో నిండిపోయింది.

భార్య భోజనం చేసినా చెయ్యకపోయినా పెద్ద తేడా ఏమీ లేనట్టు, పైగా తను కావాలిట.

ఆనంద్ ఈసారి పిలవలేదు. ఆమె దగ్గరకి వచ్చి ఆమెను అమాంతం చేతులమధ్య ఎత్తేశాడు.

శారద ప్రతిఘటించబోయి చేతకాక నిస్సహాయంగా వూరుకుంది.

ప్రేమలోనుంచి కోరికపుడితే వేలికొస తగిలితే చాలు, సప్తస్వరాలు పలుకుతాయి. కాని అతనిది ప్రేమలో నుంచి పుట్టిన కోరికకాదు. కేవలం తనని మానసికంగానే కాదు, శారీరకంగా కూడా అలసిపోయేలా చెయ్యాలనే కక్షతో పుట్టిన కోరిక అది. శారద మనశ్శరీరాలు ఎదురు తిరుగుతున్నాయి.

మనసులోని అయిష్టతని శరీరం వ్యక్తం చేస్తోంది. "నిద్రా, నీరసమా? " ఎగతాళిగా ధ్వనించిందతని స్వరం.

'అసహ్యం!' శారదకి ఎలుగెత్తి అరవాలన్పిస్తోంది. ఆమె మౌనాన్ని తలబిరుసుగా భావించిన అతను పళ్లు కొరుకుతూ అన్నాడు...

"ఎంత పొగరు నీకు!"

"పొగరుకి... ఆత్మాభిమానానికి తేడా వుంది!" శారద నోరు విప్పింది.

"ఆ..త్మా..భి..మా..నం" వ్యంగ్యంగా అన్నాడు. "ఏమంటోంది నీ ఆత్మాభిమానం? మొగుడు పెట్టిన తిండి తినవద్దంటోందా, లేక మొగుడితో కాపురం చెయ్యవద్దంటోందా? "

శారదకి అతనితో వాదించాలని లేదు.

"అసలు పెళ్లెందుకు చేసుకున్నావ్ నువ్వు! ఉద్యోగం చేసుకుంటూ జీవితాంతం కన్యగా వుండలేకపోయావా? "

ఆమెకి అతని మాటలు తనకి వినబడనంత దూరం పారిపోవాలని వుంది. ఆమె పక్కకి తిరిగి పడుకుంది.

ఆనంద్ కాస్సేపు గొణుక్కున్నాడు. ఆమె

దేనికీ మాట్లాడకపోవడంతో అరిచి అరిచి అలసిపోయి పడుకున్నాడు. కానీ ఆమెకి నిద్ర రావడంలేదు. మనసు ఆలోచనలతో కందిరీగల తుట్టలా వుంది.

"ఇంత ప్రతిఘటనతో ఎన్నాళ్లు ఉద్యోగం చెయ్యగలదు?" అశాంతిగా కళ్లు మూసుకుంది.

★ ★ ★

హఠాత్తుగా వచ్చిన సునీతని చూసి ఆనందంతో తబ్బిబ్బయింది రాజ్యలక్ష్మి.

"ఇదేమిటే, ఇంత హఠాత్తుగా వచ్చావు? మీ ఆయన రాలేదా?"

తల్లిని చూడగానే సునీతకి ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది. అతి ప్రయత్నమ్మీద తననితాను సంభాళించుకుంటూ అంది...

"నేను ఒక్కర్తినే వచ్చానమ్మా! మిమ్మల్నందరినీ చూడాలనిపించింది!"

"ఎలా వచ్చావ్? బస్సులోనా? మీ కారేది?" ఆవిడ వీధిలోకి చూస్తూ అడిగింది.

"కారు రిపేర్‌లో వుందమ్మా! ముందు కొంచెం మంచి నీళ్లియ్యి. గొంతెండిపోతోంది!"

"అయ్యో!" అనుకుంటూ ఆవిడ లోపలకి వెళ్లి మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది. బిందెలో నీళ్లు వేడిగా వున్నాయి. సునీత అయిష్టంగానే ఆ నీళ్లు తాగింది"

"పెట్టె, బట్టలు ఏమీ తెచ్చుకోలేదేమిటి?" సునీత ముందే ఆలోచించి పెట్టుకున్న సమాధానం తడుముకోకుండా చెప్పింది.

"పెట్టె బస్సులో పోయిందమ్మా!"

"అయ్యయ్యో! ఖరీదైన చీరలేవైనా వున్నాయా? అయినా అంత ఒళ్లు తెలియకుండా వుంటారుటే! పెట్టె దగ్గరే పెట్టుకోలేక పోయావా?"

"బట్టలేం పెద్ద ఖరీదైనవేం కావమ్మా! రెండు సాదా చీరలేవో వున్నాయి. అంతే!"

రాజ్యలక్ష్మి కూతురికోసం టిఫిన్ తయారుచేసే ప్రయత్నంలో పడింది. పని చేసుకుంటూ కూతురితో మాట్లాడుతోంది"

"మీ అత్తగారు మంచివారేనా? మీ ఆయన నీతో ఇష్టంగా వుంటాడా?" వున్నట్టుండి అడిగిందావిడ.

సునీత గుండె గొంతులోకి వచ్చింది. కట్టుబట్టలతో తనని బస్‌స్టాండ్‌లో దింపేసి వెళ్లిపోయిన తన భర్త మంచివాడా? రాత్రి తన పక్కలోనుంచి లేచివెళ్లి పనిమనిషితో కులికే ఆ మనిషి మంచివాడా? ఆమె కళ్లలో నీళ్లూరుతున్నాయి.

"చాలా మంచివారమ్మా! అబ్బ! ఉల్లిపాయల ఘాటుకి కళ్లలో నీళ్లు వస్తున్నాయి. అవతల కూర్చుంటాను." అంది తన కన్నీళ్లు కేవలం ఉల్లిఘాటు వలన వచ్చినవే అని తల్లిని నమ్మిస్తూ.

"వెళ్లి ముఖం కడుక్కునిరా!" అంది రాజ్యలక్ష్మి. బాత్‌రూమ్‌లోకి వెళ్లి మనసు తేలికపడేంత వరకు కన్నీరు కార్చి ముఖం కడుక్కుంది.

టిఫిన్ తింటూ లేని ఉత్సాహాన్ని తెచ్చుకుని భర్త తనకి కొన్న చీరెల గురించి, పగడాల సెట్ గురించి చెప్పింది. ఆవిడ కూతుర్ని మురిపెంగా చూస్తూ అంది...

"పోనీలే తల్లీ! నువ్వు సుఖంగా వుంటే అదే పదివేలు! అంత డబ్బున్న వాడు కానీ కట్నం లేకుండా నిన్ను పెళ్లి చేసుకుంటున్నాడంటే ఎలాంటివాడోనని భయపడ్డాను" అంది.

సునీత మంచినీళ్లు తాగుతూ అంది...

"అబ్బ! నీళ్లు చల్లగా లేవేమిటమ్మా?" అంది.

"కూజా పగిలిపోయింది. కొత్తది కొనాలి. ఒరేయ్ గోపీ! పక్కింటి సుందరమ్మగారినడిగి కాసిని అయిసుముక్కలు పట్రా!" పురమాయించింది. వాడు గిన్నె తీసుకుని పక్కింటికి వెళ్లాడు.

రామారావు ఆఫీసునుంచి వచ్చాడు. కూతుర్ని చూసి తన సంతోషాన్ని వ్యక్తపరి




చాడు. తల్లి ఆయనతో అల్లుడి మంచిత నాన్ని కూతురంటే అతనికి ఎంత ప్రాణమో వర్ణిస్తూ చెబుతోంది.

సునీత మనసులో రకరకాల ప్రశ్నలు సుడితిరుగుతున్నాయి.

తన భర్త మంచివాడని, తను సుఖంగా వుందని తల్లిదండ్రులని నమ్మించగలిగింది. కాని భర్త నిజస్వరూపం వెల్లడిచేస్తే వాళ్ల రియాక్షన్ ఎలా వుంటుంది? పెళ్లయిన ఇరవై రోజులకే తనిలా పుట్టింటికి వచ్చిందని తెలిస్తే వాళ్లేమయిపోతారు? అసలు అతన్ని గురించిన నిజాలను ఎలా చెప్పాలి?

రాత్రి భోజనాల టైమయింది. కరెంటు పోయింది. తల్లి హరికెన్ లాంతరు వెలిగించింది. ఆ గుడ్డివెలుతురులో ఎడమ చేత్తో దోమలను తోలుకుంటూ భరించలేని ఉక్కపోతలో అన్నం తింటున్న సునీతకి అప్రయత్నంగానే అత్తవారిల్లు గుర్తు వచ్చింది. కరెంటుపోయినా ఆ ఇంట్లో జనరేటర్ ఆన్ చేస్తారు.

తల్లి తండ్రి, తమ్ముడు హాయిగా పడుకుని నిద్రపోతున్నారు. సునీతకి నిద్ర రావడం లేదు. గాలి ఆడక ఒళ్లంతా తడిసిపోతోంది. దోమలు ఎడాపెడా కుడుతున్నాయి.

ఈపాటికి ఎయిర్ కండిషనర్ ఆన్ చేసుకుని హాయిగా నిద్రపోయేతను ఇప్పుడిలా...

సునీత ఆలోచిస్తోంది.

భర్తని వదిలి వచ్చి ఇక్కడ సుఖపడేదేముంది? అల్లుడి నిజస్వరూపం తెలిసిన తన తల్లీతండ్రీ తనకి సపోర్టుగా నిలబడవచ్చు కాని సుఖమయమైన జీవితాన్ని ఇవ్వలేరు. ప్రతిక్షణం రాజీపడుతూ బతకవలసిందే!

సునీత మరునాటి ఉదయమే ప్రయాణమయింది.

"అదేమిటే ఎలాగూ వచ్చావ్! రెండు రోజులు వుండివెళ్లు" అంది తల్లి.

"లేదమ్మా! అసలు ఆయన వెళ్లవద్దనే అన్నారు. నేనే మిమ్మల్నందరినీ చూడాలని వచ్చాను"

"మీ ఆడబడుచు ఇంటికి వెళ్లిరావా?"

"ఉహూఁ! ఇప్పుడు వీలవదు ఆవిడతో నేనిక్కడకి వచ్చానని చెప్పకు"

"అలాగేలే!" అందావిడ.

కాని రమేష్ తనని పుట్టింటికి పంపిన విషయం సరోజినికి ఫోన్ చేసి చెప్పాడని ఆమెకి తెలియదు.

★ ★ ★

అత్తగారికి, భర్తకి సేవలు చేస్తూ అటు ఆఫీసులోను ఇటు ఇంట్లోను సమర్థవంతంగా పనిచేస్తున్న శారదకి విసుగు రాలేదు కాని, తినీ కూర్చుని వ్యాపకం లేని కామేశ్వరమ్మకి విసుగ్గానే వుంది. పెద్ద కొడుకు ఇంట్లో కేబుల్ టి.విలో రోజుకో సినిమా చూస్తూ అడపాదడపా వి.సి.ఆర్‌లో సినిమా కేసెట్లు చూడడానికి అలవాటు పడిన ఆవిడకి బొత్తిగా కాలక్షేపం లేక మహా విసుగ్గా వుంది. అదీగాక, పెద్ద కోడలు పిల్లలతో పని తెమలదంటూ వంట పని అత్తగారికే అప్పచెబుతుంది కూడా.

పెద్ద కోడలి దగ్గర నోరెత్తకుండా వంట పని రెండు పూటలా చేసే కామేశ్వరమ్మ శారదకి ఇంటి పనిలో సహాయం చెయ్యక పోవడానికి కారణం ఆమెని ఉద్యోగం మాని పించే ప్రయత్నంలో ఆనంద్‌కి సహకరించడానికే. కాని శారద ఉద్యోగం మానలేదు. ఇంటెడు పని చేస్తూ అలసిపోయాను అని ఒక్కమాట కూడా అనలేదు. శారదలోని ఈ పట్టుదల ఆవిడకి మొండితనంగా అన్పించింది.

ఇన్నాళ్లూ కోడలికి ఇంటిపనిలో సహాయపడని తను ఇప్పుడు కొత్తగా సహాయపడడానికి ఆవిడ అహం అంగీకరించలేదు.

ఆవిడ ఆ సాయంకాలం కొడుకుతో చెప్పింది, "రేపు నేను పెద్దవాడి దగ్గరకి వెళ్లిపోతానురా!"



ఆనంద్ అయిష్టంగా అన్నాడు. "అప్పుడేనా? అసలు నువ్వు ఇక్కడే వుండవచ్చుగా? అన్నయ్యా దగ్గరకి వెళ్ళడం దేనికి?" అతనికి తల్లిపై ప్రేమకంటే శారదని సాధించడానికి తనకోతోడు కావాలనేది ముఖ్యం.

"ఇక్కడ నాకు కాలక్షేపం అవడంలేదురా! నువ్వు, కోడలు ఆఫీసుకి వెళ్తే బొత్తిగా తోచడంలేదు. అక్కడైతే పిల్లలున్నారు. మీ వదిన ఇంట్లోనే వుంటుంది. ఒక మాట అనుకున్నా, ఒకసారి తిట్టుకున్నా మీ వదిన పద్ధతేవేరు అంది. తనేం అన్నా శారద నోరువిప్పకపోవడం కూడా ఆవిడ దృష్టిలో తప్పుగానే వుంది. కోడలితో తగవుపెట్టుకోడానికి మించిన కాలక్షేపం లేదు ఆవిడ దృష్టిలో.

ఆనంద్ మౌనం వహించాడు శారద అటువైపు రావడం చూసి. మరునాడు తనని ట్రెయిన్ ఎక్కించడానికి వచ్చిన కొడుకుతో చెప్పిందావిడ.

"నీ పెళ్ళాం చాలా మొండిదిరా నందూ! పొంగిన పాలపై నీళ్ళు జల్లకుండా నేను, మంచినీళ్ళు కూడా చేతికి అందించమంటూ నువ్వు అతిథుల్లా కూర్చున్నా విసుగు విరామం లేకుండా ఇంటెడు పని చేస్తోంది. మనిషో యంత్రమో! దాన్ని ఉద్యోగం మాన్పించడం నీ వలన కాదు కాని, దానితో గొడవపడకు. పెళ్ళయి ఆరునెలలు కాకుండానే, మీ ఇద్దరూ గొడవ పడితే చూసేవాళ్ళకి బాగుండదు. నలుగురూ నవ్విపోతారు"

ఆనంద్ తల్లి మాటలు వింటున్నాడు కాని, అతని మనోనేత్రం ముందు శారద బియ్యం కొని తేవడం కన్పిస్తోంది. తనని డబ్బు అడగకుండా! ఎంత పొగరు! సరిపాదిస్తున్నాననేగా ఆ ధీమా! పళ్ళు కొరికాడతను.





రైలు కూతవేసి కదిలింది.

★ ★ ★

"రాధా!" రాఘవ పిలుపు విని రాధ వంటింట్లోనుంచి "వస్తున్నాను" అని బదులు పలికిందే కాని, వెంటనే ఇవతలకి రాలేదు. అతను మళ్ళీ పిలిచాడు.

రాధ విసుగ్గా బయటకి వచ్చినదల్లా అతని చేతిలోని పేకెట్టుని చూసి సంభ్రమంగా ఆగిపోయింది.

"చీర కొన్నాను. చూడు"

రాధ ముఖం సంభ్రమంతో కూడిన సంతోషంతో దీప్తివంతమయింది. అతను అందించిన పేకెట్టు చేతిలోకి తీసుకుందామె. పసుపురంగు షిఫాన్ చీర అది. మెత్తగా జారిపోతూ చూడగానే రాధ మనసుని దోచుకుంది.

"అబ్బ! ఎంత బాగుందో! మీకింత మంచి టేస్టు వుందని నాకు తెలియదు" అంది మురిపెంగా అతన్ని చూస్తూ.

"నీకు నచ్చుతుందని నాకు తెలుసు. ఆ చీర నీ ఒంటిరంగులో కలిసిపోయి నీ ఒంటిమీద అసలు చీరవుందా లేదా అనిపిస్తుంది!"

"ఛీ పొండి!" ఆమె చెంపలలో అరుణకాంతులు ప్రతిఫలించాయి.

పేకెట్టులోనుంచి పెద్దపెద్ద పసుపురంగు పువ్వుల డిజైన్ వున్న ఎరుపురంగు వాయిల్ చీర బయటపడింది.

రాధ కల చెదిరిపోయింది.

ముఖంలో రంగులు మారుతుండగా అంది. "ఛీ! ఏం బాగుందీ చీర? ఎరుపు రంగుమీద పసుపుపూలు! పైగా ఎంత ముతగ్గా వుంది! ఎంతకి కొన్నారీ చీరని! అరవై రూపాయలా, డెబ్బై రూపాయలా?"

"బాగానే గెస్ చేసావే! కరెక్టుగా డెబ్బై రూపాయలే!" రాఘవ మెచ్చుకోలుగా చూశాడు.

"ఇలాంటి దరిద్రపు చీరని ఏదో పెద్ద పట్టుచీర కొని తెచ్చినట్టు తెచ్చినది చాలక బాగుందా అని అడుగుతున్నారా? అసలు

కొనకపోతే ఎవడేడ్చాడు! నేను కట్టుకోవాలనే ఈ చీర తెచ్చారా? "

"ఆ చీర నీకు కాదు. పనిమనిషికి"

"ఏమిటీ!" రాధ నివ్వెరపోయింది. తను తొందరపడి, ఆ చీర తనకే అనుకున్నందుకు ఆమెకి సిగ్గుగా వుంది.

"పనిమనిషికా? "

"అవును... దాన్ని పనిలోకి పెట్టుకునేప్పుడు సంక్రాంతి పండుగకి చీర కొనిస్తామని చెప్పాను. కొనివ్వకపోతే అది పని మానేస్తుంది"

రాధ ఆ చీర లోపలపెట్టి వచ్చింది. ఆమెకి లోలోన అసంతృప్తిగా వుంది. పెళ్ళయిన తర్వాత వచ్చిన మొదటిపండుగకి తనకి చీర కొనకపోగా, ముందుగా పనిమనిషికి చీర కొనడం! అతను తర్వాతయినా చీర కొంటాడా లేదా అన్నది అనుమానమే! తనకి నిజంగా చీరకొనే ఉద్దేశం వుంటే మాత్రం ముందుగా పనిమనిషికి కొనడమేమిటి అసహ్యంగా"

ఆ రాత్రి అతను చెప్పాడు.

"మన పెళ్ళయ్యాక వచ్చిన మొదటి పండుగ ఇది. మీవాళ్ళు మనని ఎలాగూ పండక్కిరమ్మని పిలుస్తారు కనుక ఊరికి వెళ్తామనుకో! అయినా ఒకసారి గదులవీ బూజులు దులిపి శుభ్రంచెయ్యి"

"అలాగే!" రాధ అతను తనకి కొనబోయే చీర గురించి మాట్లాడతాడని ఎదురుచూస్తోంది. అతను ఆ విషయమే ఎత్తలేదు. కాస్సేపు అవసరంగా మేల్కొని నిద్రపోయాడు.

మరునాటి ఉదయం అతను ఆఫీసుకు వెళ్తాంటే చెప్పింది"

"సాయంకాలం పెందరాళే రండి. బజారుకి వెళ్దాం"

"దేనికి? "

"అబ్బ! తెలియనట్టు అడుగుతారేం? పండుగ దగ్గరకి వస్తోంది. మనం బట్టలు తీసుకోవద్దా? "

"ఇప్పుడు బట్టలు దేనికి? అదొక అనవసరపు ఖర్చు"

రాధ ముఖం అప్పటికే ఎర్రగా కందిపోయింది.

"మీ దృష్టిలో అన్నం తినడం కూడా అనవసరపు ఖర్చే! పండక్కి బట్టలు తీసుకోవడం అనవసరపు ఖర్చా? "

"నా దృష్టిలో అంతే! మన ఆంధ్రులకి సంక్రాంతినుంచి శివరాత్రిదాకా అన్నీ పండుగలే! ప్రతి పండక్కి బట్టలు కొనుక్కుంటే ఇంక అయినట్టే!"

"ఎన్ని పండగలకి బట్టలు కొన్నారు? మన పెళ్ళయ్యాక నాకు ఎన్ని చీరలు కొన్నారు? " రాధకి ఉక్రోషంతో ఏడుపొస్తోంది. "పండుక్కి బట్టలు కొనుక్కోనప్పుడు బూజులు దులిపి శుభ్రం చెయ్యడం మాత్రం ఎందుకు? నేను చెయ్యను"

"నువ్వు నేను చెబుతున్నది అర్థంచేసుకోడంలేదు. ఇప్పుడు మనకి బట్టలు అవసరమా? డబ్బు వేస్టు కదా!"

"అవును. బట్టలు కొనుక్కోడం వేస్టు. తిండి తినడం వేస్టు. అసలు ఊపిరి పీల్చడమే వేస్టు." ఆమె ఉద్రేకంతో అరుస్తోంది.

"పనిమనిషికి మాత్రం చీర కొన్నారు. ఎందుకంటే చీర కొనివ్వకపోతే అది పని మానేస్తుంది కనుక. నాకు చీర కొనివ్వకపోయినా, తిండిపెట్టకపోయినా నేను ఎక్కడకీ వెళ్ళనని మీ ధీమా!"

రాధ ఉద్రేకంగా అరుస్తుంటే రాఘవ ఏమాత్రం ఖాతరు చెయ్యకుండా ఆఫీసుకి వెళ్ళిపోయాడు. రాధ ఉక్రోషంతో చాలాసేపు ఏడుస్తూ కూర్చుంది. ఆమెకి మళ్ళీ సుధీర్ గుర్తుకొచ్చాడు. అతను గుర్తువస్తే రాఘవమీద ద్వేషభావం రెట్టింపవుతుంది.

పండక్కి రమ్మని రాధ తండ్రి లోకేశ్వరరావు ఉత్తరం రాశాడు.

"వెళ్దాం" అన్నాడు రాఘవ. రాధ ఏహ్యంగా, తిరస్కారంగా అతన్ని చూసింది.



"పండుగకి వెళ్తే ఆ మూడురోజులూ భోజనం ఖర్చు మిగులుతుంది. పైగా మామగారి దగ్గరనుంచి బహుమతులను పొందవచ్చుని అతని ఆశ" అనుకోగానే ఆమెకి ఒళ్ళంతా కారం రాసుకున్నట్టయింది.

"నేను రాను" అంది.

"మీ వాళ్ళింటికేగా! సరదాగా వెళ్దాం"

"నాకు ఏ సరదాలూ లేవు. నేను రాను" అంది. అనడమే కాదు, అప్పటికప్పుడు తండ్రికి పండక్కి తాము రావడంలేదని ఉత్తరం రాసింది కూడా.

కూతురి ఉత్తరం అందిన నాలుగురోజులకి లోకేశ్వరరావు కూతురు, అల్లుడు పండక్కి రానందుకు బాధపడుతున్నామని బట్టలు కొనుక్కోమని రాఘవ పేర వెయ్యి రూపాయలకి డ్రాఫ్టు తీసి పంపించాడు.

తండ్రి పంపిన ఆ డబ్బుని రాధ కళ్ళతో కూడా చూడలేదు. ఆమెకి ఆ డబ్బుపై ఆశ కూడా లేదు. ఆ డబ్బు రాఘవ బ్యాంకులో తన ఎకౌంట్‌లో వేసుకున్నాడు.

పెళ్ళి కాకముందు నాలుగంటే నాలుగే చీరలతో కాలేజీకి వెళ్తూ తోటి వాళ్ళముందు అవమానం పొందినప్పుడు ఒక్క చీరయినా కొనని తండ్రి ఇప్పుడు గొప్పగా వెయ్యి రూపాయలు పంపాడు.

పెళ్ళికాకముందు చిన్నచిన్న సరదాలు తీర్చకుండా తండ్రి బాధపెట్టాడు!

ఇప్పుడు భర్త బాధపెడుతున్నాడు! రాధకి ఏడుపొస్తోంది.

★ ★ ★

"హలో!" ఆ పలుకరింపుతో బెరుగ్గా ఆ ఇంటి మెట్లెక్కిన సునీత తల ఎత్తింది.

కళ్ళు చికిలించి నవ్వుతున్నాడు రమేష్.

ఆమె బలవంతాన రాని నవ్వుని పెదవులపైకి తెచ్చుకుంది.

"నిన్న బస్సులో ప్రయాణం బాగా జరిగిందా?"

ఆమె ముఖం ఎర్రబడిపోగా తలవంచుకుంది.

"నిన్న వెళ్ళి ఇవాళే వచ్చేశావేం?"

"వూరికేనే!" అస్పష్టంగా అంది.

"కాదు. నువ్వక్కడ వుండలేవు. నాకు తెలుసు. వెళ్ళు. వెళ్ళి స్నానం చేసి ఎ.సి. రూమ్‌లో హాయిగా పడుకో! బస్సులోని దుమ్ముధూళి అంతా నీ ఒంటిమీదే వున్నట్టుంది!"

సునీత తల దించుకుని గబగబ గదిలోకి వచ్చి పడింది. వెనుకనుంచి అతను తనని చూసి వ్యంగ్యపూరితంగా నవ్వుకుంటున్నాడని తెలుసామెకి.

తను తిరిగి రావడంతో పొరబాటు చేశానేమో అన్పిస్తోంది. మళ్ళీ అంతలోనే పుట్టిల్లు వాతావరణం గుర్తు వచ్చి మనసు ఏహ్యతతో ముడుచుకుపోతోంది. ద్వైదీభావాలతో సతమతమయిన మనసు ఆత్మాభిమానం కంటే ఐశ్వర్యంవైపే మొగ్గు చూపసాగింది.

గొప్పగా బతకాలని కాదు, తను గొప్పగా బతుకుతున్నానని నలుగురూ అనుకోవాలనే కోవకి చెందిన మనిషి సునీత.

రమేష్‌లోని పరస్త్రీ వ్యామోహం ఆమెని బాధపెడుతున్నా, అతను తనకి అందిస్తున్న స్వర్గసుఖాలను ఆమె తిరస్కరించలేకపోతోంది.

తన అందానికి మెరుగులు దిద్దుకోడానికి బ్యూటీ పార్లర్లు, తిరగడానికి ఎ.సి.కారు, ఇంట్లో పొంగిన పాలపై నీళ్ళు జల్లక్కర్లేకుండా కాఫీ కూడా చేతికి అందించే పనివాళ్ళు, కోరిన చీరలు, నగలు- వీటిమధ్య రమేష్‌లోని బలహీనత ఆమెకి చిన్నవిషయంగానే కనిపించింది.

నలభై ఏళ్ళు వచ్చిన స్త్రీ ముఖంమీద ముడతలని, పాపిట్లో నెరుస్తున్న వెంట్రుకలని పట్టించుకోనట్టే ఆమె రమేష్ ఎలా తిరిగినా పట్టించుకోవడం మానేసింది.

★ ★ ★

శారదకి భరించలేనంత నిస్సత్తువగా వుంది. ఇదివరకటిలాగా ఇంటిపని, వంట





పని చెయ్యలేకపోతోంది. కాస్త పని చేస్తే చాలు, కళ్ళు తిరిగిపోతున్నాయి. అదొక్కటే కాదు, అస్తమానూ పడుకోవాలని వుంటోంది. ఏదో మత్తుగా, వికారంగా... అన్నం తినాలని వుండడంలేదు.

ఉదయం ఎనిమిది గంటలకి ఇంకా పడుకునేవున్న భార్యని విచిత్రంగా, ఆశ్చర్యంగా చూశాడు ఆనంద్.

"ఏమిటి, ఇవాళ ఆఫీసుకి సెలవా? "

"సెలవుకాదు. నేను సెలవు పెట్టాను"

"బ్రేక్ ఫాస్ట్ చేశావా? "

"లేదు నాకు ఒంట్లో బాగా లేదు"

"సర్లే! నేను బయట ఏదో తినేస్తాను" కనీసం అతను తనకి అనారోగ్యం ఏమిటని కాని, డాక్టరు దగ్గరకి తీసికెళ్తానని కాని అనకపోవడంతో శారద మనసు చివుక్కుమంది. గాయపడి ఆమె మనసు కన్నీటి రూపంలో ప్రతిఫలించింది.

"ఎందుకా ఏడుపు? అయినా ఇంటా బయటా రెక్కలు ముక్కలు చేసుకుని చాకిరీ చెయ్యడం ఎందుకు? అనారోగ్యం కొనితెచ్చుకోడం ఎందుకు" ఆనంద్ విసుగ్గా అన్నాడు.

"కోరి ఉద్యోగం కోసం వెంపర్లాడుతున్నావ్‌గా? అనుభవించు" అతను వెళ్ళిపోయాడు. శారద చాలాసేపు వెక్కివెక్కి ఏడుస్తూండిపోయింది.

"కోరి ఉద్యోగం చేస్తున్నావ్‌గా! అనుభవించు" అతని మాటలు చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి. అదే అతని ముందు తను చెయ్యి జాపి డబ్బుకోసం అర్ధిస్తే అతని అహం చల్లారి వుండేది.

అలా చెయ్యకుండా తనకంటూ కొంత డబ్బు సంపాదించుకుంటే అతని మగతనాన్ని తను కించపరుస్తున్నట్టు అదేదో పెద్ద అవమానంగా భావిస్తున్నాడు!

దుఃఖోపశమనం తరువాత మనసు తేలికయ్యె స్థిమితపడింది. లేచి స్నానం చేసి అన్నం వండుకుని, కూర చేసే ఓపిక లేక పచ్చడితో తింది. తిన్న పావుగంటలోనే అంతా వాంతి అయిపోయింది.

రెండురోజులు నీరసంతో ఆఫీసుకు వెళ్ళని శారద ఆ రోజు కాస్త బలంపుంజుకుని ఆఫీసుకు వెళ్ళింది. లంచ్ అవర్‌లో తిన్నదంతా వాంతిచేసుకుంటున్న ఆమెని చూసి కొలీగ్ రమ కళ్ళు చికిలించి నవ్వుతూ అడిగింది.

"ఏమైనా విశేషమా? "

శారద నవ్వేసి తలదించుకుంది. "తెలియదు"

"డాక్టరు దగ్గరకి వెళ్ళలేకపోయారా? "

"తోచలేదండీ! అసలా అనుమానమే లేదు. మూడేళ్ళవరకు పిల్లలు వద్దనుకున్నాం"

"ఇంటిదగ్గర ఎవరైనా పెద్దవాళ్ళున్నారా? "

"మా అత్తగారు ప్రస్తుతం మా దగ్గర లేరు!"

"కావాలంటే నేను నాకు తెలిసి వున్న గైనకాలజిస్ట్ దగ్గరకి తీసికెళ్తాను!"

"థ్యాంక్యూ!" శారద హృదయపు లోతుల లోనుంచి కృతజ్ఞతతో కూడిన ఆ చిన్న మాట ధ్వనించింది.

మరునాడు సాయంకాలం ఆఫీసునుంచి రమ సాయంతో హాస్పిటల్‌కి వెళ్ళింది శారద.

డాక్టరు పరీక్షలు చేసి తను గర్భవతి అని చెప్పగానే ఆమెకి తలపై పిడుగుపడ్డట్టయింది.

"తను గర్భవతి! ఇదెలా సంభవం? మూడేళ్ళవరకు పిల్లలు వద్దని, కుటుంబనియంత్రణని పాటించాలని భర్త నిర్ణయం! అతను కుటుంబనియంత్రణని పాటిస్తుండగా, తనకి గర్భం రావడం! ఆలోచిస్తున్న ఆమెకి చప్పున అనుమానం వచ్చింది. తనని ఉద్యోగం మానిపించే ప్రయత్నాలలో ఇదీ ఒక భాగమేమోనని.

ఆమెకి ఆనంద్‌పై కోపం రాలేదు. అతని

మూర్ఖత్వానికి జాలివేసింది. అతను తనని ఉద్యోగం మాన్పించే ప్రయత్నాలను చూసి అసహ్యం వేసింది.

పిల్లలు పుడితే తను ఉద్యోగం మానేస్తుందని అతని ధీమా!

వేవిళ్ళతో, నెలలు నిండేకొద్దీ గర్భిణికి సహజంగా వచ్చే చిన్నచిన్న అనారోగ్యాల వలన తను ఉద్యోగం మానేస్తుందని అతని నమ్మకం!

కేవలం తను ఉద్యోగం మానెయ్యాలనే అతను పెళ్ళయిన ఆరునెలలకే తనని తల్లిని చెయ్యబూనాడు.

"కంగ్రాచ్యులేషన్స్!" అంది రమ.

"థాంక్స్" అంది శారద. ఆమెకి ఆక్షణంలో ఆనంద్ తనపై సాధించిన విజయం గుర్తునస్తోంది.

అంతకంటే "నాకు పిల్లలు కావాలి శారదా!" అని అడిగితే సంతోషంగా అంగీకరించేది.

తనని అతను చాలా క్రూరంగా వంచించాడు. మాటలమధ్య ఆనంద్ బ్యాంకు ఉద్యోగి అని తెలుసుకున్న రమ అంది.

"నేను చనువు తీసుకుంటున్నానని మీరు అపార్థం చేసుకోకపోతే ఒక విషయం అడగనా? ఈ సమయంలో మీకు బాగా రెస్టు అవసరం. అటు ఇంట్లోను, ఇటు ఆఫీసులోను పనిచేసి మానసికంగా, శారీకంగా అలసిపోవడమెందుకు? మీరు ఉద్యోగం చెయ్యకపోతే ఇల్లు గడవని పరిస్థితేమీ కాదుగా? "

"నిజమే రమా! మీరన్నట్టు నేను ఉద్యోగం చెయ్యకపోతే ఇల్లు గడవని పరిస్థితి కాదు మాది. కాని, 'నాది' అనే సంపాదన ఇచ్చే తృప్తి కోసం, నా భర్త దగ్గర మూడు రూపాయల తిలకం సీసా కోసం, కరివేపాకు కొనడానికి అర్థరూపాయికోసం చెయ్యి జాచే అవసరం రాకుండా నేనీఉద్యోగం చేస్తున్నాను" అంది శారద ఎటో చూస్తూ.

"మీ పరిస్థితికి పూర్తిగా వ్యతిరేకం నాది. నా భర్త బలవంతంపై నాకు ఇష్టం లేకపోయినా నేనీఉద్యోగం చేస్తున్నాను"

"అంటే!" అర్థంకాక అడిగింది శారద.

"ఉద్యోగం చేసే పరిస్థితి కాదు నాది. నాకు ఇద్దరు ఆడపిల్లలు. పెద్దది రెండవతరగతి, చిన్నది ఎల్. కె. జి చదువుతున్నారు. ఇద్దరు చిన్నపిల్లలని స్కూలుకి తయారు చేసి, మా ఆయనకి, నాకు లంచ్ బాక్సులు కట్టుకుని, నేను ఆదరాబాదరా తెమిలి ఆఫీసుకు రావాలి. మళ్ళీ సాయంకాలం ఇంటికి వెళ్ళి పిల్లల హోమ్‌వర్కు వంటపని పగలు క్లీన్‌చెయ్యని వంట గది క్లీన్ చేసి పడుకునే సరికి రాత్రి పదకొండు! మళ్ళీ తెల్లవారి అయిదు గంటలకే నిద్రలేవాలి. ఇంత చేసి నేను సంపాదించే డబ్బు మీద నాకు హక్కు లేదు. జీతమంతా తీసేసుకుని, బస్సు ఛార్జీలకి సరిపడా డబ్బు ముష్టి విదిల్చినట్టు విదిలిస్తాడు నా భర్త! నేను ఖర్చుపెట్టే ప్రతి రూపాయికి లెక్క చెప్పవలసిందే" రమ కళ్ళలో నీళ్ళూరుతున్నాయి.

"ఆర్థికస్వాతంత్ర్యం అంటూ వెర్రెక్కి ఉద్యోగంకోసం ఎగబడుతామే గాని ఈ ఆడ బతుక్కి స్వాతంత్ర్యం ఎక్కడ? అటు మనం తెచ్చిన కట్నం డబ్బు మనది కాదు. ఇటు 'నాది' అనే సంపాదన వున్నా స్వతంత్రం లేని దురదృష్టం"

శారద తడికళ్ళతో వింటోంది. రమ స్వరంలోని నిస్సహాయత ఆమె మనసుని కోస్తోంది. అది రమ ఒక్కదాని స్వరంలా లేదు. ఈ ప్రపంచంలో ఎందరో స్త్రీల ఆర్తనాదంలా వుంది. ఆనంద్‌కి తను ఉద్యోగం చెయ్యడం ఇష్టం లేదు! ఎందుకంటే అతని ముందు తను చెయ్యిజాపి డబ్బులడిగే పరిస్థితిలో లేదు కాబట్టి. తను ప్రతిపైసా అతన్ని దేవిరిస్తేనే అతనికి తృప్తి!

ఎక్కడుంది లోపం? ఈ వ్యవస్థలోనా? తను తల్లి కాబోతోందనే వార్తని సినిమాలోలాగా శారద ఆనంద్‌కి చెప్పలేదు. అది





దాచగలిగే రహస్యం కాదు కాబట్టి అతనే తెలుసుకున్నాడు. పెద్దగా ఆనందాన్ని ప్రకటించలేదు.

కాని శారద అడిగింది.

"మీకు ఆనందంగా లేదూ?"

ఆ ప్రశ్నలో "మీరు అనుకున్నది సాధించగలిగారు అనే ఆనందం లేదూ" అనే శ్లేష వుంది.

ఆనంద్ ముఖం చిట్లించాడు.

"ఆనందం ఎందుకు? ఇదేమైనా పెద్ద ఘన కార్యమా?"

నిజానికి చాలా ఆనందంగా వుందతనికి. శారదచేత ఉద్యోగం మానిపించే ప్రయత్నంలో కొత్త ఆయుధం దొరికినందుకు.

రెండురోజులపాటు శారద వేవిళ్లతో, నీరసంతో లేవలేక ఇంటిపట్టునే వుండడంతో అతని ఆనందం రెట్టింపయింది. మరో రెండురోజుల తర్వాత ఆఫీసుకి బయలుదేరడం చూసి ఆ ఆనందం ఆవిరయిపోయింది. అసహాయంగా పళ్లు కొరుక్కున్నాడతను.




శారద బస్‌స్టాపులో నిలబడివుంది. పైన ఎండ తీవ్రంగా వుంది. ఉదయం తొమ్మిది గంటలే అ[illegible] [illegible]ంచలేనంత వేడిగా వుంది. శారద చెయ్యెత్తి మధ్య మధ్య టైము చూసుకుంటూ బస్సుకోసం అసహనంగా నిరీక్షిస్తోంది.

బస్సు వచ్చింది. అందరికంటే చివరగా బస్సు ఎక్కిందామె. బస్సు ఎక్కుతుండగా కడుపులో కలుక్కుమన్నట్టయింది. ఆమె సీటు వెతుక్కుని కూర్చుంది. చిన్నగా మొదలయిన ఆ నెప్పితో శారదకి భయం వేసింది.

"సాయంకాలం మళ్లీ డాక్టరు దగ్గరకి వెళ్ళాలి" అనుకుంది. ఆఫీసులో అరగంట కంటే పని చెయ్యలేకపోయింది. చిన్నగా మొదలయిన ఆ నెప్పి అంతకంతకు ఉధృతమవసాగింది.

టేబిల్ మీద తలవాల్చి కళ్లు మూసుకుని బాధని బలవంతాన అణచుకోడానికి ప్రయత్నిస్తున్న శారదని రమ ఆదుర్దాగా కుదిపింది.

"ఏమయింది శారదా!"

"కడుపులో నెప్పిగా వుంది"

"కడుపులోనా? ఎక్కువగా వుందా?"

"ఎక్కువగానే వుంది"

"హాస్పిటల్‌కి తీసికెళ్తాను వుండు" రమ సెక్షన్ ఆఫీసర్ దగ్గరకి వెళ్ళి పర్మిషన్ తీసుకుని శారదని తీసుకుని ఆటోలో బయలుదేరింది.

శారదని పరీక్షించిన డాక్టరు బయటకి వచ్చి రమతో చెప్పింది.

"ఆమెకి బ్లీడింగ్ కూడా అవుతోంది. ఈ గర్భం నిలవదు"

"అయ్యో!" అంది రమ ఆందోళనగా.

"మీరు ఆమెకి ఏమవుతారు?"

"స్నేహితురాలిని"

"ఆమె భర్తని పిలిపించండి"

రమ దడదడలాడుతున్న గుండెతో నిస్తేజంగా ఫోన్ దగ్గరకి నడిచింది.



శారద దిండులో తల దాచుకుని అసహాయంగా ఏడుస్తోంది.

"వూరుకో శారదా! ఏం చేస్తాం? మరోసారి చక్కటి బాబు పుడతాడు" రమ ఓదారుస్తోంది.

తలుపు తోసిన శబ్దం విని ఇద్దరూ అటు

చూశారు. లోపలకి వస్తున్న ఆనంద్‌ని చూడగానే ఆమె దుఃఖం రెట్టింపయింది.

"ఎంతిచ్చావు డాక్టరుకి? " వస్తూనే అతన డిగిన ఆ ప్రశ్న ఆ ఇద్దరికీ అర్థం కాలేదు.

"ఇవాళ్టికి హాస్పిటల్‌లోనే వుంచి, రేపు డిశ్చార్జి చేస్తానన్నారు. బిల్ రేపు కట్టవచ్చు' ' మెల్లిగా చెప్పింది రమ.."నేను ఆఫీసుకి వెళ్తాను. మీరు శారద దగ్గర వుంటారుగా"

"అలాగే" అతనామెవైపు చూడకుండానే అన్నాడు. రమ బయటికి నడిచింది "నేను మళ్ళీ సాయంకాలం వస్తాను" అంటూ.

శారదని హాస్పిటల్‌లో చేర్పించినందుకు కనీసం తనకి థ్యాంక్స్ కూడా చెప్పని ఆనంద్‌పై ఆమెకి సదభిప్రాయం కలగలేదు.

ఏడుస్తున్న శారదవైపు ఏహ్యత, తిరస్కారం మిళితమైన చూపులతో చూస్తూ అన్నాడు.

"మొత్తానికి నువ్వనుకున్నది సాధించుకున్నావుగా? ఇంకా ఆ ఏడుపెందుకు? "

శారద అయోమయంగా చూసింది.

"పిల్లలు పుడితే నీ స్వేచ్ఛకి అడ్డు అని, ఉద్యోగం మానెయ్యవలసివస్తుందని, అబార్షన్ చేయించుకున్నావ్‌గా? ఆ కల్లబొల్లి ఏడుపులెందుకు? "

"నేను అబార్షన్ చేయించుకున్నానా? ఎవరు చెప్పారు? " శారద ఏడవడం మరచిపోయి వెర్రిగా చూస్తోంది.

"జరిగినదాంట్లో నీ ప్రమేయం ఏమీలేదు, అంతా విధి అని నమ్మమంటావా? " వ్యంగ్యంగా అన్నాడు.

శారద హతాశురాలయింది. తనకి పిల్లలంటే అయిష్టంలేదు. కాకపోతే కొన్నాళ్ళు ఆగి తర్వాత పిల్లలని కనాలనుకుంది. తన ఇష్టంతో కాకపోయినా, తన కడుపులో ఊపిరిపోసుకుంటున్న ఇంకా రూపం దాల్చని ఆ మాంసపుముద్దపై ఎన్ని ఆశలు పెంచుకుంది? తను కావాలని అబార్షన్ చేయించుకుందని నింద మోపుతున్న ఇతన్ని ఎలా నమ్మించగలదు? శారదకి అతనితో వాదించే ఓపిక లేదు. అసలు మాట్లాడాలనీ అన్పించలేదు.

గోడవైపుకి తిరిగి నిశ్శబ్దంగా పడుకుంది. కొద్దిసేపు నిశ్శబ్దం తర్వాత ఆనంద్ అన్నాడు

"రేపు డిశ్చార్జి చేస్తారుట"

"అవును. ఇందాకా రౌండ్స్‌కి వచ్చినప్పుడు డాక్టర్ చెప్పారు" అంది.

"నీకు సాయంగా వుండడానికి రమ్మని అమ్మకి ఉత్తరం వ్రాద్దామనుకున్నాను. తనకి మనవడో, మనుమరాలో పుట్టబోతున్నారని ఆవిడ ఎన్నో ఆశలు పెంచుకుంది. ఇప్పుడు నీకిలా అయిందని తెలిసి ఆవిడ తట్టుకోలేదు. అందుకే ఆవిడకి ఉత్తరం వ్రాయలేదు. కావాలంటే మీ అమ్మగారిని పిలిపించుకో"

శారదకి అతను అంటీ ముట్టనట్టుగా మాట్లాడుతుంటే దుఃఖం వస్తోంది.

సుఖాన్ని చెరిసగం పంచుకున్నారు కాని బాధని, దుఃఖాన్ని మాత్రం తను ఒక్కర్తే అనుభవిస్తోంది. పైగా కావాలని అబార్షన్ చేయించుకుందనే నిందని మోస్తోంది. ఆమె కళ్ళలో మళ్ళీ నీళ్ళూరాయి.

హాస్పిటల్‌నుంచి శారద డిశ్చార్జి అయి ఇంటికి వచ్చేప్పటికి ఆనంద్ ఇచ్చిన టెలిగ్రామ్ అందుకున్న జానకి వచ్చివుంది. నీరసంతో పాలిపోయివున్న కూతుర్ని చూడగానే కన్నీళ్ళు పెట్టుకుంది. వారంరోజులు గడిచాయి.

తల్లి సపర్యల మధ్య శారద త్వరగానే కోలుకుంది.

"నేను బాగానే వున్నాను కదమ్మా. నువ్వు వెళ్ళిపో. అనవసరంగా ఆఫీసుకి సెలవు పెట్టడం ఎందుకని" అంది.

జానకి ముఖం తిప్పుకుంది. "నేను ఆఫీసుకి వెళ్ళే అవసరం లేదులే ఇంక"

"ఉద్యోగం మానేశావా? " శారద అదిరిప




డింది.

"అవును"

"ఎందుకని? "

"మీ నాన్నగారు మానెయ్యమన్నారు"

"ఎందుకని? "

"పోయిన నెలలో మీ నాన్నగారు రిటైర య్యారు. తెలుసుగా? "

"తెలుసు"

"అందుకే నన్ను ఉద్యోగం మానెయ్యమన్నారు"

"నాన్నగారి రిటైర్‌మెంటుకి, నువ్వు ఉద్యోగం మానెయ్యడానికి సంబంధం ఏమిటమ్మా? "

"తను ఇంట్లో కూర్చుని వుండగా, నేను ఉద్యోగం చెయ్యడం అవమానంగా, చిన్నతనంగా భావించారు మీ నాన్నగారు. నన్ను ఉద్యోగం మానెయ్యమని శాసించారు. జానకి స్వరం గాద్గదికంగా వుంది. "ఇన్నేళ్లు ఉద్యోగం చేసి మాత్రం నేను సాధించగలిగింది ఏముంధి శారదా? తెచ్చిన జీతమంతా ఆయన చేతిలో పోసి నాకంటూ ఒక పైసా మిగుల్చుకోక ఆయనముందు చెయ్యి జాపుతూ ఛీఛీ... ఏం బ్రతుకు నాది! అసలు నేనే ఉద్యోగానికి రిజైన్ చేద్దామనుకున్నాను. రోగీ పాలే కోరాడు వైద్యుడూ పాలే ఇమ్మన్నాడన్నట్టు మీ నాన్నగారు మానెయ్యమన్నారు. మానేశాను. పూర్వకాలంలో భర్త చనిపోతే భార్యని కూడా సహగమనం చేయించేవారు. నేను ఉద్యోగం మానెయ్యడం కూడా సహగమనమే. నా వ్యక్తిత్వాన్ని, అస్థిత్వాన్ని నా రాజీనామాతో సహగమనం చేశాను"

అప్పుడు ఏడ్చింది శారద. తల్లి ఒడిలో తలపెట్టుకుని కదిలి కదిలి ఏడ్చింది.

"స్త్రీ ఆర్థికంగా బలహీనురాలిగా వుండవలసిందేనా? ఆమె అతడిపై ఆధారపడినరోజు తప్ప అతని అహం చల్లారదా? " శారదలోని ఆవేదన అశ్రురూపంలో వెలువడుతోంది.

★ ★ ★

ఇంటిముందు కారు ఆగింది. కారులో నుంచి దిగిన ఆ నడివయస్కుడు సరాసరి లోపలకి వస్తూ రాధని అడిగాడు.

"మా రాఘవ వున్నాడామ్మా? "

"వున్నారు. కూర్చోండి" అని లోపలకి వెళ్ళి భర్తని పిలుచుకువచ్చింది.

"నువ్వా పెదనాన్నా! ఎలా వున్నావ్? " రాఘవ ఆప్యాయంగా పలుకరించాడు.

"నేను బాగానే వున్నానురా! రేపు మా మనుమడు అదే మా శ్రీకాంత్ కొడుకు పుట్టినరోజు. నువ్వు, కోడలు సాయంకాలం పార్టీకి రావాలి!"

"అలాగే పెదనాన్నా!"

కాఫీ తెచ్చిన రాధని ఆప్యాయంగా చూస్తూ "అమ్మాయ్! వీడు ఆఫీసుపని అని, అదని, ఇదని లక్ష సాకులు చెబుతాడు వూరుకోకు. చెవి పుచ్చుకుని మా ఇంటికి లాక్కునిరా" అన్నాడాయన.

రాధ నవ్వేసింది. ఆయన వెళ్ళాక అడిగింది.

"ఆయన మీకు పెదనాన్న అవుతారా? "

"అవును"

"స్వంత పెదనాన్నేనా? "

"కాక? అద్దె పెద్దనాన్నలు కూడా వుంటారా? " నవ్వేడు.

"అదికాదు. మీకింత దగ్గర బంధువు అయివుండీ మన ఇంటికి ఒక్కసారైనా రాలేదేం? పోనీ, మనమైనా వెళ్ళవచ్చునుగా? "

"ఆయన ఇప్పుడు వచ్చాడుగా? రేపు మనం వెళ్తున్నాంగా? "

"వీళ్లు మన పెళ్ళికి రాలేదా? "

"రాలేదు. అప్పుడు వీళ్లు అమెరికాలో వున్నారు"

తన భర్తకి స్వయానా పెదనాన్న అంతటి శ్రీమంతుడంటే ఆమెకి గర్వంగా వుంది.

మరునాడు రాధ పెళ్లినాటి పట్టుచీర

కట్టుకుని, శ్రద్ధగా అలంకరించుకుని, భర్తతో బయలుదేరింది. అణువణువునా ఐశ్వర్యం వెల్లివిరిస్తున్న ఆ ఇళ్లు కేవలం సినిమాలలో చూసిందేమో! ఆ క్షణంలో ఆమెకి సుధీర్ గుర్తువచ్చాడు. సుధీర్‌ని పెళ్లి చేసుకుని వుంటే తను కూడా ఇలాంటి ఇంట్లోనే వుండేదేమో. అసూయ ఆమె మనసుని మెలిదిప్పింది.

"రండి, ఏమిటింత ఆలస్యం?" రాఘవ పెద్దమ్మ ఆప్యాయంగా ఆహ్వానించింది. రాధ చిరునవ్వుతో లోపలకి నడిచింది. ఒక్కసారిగా అక్కడున్న అందరి కళ్ళూ ఆమెవైపు తిరిగాయి.

ఖరీదైన నగలు, చీరలు, రకరకాల అలంకరణలతో వున్న స్త్రీలు... రాధకి వేరే ప్రపంచంలోకి వచ్చినట్టువుంది.

"ఏమిటి ఇంకా ఆలస్యం? పార్టీ మొదలు పెట్టవచ్చుగా?" అడుగుతున్నారెవరో.

"ఇంకా రమేష్‌గారు, భార్య రావాలి" చెబుతోంది. రాఘవ పెద్దమ్మ.

ఆవిడ ఎదురుచూస్తున్న ఆ రమేష్ ఎవరా అని కుతూహలంగా చూస్తున్న రాధ కళ్లు వెడల్పయ్యాయి. అప్పుడే అక్కడకి వచ్చిన రమేష్‌ని చూసి కాదు అతని భార్య సునీతని చూసి...

ఒకప్పటి తన స్నేహితురాలు సునీత!

ఖరీదైన టిష్యూ చీరెతో, మ్యాచింగ్ నగలతో, డబ్బు తెచ్చిన హుందాతనంతో వున్న సునీత.

అసూయా ద్వేషాలతో రాధ మనసు మండిపడుతోంది. సునీత కంటపడ కుండా అక్కడనుంచి అదృశ్యమయిపోవాలని వుందామెకి. కాని చుక్కల మధ్య వెలుగుతున్న చందమామలా వున్న రాధని సునీత చూడనే చూసింది. సంభ్రమంతో ఆమె కళ్లు వెడల్పయ్యాయి. ఒక్క చూపులోనే రాధని నఖశిఖ పర్యంతము పరీక్షగా గమనించిన సునీతకి తను ఆమెకంటే పైమెట్టుమీద వున్నాననే నమ్మకం కలిగింది. తనకంటే అందగత్తె అయిన రాధ తనకంటే తక్కువ స్థితిలో వుంది. సునీతలోని అహం, పడగ విప్పింది. ఆమె వయ్యారంగా, హుందాగా నడుస్తూ రాధ దగ్గరకి వచ్చి గభాల్న ఆమెని కౌగలించుకుంది.

"ఎన్నాళ్ళకెన్నాళ్లకి రాధా? ఎలా వున్నావ్? మీవారు కూడా వచ్చారా?" అంటూ అవసరమైన దానికంటే ఎక్కువ ఆప్యాయతని ప్రదర్శించింది.

రాధకి ఆమెని చూస్తే ఒళ్ళంతా కారం రాసుకున్నట్టుంది. పైకి మాత్రం నవ్వుతూ అంది.

"మావారు కేంప్‌లో వున్నారు" అంది దూరంగా పార్టీకి జరుగుతున్న ఏర్పాట్లని పర్యవేక్షిస్తున్న రాఘవని ఓరకంట చూస్తూ.

ఇంతలో అక్కడకి వచ్చిన రమేష్‌ని రాధకి పరిచయం చేసింది. రాధ సౌందర్యాన్ని చూడగానే రమేష్ కళ్లు చెదిరిపోయాయి.

"మా ఇంటికోసారి రండి" అన్నాడు మర్యాదగా. సునీతవైపు తిరుగుతూ, "నీ ఫ్రెండ్‌కి మన ఎడ్రస్ ఇచ్చావా? లేకపోతే వచ్చే ఆదివారం వాళ్లింటికి కారు పంపు" అన్నాడు. సునీత భర్త అన్నదానికి జవాబి చ్చేలోగా రాధ అంది చటుక్కున.

"ఫర్వాలేదండీ! ఎడ్రస్ ఇస్తే మేమే మీ ఇంటికి వస్తాం"

రమేష్ తన విజిటింగ్ కార్డు తీసి సునీత కిచ్చాడు. ఆమె తనకందించిన ఆ కార్డుని రాధ నిరాసక్తంగా తన పర్సులో వేసుకుంది.

పార్టీ మొదలయింది. అక్కడ సునీత రమేష్‌లకి జరుగుతున్న రాజమర్యాద చూస్తే రాధ మనసు ఉడికిపోతోంది. సునీతతో తన భర్త పార్టీకి రాలేదని అబద్ధం చెప్పిన రాధ అతను తన పక్కకి రాకుండా, తనని పలుకరించకుండా జాగ్రత్తపడింది. ఆహూతుల మధ్య అంతటా తనై తిరుగుతూ అందరికీ అన్నీ అందుతున్నాయో




లేదో గమనిస్తున్న రాఘవ అసలు రాధ ఎక్కడున్నదీ పట్టించుకోలేదు.

రమేష్ తనని చూపులతోనే తినేస్తుండడం గమనించిన రాధకి ఇంచుక గర్వంతో బాటు అతనిపై ఏహ్యాభావం కూడా కలిగింది.

ఇంటికి వస్తుండగా రాధ రాఘవతో అంది. "మీరు అక్కడ పనంతా మీ నెత్తిమీదనే వేసుకున్నారేమిటి? మీకేమిటి? మీకేం సంబంధం? నలుగుర్నీ పిలిచినట్టే మనని పిలిచారు? " ఆమె స్వరం తీవ్రంగా వుంది.

"పెదనాన్న ఒక్కరూ అంతా చూసుకుంటున్నారని"

"పెదనాన్న! ఎంతసేపూ మీ వెంపర్లాటే కాని, ఆయనకి అసలు మనం తిన్నామో లేదో కూడా పట్టింపులేదు" సునీత, రమేష్‌లు రాగానే రాఘవ పెద్దమ్మ వాళ్ళకిచ్చిన వి. ఐ. పి. ట్రీట్‌మెంటు గుర్తుకొస్తుండగా కసిగా అంది.

"మనం బంధువులం. మనని మర్యాద చెయ్యనవసరంలేదు. వాళ్లు బయటివాళ్లు" తేలిగ్గా అన్నాడు.

"మనకీ ఒక కారు, బంగ్లా వుండివుంటే మనకి కూడా అడుగులకి మడుగులొత్తేవారు"

రాఘవ మాట్లాడలేదు.

అదే సమయానికి రమేష్ తన పక్కనే కూర్చున్న సునీతతో అంటున్నాడు కారు డ్రైవ్ చేస్తూ.

"నీ ఫ్రెండ్ పేరేమిటి? "

"రాధ" అతనెందుకా ప్రశ్న అడుగుతున్నాడో ఊహించిన సునీత పొడిగా అంది.

"బ్యూటీఫుల్! నీకు అంత అందమైన ఫ్రెండ్ వుందని నాకెప్పుడూ చెప్పలేదేం? "

"చెబితే ఏం చేసేవారు"

"నీ ఫ్రెండ్‌ని ఆరునెలల్లోగా నా ఫ్రెండ్‌గా మార్చుకునేవాడిని"

"ఇప్పుడు తెలిసిందిగా? ట్రై చెయ్యండి" సునీత నవ్వుతూనే అన్నా అంతర్లీనంగా పదును ధ్వనించింది.

"అసూయపడుతున్నావా? " నవ్వేడతను.

సునీత ముఖం తిప్పుకుంది.

"నీకంటే ముందు రాధ నాకు కన్పించి వుంటే బాగుండేది"

ఈర్ష్యాగ్ని జ్వాలలతో మండుతున్న సునీత మనసులో మరో సమిధ వేసినట్టయింది.

★ ★ ★

మరోవారం రోజుల తరువాత శారద ఆఫీసుకి వెళ్ళింది. రమ నవ్వుతూ పలకరించింది.

"ఎలా వుంది ఒంట్లో? "

"బాగా కోలుకున్నానండీ!" చెప్పింది.

ఆఫీసుకి అరగంట ఆలస్యంగా వచ్చి సెక్షన్ సూపరింటెండెంట్ చేత చివాట్లుతిని తన సీట్లో కూర్చుని, కన్నీళ్లు వత్తుకుంటున్న నీరజని అడిగింది రమ.

"ఎలా వుంది నీరజా, మీ పాపకి? "

ఆమె కళ్ళలో మళ్లీ నీళ్లూరాయి. "రాత్రి చచ్చిపోతుందనుకున్నామండీ! ఒకటే వాంతులు, విరేచనాలు. మా వారిని ఆఫీసుకి సెలవు పెట్టమంటే పెట్టరు. నాకేమో సెలవులు అయిపోయాయి. రాత్రంతా హాస్పిటల్‌లోనే వున్నాం. పిల్ల ఏమయిపోయిందోనని ఆందోళన. తెల్లవారి వంట వండుకుని ఇంత తిని మా పొరుగింటామెని బతిమాలి పాప దగ్గర కూర్చోబెట్టి ఇలా ఆఫీసుకి వచ్చాను"

"ఏమయింది మీ పాపకి? " అడిగింది శారద. నీరజకి ఎనిమిదినెలల పాప వుందని, పాపని క్రెష్‌లో వుంచి ఆమె ఆఫీసుకి వస్తుందని తెలుసు శారదకి.

"ఆయా పాప ఏడుస్తోందని పాలు కలిపిందట. పాప సగం పాలు తాగి మిగిలినవి వదిలేసింది. ఒక గంటపోయాక పాప మళ్ళీ ఏడిస్తే ఆ పాలే పట్టించిందట. ఆ

పాలు పులిసిపోయి విరిగిపోయివున్నాయి. అప్పటినుంచి పాపకి వాంతులు, విరేచనాలు. ఇంటి దగ్గర వుండి పాపని చూసుకోవాలని వుంది. నేను ఉద్యోగం చెయ్యకపోతే ఇల్లు గడవని పరిస్థితి ఏమీకాదు. అయినా, మా ఆయన నేను ఉద్యోగం చెయ్యకపోతే వూరుకోరు." నీరజ పనిచేస్తున్నంతసేపూ కళ్లు తుడుచుకుంటూనే వుంది.

ఆమెను చూస్తే శారద మనసు ద్రవించింది. ఆ సాయంకాలందాకా అన్యమనస్కంగా పనిచేసిన శారద మనసులో ఒక ఆలోచన రూపుదిద్దుకుంది.

ఆ ఆలోచన నిర్ణయంగా మారడానికి మరో వారంరోజులు పట్టింది. పదిరోజుల తరువాత ఆమె ఉద్యోగానికి రిజిగ్నేషన్ ఇచ్చింది.

★ ★ ★

బాబుకి డైపర్ మారుస్తోంది శారద.

ఆ బాబు కాళ్లూ చేతులు ఆడిస్తూ నవ్వుతూ కేరింతలు కొడుతున్నాడు. ఆరునెలల వయసు వాడికి. తల్లితండ్రులిద్దరూ ఉద్యోగస్థులే. నీరజ పాపకి పాలుపట్టించి నిద్రపుచ్చి ఏడాదిన్నర వయసున్న టింకూకి, అదే వయసున్న బబ్లూకి బిస్కెట్లు ఇచ్చి, బొమ్మల పుస్తకాలు వాళ్ళముందరే పెట్టి వాళ్లచేత బొమ్మలను గుర్తుపట్టించి పేర్లు చెప్పించింది.

బేబీకేర్ సెంటర్‌ని పెట్టాలని ఆలోచన రాగానే ఆమె మొదట చేసిన పని తమ పోర్షన్‌కి ఆనుకుని వున్న మరో పెద్ద గదిని అద్దెకి తీసుకోవడం.

మొదట్లో నలుగురు చంటిపిల్లల బాధ్యత తను స్వీకరించిన శారదకి కొంచెం కష్టంగానే వుండేది. అందులోనూ ఇద్దరు మరీ పసిపిల్లలు. వాళ్లు ఎందుకు ఏడుస్తున్నారో తెలియక, గాభరా పడేది.

ఎత్తుకుని ఆడిస్తే తప్ప నీరజ పాప వూరుకునేది కాదు. సహనశీలి అయిన శారద పిల్లలని జాగ్రత్తగా సంరక్షించడం వల్లనైతేనేమి తను డబ్బు తీసుకుంటోంది కనుక పిల్లలని చూస్తోంది అనే భావం ఆమెలో లేకపోవడంవల్లనైతేనేమి పిల్లలు ఆరోగ్యంగా, శుభ్రంగా వుండేవారు.

నెలరోజులు గడిచేసరికల్లా మరో నలుగురు పిల్లలు పెరిగారు. శారద తనకి సహాయంగా వుండడానికి ఒక ఆయాని నెలజీతానికి పెట్టుకుంది.

ఆనంద్‌కి శారద ఉద్యోగానికి రిజైన్ చెయ్యడం ఆనందాన్ని కలిగించినా ఆమె ఇంటి దగ్గర బేబీకేర్ సెంటర్‌ని పెట్టబోతోందని తెలిసి ఆ ఆనందం మటుమాయమై ఆగ్రహం కలిగింది.

"ఇంటిని అనాథ సేవాసదనంగా మార్చబోతున్నావన్నమాట" వ్యంగ్యంగా అన్నాడు.

"బేబీకేర్ సెంటర్‌కి తెలుగులో మీరన్నది సరైన అర్థం కాదనుకుంటాను" శారద నవ్వుతూనే అంది. ఆనంద్ రెచ్చిపోయాడు. "ఏ కులమో తెలియని పిల్లల మలమూత్రాలను ఎత్తిపోసేంత నీచానికి దిగజారిపోయావన్న మాట!"

శారద సహనాన్ని కూడదీసుకుంటూ అంది. "నేను కేవలం డబ్బుకోసమే ఈ పని చెయ్యడంలేదు. నేను చెయ్యబోయే పనిలో ఆత్మసంతృప్తి వుందని నమ్ముతున్నాను" అంది, తన నిర్ణయాన్ని ఎవరూ మార్చలేరని స్పష్టంచేస్తూ.

★ ★ ★

కామేశ్వరమ్మ ఊరినుంచి వచ్చింది. వస్తూనే ఇంట్లోనుంచి పసికందు ఏడుపు విని, "ఎవరా ఏడ్చేది?" అనడిగింది.

శారద చెప్పింది. ఆవిడ నిర్ఘాంతపోతూ విని, తన ఏహ్యతను, తిరస్కారాన్ని ముఖంలో కనబరుస్తూ ఛీత్కారంగా అంది.

"డబ్బుకోసం ఆయాగా పనిచేస్తున్నావన్న మాట"

శారద మాట్లాడలేదు.

"నువ్వసలే వట్టి మనిషివి కూడా కాదు.

ఎందుకొచ్చిన బాదరబందీ! ఏ కులమో తెలియని ఆ పిల్లల మలమూత్రాలు ఎత్తుతూ, వాళ్ళకి పాలు పడుతూ, ఛీఛీ! ఎందుకొచ్చిన కర్మ!"

శారద మౌనంగా వింటోంది.

"ఏ కులమో తెలియని పిల్లలు!" చదువుకోని అత్తగారే కాదు చదువుకున్న భర్త కూడా అదేమాట!

"అయినా పసిపిల్లలకి కులమేమిటి? ఈ మనుషులలో మార్పు రాదా? " శారద గబగబ ఆవిడకి కావలసినవి అందించి, "నేను పిల్లల దగ్గరకి వెళ్తున్నాను. ఏమైనా కావాలంటే పిలవండి" అని వెళ్ళిపోయింది.

వెనుక ఆవిడ మూతి మూడు వంకర్లు తిప్పడం శారద గమనించకపోలేదు.

మరునాడు శారద వంట చేస్తుండగా, అత్తగారి ఏడుపు పెద్దగా వినిపించి, గాభరాగా ముందుగదిలోకి పరిగెట్టి వచ్చింది.

"ఏమయిందత్తయ్యా? "

ఆవిడ సమాధానం చెప్పలేదు. ఆనంద్ ముఖం గంభీరంగా వుంది. అతను తల్లిని ఓదారుస్తున్నాడు.

"ఏమయిందండీ? " అతన్ని చూస్తూ అడగింది. అతనూ సమాధానం చెప్పలేదు. కామేశ్వరమ్మ విసురుగా తలెత్తి, "ఇంకా ఏం కావాలి? మాయదారి సంబంధం! వెధవ పెళ్ళి. ఎర్రగా, బుర్రగా వున్నావని మురిసిపోయి నా కొడుక్కి నిన్నిచ్చి పెళ్ళిచేశాను. కాని నీకు డబ్బే ప్రపంచమని మొగుడు, సంసారం, పిల్లలు అక్కర్లేదని తెలియదు నాకు. వచ్చిన కడుపుని పోగొట్టుకోవడం ఎందుకు? ఏ కులమో తెలియని పిల్లలందరికీ చాకిరీ చెయ్యడం ఎందుకు? " ఆనంద్ ఆవిడకి ఏం చెప్పాడో, శారదకి అర్థమయింది. ఆమె ఆవిడకి సంజాయిషీ ఇవ్వదలచుకోలేదు. నిశ్శబ్దంగా లోపలకి వెళ్ళిపోయింది. వెనుకనుంచి ఆవిడ గొణుగుడు విన్పిస్తోంది.

శారదకి అర్థం కానిదొక్కటే. తను అబార్షన్ చేయించుకుందని అతడు ఎలా అపోహపడుతున్నాడు? తను చెయ్యని తప్పుకి తనని నిందిస్తున్నాడు. ఆమె కళ్ళలో నీళ్లూరుతున్నాయి.

★ ★ ★

ఆ మధ్యాహ్నం రాధని అడిగింది నాగమణి.

"బజారుకి వెళ్దాం. వస్తారా? "

"వస్తాను" వెంటనే అంగీకరించింది.

పెళ్ళయ్యాక రాఘవతో కలిసి బజారుకి వెళ్ళాలనే కోరిక తీరని రాధకి ఇప్పుడు నాగమణి బజారుకి రమ్మనగానే రాఘవపై కసితోబాటు ఉత్సాహం వచ్చింది.

మంచి చీర కట్టుకుని చక్కగా అలంకరించుకుని, రాధ నాగమణితోబాటు బయలుదేరింది.

"ఏంకొంటారు? "

"చీరెలు. మావారు డబ్బిచ్చారు చీరలు కొనుక్కోమని" చెప్పింది నాగమణి. రాధ ముఖం మ్లానమయింది, పండక్కి కూడా చీర కొనివ్వని రాఘవని తలచుకోగానే.

షాపులో నాగమణితోబాటు తనకీ జరుగుతున్న రాచమర్యాదలకంటే ఆమె కొనుక్కున్న చీరలు రాధకి ఆశ్చర్యాన్ని కలుగచేశాయి. పదివేల రూపాయలు పెట్టి నాలుగుచీరలు కొంది నాగమణి. రాధ అసూయగా చూస్తోంది.

"ఆ పసుపురంగు చీర నల్లగా వున్న నాగమణి కట్టుకుంటే చిరుతపులిలా వుంటుంది. అదే తన ఒంటిమీద అయితేనా? " ఆలోచిస్తున్న రాధ ఆమె బిల్లు చెల్లించి తన దగ్గరకి రావడం గమనించలేదు.

"మీరేమీ తీసుకోరా? "

రాధ బలవంతాన ముఖాన చిరునవ్వు పులుముకుని అంది, "మావారితో వచ్చి తీసుకుంటాను"

నాగమణి మేచింగ్ సెంటర్‌లో బ్లౌజులు, చీర్లకి ఫాల్సు కొంటూంటే రాధ షాపు

బయట అసహనంగా నిలబడి రోడ్డుమీద నడుస్తున్న మనుషులని చూస్తోంది. అస హనం కూడా కాదు. అసూయ! సుధీర్ భార్యగా స్వర్గసుఖాలను అనుభవించవల సిన తను అన్నింటికీ సర్దుకుంటూ రాజీప డుతూ... రాధ కళ్లలో నీళ్లూరుతున్నాయి. మరచిపోదామన్నా మరపునకు రాని గతం కళ్లముందు మెదులుతోంది.

"రాధా!" ఆ పిలుపులో సంభ్రమాశ్చ ర్యాలు! ఆ స్వరంలో ధ్వనించిన ఎనలేని సంతోషం? రాధని తల ఎత్తి ఆ పిలుపు వినవచ్చినవైపు తల ఎత్తి చూసేలా చేశాయి.

"సు... ధీ...ర్!" నీళ్లు నిండిన కళ్ళకి అతని రూపం మసగ్గా కనిపించింది. అసలు తన ఎదురుగా నిలబడివున్నది సుధీ రేనా? రాధ కనురెప్పలు అంతులేని సంచ లనంతో చలిస్తున్నాయి.

"బాగున్నావా, రాధా?" సుధీర్ మరో అడుగు ముందుకి వేశాడు.

ఎదురుగా తన కలల రాజకుమారుడు! తనెవరిని గురించి ఆలోచిస్తోందో ఆ వ్యక్తే కళ్ళ ఎదుట ప్రత్యక్షమయిన సంతోషంతో ఏదో తెలియని ఉద్వేగంతో రాధ గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఆమె సంభ్రమా శ్చర్యాలు నిండిన వెడల్పయిన కళ్ళతో అతన్ని అలాగే చూస్తోంది.

"సుధీర్" ఆమె పెదవులు అప్రయత్నం గానే ఉచ్చరించాయి. "మీరు... ఇక్కడ!"

"మా మామగారికి ఒంట్లో బాగా లేదని చూడ్డానికి వచ్చాను"

నవ్వుతున్న రాధ ముఖం పాలిపో యింది. ఒకప్పుడు తనవాడు అనుకున్న సుధీర్ తనికిప్పుడు ఏమీకాదు. వేరొకరి భర్త! తను వేరొకరి భార్య! ఆమె ముఖం మరింత పాలిపోగా, అక్కడనుంచి వెళ్లే ప్రయత్నంలో ముందుకి కదలబోయింది.

"చాలారోజుల తర్వాత కలుసుకున్నాం. అలా ఎక్కడికైనా వెళ్దాం"

"నేను ఇంటికి వెళ్ళాలి" అతనివైపు చూడ కుండానే అందామె.

"ఎలా వచ్చావు? ఇప్పుడు ఇంటికెలా వెళ్తావు?"

"ఎలాగో వెళ్తాను" రాధకి పెదవి విప్పితే దుఃఖం వస్తుందేమోనని భయంగా వుంది.

"రా, నా కారులో డ్రాప్ చేస్తాను"

"వద్దు"

"ప్లీజ్!" అభ్యర్థన నిండిన స్వరంతో అన్నాడతను. ఆమె నాగమణికి చెప్పి అతని వెనుక నడిచింది. సుధీర్ పార్క్‌చేసి వుంచిన తన కారు దగ్గరకి నడిచి డోర్ తెరి చాడు. రాధ అతని పక్కనే కూర్చుంది. ఆ ఖరీదైన కారులో ఎ.సి. చల్లదనాన్ని అనుభ విస్తూ అతని పక్కన కూర్చున్న రాధకి తను పోగొట్టుకున్న అదృష్టాన్ని తలచుకుంటే కళ్ళలో నీళ్లూరసాగాయి.

"నువ్వేమీ మారలేదు రాధా!" కారు డ్రైవ్ చేస్తూ సుధీర్ ఓరగా ఆమెని చూస్తూ అన్నాడు.

తల ఎత్తితే తన కన్నీళ్లు ఎక్కడ అతని కంటపడతాయో అన్నట్టు తలదించుకునే కూర్చుని వుందామె. సుధీర్‌కి రాధనలా చూస్తుంటే హుషారుగా వుంది. తన పక్కనే రాధ! తను చెయ్యి జాపితే అందేంత దూరంలో! అతను ఆమెని స్పృశించాలనే కోరికను బలవంతాన అణచుకుంటున్నాడు.

"చాలా రోజులయింది. మనం కలుసు కుని. ఏమైనా మాట్లాడకూడదూ?"

అంత దగ్గరగా ఆమెని చూస్తుంటే అత నికి ఆనాడు పిక్నిక్‌లో తను మిస్ అయిన అనుభవం గుర్తువచ్చి కోరికతో వేగిపో యాడు. ఆమెతో కలిసి మనుషులెవరూ లేని ఏకాంత ప్రదేశానికి వెళ్ళాలని వుందత నికి. ఏకాంతంగా కూర్చుని, మనసులోని భారమంతా దిగిపోయేలా ఏడవాలని వుందామెకి.

ఆమె ఏమీ మాట్లాడకపోవడంతో అతను అడిగేడు స్వరంలో బాధను, ప్రేమను రంగ





రించి.

"నాపై కోపమా, రాధా? నేనేం తప్పు చేశాను?"

"ఇక్కడ ఆపెయ్యండి" అతనివైపు చూడ కుండానే అంది.

"నా ఉనికి నీకు భరించలేనిదిగా వుందా రాధా?"

"మా ఇల్లు ఇక్కడకి దగ్గరే! నేను వెళ్ళగ లను. కారు ఆపండి"

"చూశావా? కనీసం మీ ఇంటికైనా ఆహ్వానించలేదు నన్ను. అంటే, నీకు నాపై అసహ్యమేనన్నమాట!"

రాధ చెంపలపైకి కారిన కన్నీటిని అతని కంటపడనివ్వకుండా తుడుచుకుని, విండో లోనుంచి బయటకి చూస్తోంది"

"ఎక్కడ మీ ఇల్లు?"

రాధ చెప్పింది. సుధీర్ ఆమె చెప్పిన ప్రకారం కారు పోనిచ్చాడు. "ఇక్కడ ఆపె య్యండి" కారు పూర్తిగా ఆగకుండానే గభాల్న తలుపు తీసుకుని బయటపడింది.

"థాంక్‌యూ!" అతనివైపు చూడకుండానే అంది. "వెల్‌కమ్" తమాషాగా తలవంచి అన్నాడతను.

రాధ పరుగులాంటి నడకతో వెళ్ళి తలుపు తాళంతీసి ఇంట్లోకి వచ్చింది. అప్ప టివరకు ఉగ్గబట్టుకున్న దుఃఖం ఉప్పెనలా పొంగింది. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"తను అంతగా ప్రేమించిన సుధీర్‌ని మరచిపోయి రాఘవని ఎలా పెళ్ళి చేసుకో గలిగింది?" రాధ తనని తనే ప్రశ్నించు కుంది.

"సుధీర్‌ని తను మరచిపోలేదు. కేవలం బందిఖానాలాంటి ఆ ఇంట్లోంచి బయటపడే మార్గం లేక పెళ్ళికి తలవంచింది అంతే!" తిరిగి తనకితనే సమాధానం చెప్పుకుంది.

తన అందాన్ని చూసి ఏ రాజకుమారుడో తనని వరించకపోతాడా అనే ఆశతో తాత్కాలికంగా సుధీర్‌ని మరచిపోయిన రాధ ఇప్పుడు రాఘవతో బ్రతుకులో రాజీప డలేక అసంతృప్తితో బ్రతికేస్తోంది కనుక సుధీర్‌ని తను మరచిపోలేదని అతన్ని ఇంకా ప్రేమిస్తూనే వుందని భ్రమపడు తోంది. అదే సుధీర్‌కంటే ఉన్నతుడైన వ్యక్తితో ఆమె జీవితం ముడిపడివుంటే ఆమె సుధీర్‌ని తలచుకునేదే కాదు.

రాధకి ఆ రాత్రి రాఘవ తనని ముట్టు కుంటే అసహ్యం వేసింది. అప్రయత్నంగా అతనికి దూరంగా జరిగిపోయింది.

"నాకు ఒంట్లో బాగా లేదు" అంది. ఆ సమాధానంతో రాఘవ అటు తిరిగి పడుకు న్నాడు.

కనీసం అతను తనకి సుస్తీ ఏమిటనే ప్రశ్న కూడా వెయ్యకపోవడంతో ఆమెకి అతని ఎడల వున్న అసహ్యం రెట్టింప యింది. విసురుగా తలగడలాగి చాప పరు చుకుని కింద పడుకుంది. రాఘవ వున్న ఆ గదిలో కూడా వుండాలన్పించడం లేదామెకి.

ఆమె చీకట్లోకి చూస్తూ పడుకుంది. కను రెప్పలు మూతపడడంలేదు. సుధీర్‌ని చూసిన ఆమె మనసులో ప్రశాంతంగా వున్న సరస్సులో చిన్న గులకరాయి వేస్తే కలిగే అలజడి కలిగింది.

★ ★ ★

"పెళ్ళాన్ని అదుపులో పెట్టుకోవడం చేత కాని వాజమ్మవిరా నువ్వు! నీ మాట లెక్క చెయ్యకుండా అది దానికిష్టమైనట్టు నడుచు కుంటూ వుంటే చూస్తు ఊరుకోవడానికి నీకు చిన్నతనంగా లేదూ? ముందు ఉద్యోగం పేరు చెప్పి మగరాయుడిలా బయటికి వెళ్ళి మగవాళ్ళ మధ్యకి వెళ్ళి ఉద్యోగం చేసింది. ఇప్పుడు ఏ కులమో, ఏ జాతో తెలియని పిల్లలకి పాలు పట్టిస్తూ, వాళ్ళకి గోచీలు మారుస్తూ ఆయాలా వెట్టి చాకిరీ చేస్తోంది. నిన్ను డబ్బు అడగడం తన అవసరాలకి నీపై ఆధారపడడం నామోషీ అయినప్పుడు పెళ్ళెందుకు చేసు కుందో నిలదీసి అడగలేకపోయావా? నువ్వు చవటలా వూరుకున్నావు కాని, మరో



మగవాడయితే దాని రెండు చెంపలూ వాయించును" కామేశ్వరమ్మ కసిగా అంటోంది. "నన్నెందుకు ఆడిపోసుకుంటావ్? నేను దాన్ని కొట్టలేక, తిట్టలేక కాదు. పెళ్ళయి ఆరేడు నెలలు కాకుండానే, సంసారం వీధిన పడెయ్యడమెందుకని కానీ"
అసహనంగా అంటున్నాడు ఆనంద్.

"విడాకులిస్తానని బెదిరించు. చచ్చినట్టు లొంగివస్తుంది"

కరివేపాకు కొందామని వీధిలోకి రాబోయిన శారద ముందుగదిలో కూర్చున్న అత్తగారు, భర్తల సంభాషణలో తన ప్రస్తావన వినిపించి అప్రయత్నంగానే ఆగిపోయింది.

"మరో మగవాడైతే దాని రెండు చెంపలూ వాయించును"

"విడాకులిస్తానని బెదిరించు"

ఆ రెండు వాక్యాలే చెవులలో మార్మోగుతుంటే అలాగే నిలబడి ఆలోచిస్తోంది.

అత్తగారికి తనపై ఎంత చులకనభావం వున్నది అర్థమయినా, ఆమెకి ఆవిడపై కోపం రాలేదు. బాధగా వుంది. ఆవిడా స్త్రీయే. కాని, సాటి స్త్రీ అయిన తన ఆర్థిక స్వావలంబనని ఎందుకు హర్షించలేకపోతోంది? తండ్రి దగ్గరో, భర్త దగ్గరో, కొడుకు దగ్గరో చెయ్యి జాపుతూ చచ్చేదాకా ఒకరి దయాధర్మాలపై బతకడమే స్త్రీ జన్మకి సార్థకతా? "

"దాని రెండు చెంపలూ వాయించు, విడాకులిస్తానని బెదిరించు" అని ఆవిడ రెచ్చగొడుతున్నది కొడుకుని కాదు మొత్తం పురుష జాతి అహంకారాన్ని.

శారద మనసులో బాధా వేదనలు సుడి తిరుగుతున్నాయి.

"కూరలో ఉప్పు వెయ్యలేదేం? " అన్నం తింటున్న కామేశ్వరమ్మ ముఖం చిట్లిస్తూ అంది.

"మరచిపోయి వుంటానండీ!" శారద నొచ్చుకుంటూ ఉప్పు వడ్డించింది ఆవిడ కంచంలో.

"మరిచిపోవడం కాదది నిర్లక్ష్యం! సంపాదిస్తున్నాననే అహంకారం!" కామేశ్వరమ్మ మొదలుపెట్టింది.

ఆనంద్ మాట్లాడకుండా తింటున్నాడు.

"నీకసలు సంసారం ధ్యాస వుంటేగా? సంపాదన మరిగినదానివి నీకు పనిధ్యాస ఎందుకు వుంటుంది? అయినా నిన్నని ఏం ప్రయోజనంలే! నిన్ను మగరాయుడిలా పెంచిన మీ అమ్మని, నాన్నని అనాలి! మీ అమ్మ ఉద్యోగం వెలగబెడుతోందిగా! నువ్వూ అలాగే ఆవిడ అడుగుజాడలలో నడుస్తున్నావు! అసలు ఇలాంటి సంబంధం చేసుకున్నందుకు నిన్ను అనాలి!" ఆవిడ కోపం వున్నట్టుండి ఆనంద్‌పైకి తిరిగింది.

"వైజాగ్‌లో అన్నయ్య వాళ్ళింటి పక్కన వుంటుంది ఒకమ్మాయి. పేరు రాధ! ఎంత వినయం! ఎంత మర్యాద! అసలా ఇల్లు చూస్తేనే కడుపు నిండిపోతుంది! ఎక్కడి వస్తువులక్కడ వుంటాయి. చదువుకున్న అమ్మాయి అయినా అసలు బయటకే రాదు. ఆ మొగుడు ఏం సంపాదిస్తాడో, ఏం తెచ్చిపెడతాడో, అసలు పొరుగిళ్లకి అప్పులకి కూడా రాదు" కామేశ్వరమ్మ ఆ రాధ అనే అమ్మాయితో శారదని పోల్చి విమర్శించడం మొదలు పెట్టింది. శారద మజ్జిగగిన్నె టేబిల్‌పై పెట్టి నిశ్శబ్దంగా అక్కడనుంచి వెళ్ళిపోయింది.

అత్తగారు అంతగా మెచ్చుకుంటున్న ఆ రాధ ఒకప్పటి తన ప్రాణస్నేహితురాలు రాధేనని ఆమెకి తెలియదు.

★ ★ ★

తలుపు తీసిన రాధ గుమ్మంలో నిలబడిన సుధీర్‌ని చూసి అప్రయత్నంగా ఒక అడుగు వెనక్కి వేసింది.

"నువ్వా!"

తనని చూడగానే, ఆమెలో కలిగిన భావ సంచలనాన్ని అతను గమనించకపోలేదు.

"నిన్న కారులో నీ కర్చీఫ్ మరచిపో




యావు. ఇవాళ మా డ్రైవరు కారు తుడుస్తుంటే కనిపించిందని ఇచ్చాడు" అతను కర్చీఫ్ ముందుకి జూపాడు. రాధ దాన్ని అందుకోబోతూ చూసింది. "ఇది నాది కాదు"

"కాదా! పోన్లే" అన్నాడు.

కేవలం కర్చీఫ్ ఇవ్వడానికే అతనిక్కడకి వచ్చాడంటే రాధకి నమ్మబుద్ధి కాలేదు. 'అతను తన కోసమే ఇక్కడకి వచ్చాడు' ఆ భావం ఆమె గుండె వేగంగా కొట్టుకునేలా చేసింది.

"నేను వెళ్తాను" అతను వెనుదిరిగాడు.

"అతను వెళ్ళిపోతున్నాడు" రాధ గుండె గొంతులోకి వచ్చింది.

"సుధీర్!" అప్రయత్నంగానే పిలిచింది.

అతను సంభ్రమంగా వెనుదిరిగాడు. "ఏమిటి, రాధా? "

"కూర్చోండి. మీరింత హఠాత్తుగా మా ఇంటికి వస్తారని ఊహించలేదు. ఏమిటో, మతిలేనిదానిలా నిలబెట్టే మాట్లాడుతున్నాను. కూర్చోండి"

సుధీర్ కూర్చున్నాడు.

"మీకు కాఫీయా, టీనా? "

"కొంచెం మంచినీళ్ళియ్యి చాలు"

రాధ మంచినీళ్లు తెచ్చి అతనిముందున్న టీపాయ్‌పై పెట్టేలోగా, అతను చెయ్యిజాపి, ఆ గ్లాసు అందుకున్నాడు. ఇద్దరి చేతివేళ్లూ తగిలాయి.

"సారీ!" అన్నాడతను. ఆ క్షణంలో ఆమె ముఖంలో మెదిలిన భావాన్ని చూసి రాధకి సినిమాహాలులో అతను తన చేతిని పట్టుకోవడం గుర్తువచ్చింది. ఆమె తనలో చెలరేగుతున్న భావసంచలనాన్ని అదుపులో పెట్టుకుంటూ వంటగదిలోకి వెళ్ళింది.

పాలు స్టవ్‌మీద పెట్టి అవి కాగేలోగా కప్పు శుభ్రంగా కడిగిపెట్టింది.

"ఏం మాట్లాడాలి సుధీర్‌తో? ఎలా మాట్లాడాలి? అతని సమక్షంలో మనసు ఆనందభైరవి నాలాపిస్తోంది. తను పోగొట్టుకున్న అదృష్టం అతను! అతను కొన్నాళ్ళ కిందట కన్పించివుంటే తన జీవితం వేరేవిధంగా వుండేది" పాలు పొంగి స్టవ్‌నిండా పడడంతో తన పరధ్యాసకి తిట్టుకుంటూ స్టవ్ కట్టి కాఫీ కలిపింది.

కాఫీ రుచి చూసిన సుధీర్ "అద్భుతం" అన్నాడు. తనకెదురుగా అజంతా శిల్పంలా నిలబడివున్న రాధని ఉద్దేశించి అతనా మాటలు అన్నాడు. కాని, అతను తను తయారుచేసిన కాఫీ గురించి అంటున్నాడనుకున్న రాధ పెదవులు విడీవిడనట్టు నవ్వింది.

"కూర్చో రాధా" అన్నాడు.

రాధ అతనికెదురుగా కూర్చుంది. కప్పు టేబిల్‌పై పెట్టి వెనక్కివాలి కూర్చుంటూ "చెప్పు రాధా... ఎలా వుంది నీ వైవాహిక జీవితం? నీ భర్త మంచివాడేనా? నీలాంటి అపురూప సౌందర్యరాశిని భార్యగా పొందిన అతను ఖచ్చితంగా హీరో అయి వుంటాడనుకో"

భర్త ప్రస్తావన రాగానే ఆమె ముఖం నల్లబడింది. తృటిలో ఆమె ముఖంలో మెదిలిన భావాలను సుధీర్ కనిపెట్టకపోలేదు.

"పెళ్లి చేసుకుని నేనెలాగూ సుఖంగా లేను. నువ్వయినా సుఖంగా వున్నందుకు నాకు తృప్తిగా వుంది"

రాధ కళ్లలో చివ్వున నీళ్లుబికాయి.

"నా భార్య భవ్య అనారోగ్యం మనిషే కాదు. అనుమానం మనిషి కూడా. మనం ప్రేమించుకున్న విషయం ఆమెకెవరో చెప్పారుట. అప్పటినుంచి ఇంట్లో ప్రతిదానికీ యుద్ధమే. మన ప్రేమహద్దులు దాటలేదని ఎంత చెప్పినా వినదు" సుధీర్ స్వరంలోని విషాదం రాధ గుండెని కోస్తోంది.

"తనని ప్రేమించి, పెళ్ళి చేసుకోలేకపోయిన సుధీర్ వేరొక అమ్మాయిని పెళ్ళి చేసుకుని సుఖంగా లేడు. పైగా తను సుఖంగా వున్నదనుకుని తృప్తి పడుతున్నాడు"

"ఇల్లు నరకం! నాకు తెలియకుండా నా బీరువా వెతకడం"

"దేనికి? " అప్రయత్నంగా అడిగింది.

"నువ్వు నాకు వ్రాసిన ప్రేమలేఖలేమైనా కన్పిస్తాయేమోనని. బిజినెస్ అంటే ఆఫీసు ఉద్యోగం కాదుకదా, రోజూ ఒకేటైముకి ఇంటికి రావడానికి! చెప్తే అర్థం చేసుకోదే! మనిద్దరం ఏ హోటల్ రూమ్‌లోనో గడుపు తున్నామని అనుమానం" క్షణం ఆగి ఎటో చూస్తూ విచలిత స్వరంతో తిరిగి చెప్పసాగా డతను

"నా భార్యని చూసినప్పుడల్లా భగవంతుడా! నాకెందు కింత శిక్షని విధించా వని నేను బాధపడని రోజు లేదు. భవ్యతో నా పెళ్ళి జరగాలనే అమ్మ పట్టుదలకి తలవంచని నేను అనారోగ్యంతో వున్న నాన్న కోరి కను కాదనలేకపోయాను. నాన్న చచ్చిపో తారని డాక్టర్లు చెప్పినమీదట ఆయన ఆఖరి కోరికను తీర్చడానికి భవ్యని పెళ్ళి చేసుకు న్నానే కాని మనస్ఫూర్తిగా ఆమెని ఇష్టపడి కాదు. చిత్రంగా చచ్చిపోతారనుకున్న నాన్న గారు కోలుకున్నారు. ఈ పెళ్ళి నా చావుకొ చ్చింది" వ్యధాభరితమైన నిట్టూర్పు వెలువ డిందతని పెదవులనుంచి.

"ఎన్ని కలలు! నీతో కలిసి పంచుకో బోయే జీవితాన్ని గురించి ఎన్ని ఊహలు! అవన్నీ భస్మమయిపోయాయి"

అతను విచలిత స్వరంతో చెబుతున్న ఈ మాటలు



ఆమె హృదయపు మారుమూలలో పేరు కున్న దుఃఖాన్ని వెలికి తీస్తున్నాయి. "సుధీర్ తనని ఎంత గాఢంగా ప్రేమిం చాడు. ఇప్పటికీ ప్రేమిస్తూనే వున్నాడు!"

"నేను భగవంతుడిని ఎప్పుడూ కోరుకు నేది ఒక్కటే! నా రాధ ఎక్కడున్నా సుఖంగా వుండాలి. ఆమెకి మంచి భర్త దొరకాలి. ఆమె..." వెక్కి వెక్కి ఏడుస్తున్న శబ్దంవిని ఎటో చూస్తూ మాట్లాడుతున్న సుధీర్ తల ఎత్తాడు.

చేతులలో ముఖం దాచుకుని ఏడుస్తోంది రాధ. ఆమె భుజాలు దుఃఖోద్వేగంతో కంపి స్తున్నాయి.

అతను ఆదుర్దాగా లేచి, ఆమె దగ్గరకి వచ్చి ఆమెకి అడుగు దూరంలో నిలబ డ్డాడు.

"ఏమయింది రాధా, ఎందుకు ఏడుస్తు న్నావ్? అరె! వూరుకో! ఏమిటిది చిన్న పిల్లలా? " అతను వూరడింపుగా అంటున్న కొద్దీ ఆమె దుఃఖం ఎక్కువయింది.

అతను చప్పున ఆమెని పొదివి పట్టుకుని "రిలాక్స్ రిలాక్స్" లాలనగా ఆమె తలనిము రుతూ అన్నాడు.

కొద్దిసేపటి తర్వాత స్థిమితపడిందామె. అంతసేపూ తను అతని చేతులమధ్య వుందనే స్పృహ కలగగానే ఆమె ముఖం లోకి రక్తం పొంగివచ్చింది. చప్పున అతని చేతులని వదిలించుకుంది.

"సారీ!" అన్నాడతను ఆమెకి దూరంగా జరుగుతూ.

రాధ అతనికెదురుగా నిలబడలేనట్టు చప్పున బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది. చల్లని నీళ్ళతో ముఖం కడుక్కుంది. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది. తను సుధీర్ కెదురుగా ఏడ్చినందుకో లేక అతను తనని చేతులమధ్యకి తీసుకున్నందుకో ఆమె ముఖం ఎర్రబడిపోతోంది.

అయిదునిముషాల తరువాత ఆమె మామూలుగా అయి బయటకి వచ్చేటప్ప టికి అతను వెళ్ళడానికి ఉద్యుక్తుడై లేచి నిల బడివున్నాడు.

ఆమెని చూడగానే అన్నాడు.

"ఇందాక నేను నిన్ను తాకడంలో స్నేహ భావం తప్ప మరేంలేదు. నేను చేసింది తప్పయితే నన్ను క్షమించు"

"కూర్చోండి" అంది.

"నేను వెళ్తాను" ఇబ్బందిగా చూస్తూ అన్నాడు.

"ప్లీజ్!" అర్థింపుగా అంది రాధ. అతను కూర్చున్నాడు.

"మీరనుకుంటున్నట్టుగా నేను సుఖంగా లేను సుధీర్! ఈ బంధాన్ని తెంచుకోలేక, ఈ బందిఖానాలోనుంచి బయటపడే మార్గంలేక నరకయాతనని అనుభవిస్తు న్నాను" గాద్గదిక స్వరంతో అంది.

"రాధా!" షాకింగ్‌గా వుంది సుధీర్ స్వరం. "నువ్వు... నువ్వు చెప్పేది" ఆశ్చ ర్యంగా, అపనమ్మకంగా అడిగాడు. "నిజం" అంటూ రాధ తను మనస్ఫూర్తిగా ఇష్టపడి రాఘవని పెళ్లి చేసుకోలేదని, పెళ్ళయ్యాక జీవితంలో రాజీపడదామని ఎంత ప్రయత్ని స్తున్నా తనవలన కావడంలేదని చెప్పింది. తన భర్త పిసినారితనంతో తన కనీస అవ సరాలు కూడా తీరడంలేదని చెప్పింది.

ఆమె కన్నీళ్ళతో చెబుతున్న ఈ మాటలు సుధీర్ ఆవేదనగా, తడి కళ్ళతో, సానుభూ తిగా విన్నాడు.

"మన ప్రేమ విషయం మా నాన్నకి తెలి సింది. నన్ను చదువు మాన్పించి ఇంట్లో బంధించారు. నిన్ను ఎలాగైనా కలుసుకోవా లని చాలా ప్రయత్నించాను అలాంటి పరి స్థితులలో ఒకరోజు సునీత నా దగ్గరకి వచ్చి నువ్వు నా గురించి అడిగేవని చెప్పింది. నేను నా పరిస్థితినంతటినీ వివ రిస్తూ నీకు ఉత్తరం వ్రాశాను."

"అవును. నువ్వు వ్రాసిన ఆ ఉత్తరాన్ని సునీత నాకు ఇచ్చింది నేను ఆ ఉత్తరానికి సమాధానం వ్రాసి సునీతచేత నీకు

పంపాను" అన్నాడు సుధీర్.

"నువ్వు నా ఉత్తరానికి జవాబు వ్రాశావా?" నిటారుగా అయింది రాధ.

"అవును. నేను నిన్ను పెళ్ళి చేసుకోడానికి సిద్ధమేనని, రెండు రోజుల తర్వాత అంటే ఫిబ్రవరి 4వ తారీఖున మనం పెళ్ళి చేసుకుందామని, నన్ను అనుపమ ఇంటి దగ్గర కలుసుకోమని వ్రాశాను"

రాధ ముఖం పాలిపోగా వణుకుతున్న పెదవులతో అంది. "సునీత నాకా ఉత్తరం ఇవ్వలేదు"

"నిజమా?" దిగ్భ్రమంగా అడిగేడు.

"అవును. నా ఉత్తరానికి నువ్వు సమాధానం వ్రాయకుండా వుండవని నాకు తెలుసు. నాకు సునీతపై అనుమానం వచ్చి దానింటికి వెళ్ళి దాన్ని ముఖం వాచేట్టు చివాట్లు పెట్టాను. దొంగమొహంది. నువ్వు నా ఉత్తరానికి సమాధానం వ్రాసి తనకివ్వ లేదనే బుకాయించింది" సునీతని తలుచుకోగానే రాధ పళ్లు కరకరలాడసాగాయి.

సుధీర్ బాధావేదనలు నిండిన స్వరంతో అన్నాడు. "నేనా ఉత్తరాన్ని సునీతకివ్వకుండా అనుపమచేత నీకు పంపినా మన జీవితాలలో ఈ అపశృతి తొంగిచూసేది కాదు"

రాధ చెంపలపైనుంచి అశ్రువులు దొర్లిపోతున్నాయి. కొన్ని క్షణాలు ఆ నిశ్శబ్దంలో భారంగా గడిచాయి.

"రాధా! ప్రేమికునిగా కాదు... ఒక స్నేహితుడిగా నీ దగ్గరకి రావచ్చునా?"

కాలం కలిసివస్తే ఒక గూటిలో బతకవలసిన తామిద్దరూ విధి విసిరేసిన పావుల్లా దూరమయ్యారు అనే బాధకంటే సుధీర్ తనకేమీ కాడనే భావమే ఆమె గుండెని కోస్తోంది.

"తప్పకుండా! నీ కోసం ఈ ఇంటి తలుపులు ఎప్పుడూ తీసేవుంటాయి" అంది రాధ.

పదినిముషాల తర్వాత సుధీర్ కారులో తను బసచేసిన హోటల్‌వైపు వెళ్తూ విజయగర్వంతో నవ్వుకున్నాడు.

★ ★ ★

"ఇవాళ సాయంకాలం నన్ను కంటి డాక్టరు దగ్గరకి తీసికెళ్ళాలిరా నందూ!" బ్యాంక్‌కి వెళ్ళబోతున్న కొడుకుతో చెప్పింది కామేశ్వరమ్మ.

"కళ్లు పరీక్ష చేయించుకోవాలిరా! పవరు పెరిగిందో ఏమిటో, కుడికన్ను అసలు కనిపించడంలేదు. మసగ్గా వుంది"

"వైజాగ్‌లో చూపించుకోలేకపోయావా?"

"మీ అన్నయ్య తెల్లవారి లేచినది మొదలుకొని ఆఫీసుకు వెళ్లేదాకా మీ వదిన ఏదో ఒకపని చెబుతూనే వుంటుంది. మార్కెట్టుకి వెళ్ళి కూరలు తేవడం దగ్గరనుంచి పిల్లల స్కూలు ఫీజులు కట్టడందాకా వాడే చూసుకుంటాడు. పాపం! అది మాత్రం ఏం చేస్తుందిలే! ఇద్దరు పిల్లలని తెమిల్చి స్కూలుకి పంపాలి. మళ్ళీ వాళ్లు ఇంటికొచ్చే సరికి హోమ్‌వర్కులు మొదలు! పాపం అన్నయ్య నన్ను డాక్టరు దగ్గరకి తీసుకెళ్తాననే అన్నాడు. ఎప్పుడూ ఏదో ఒక హడావుడే! ఇక్కడకెలాగూ వస్తున్నానుకదా. నువ్వు తీసుకెళ్తావని నేనూ అశ్రద్ధ చేశాను"

"అలాగేలే! సాయంకాలం తీసుకెళ్తాను" అన్నాడు. సాయంకాలం ఇంటికి వస్తూనే స్నానంచేసి మళ్ళీ బయటకి వెళ్ళిపోయాడు, కొలీగ్ ఏదో పార్టీ ఇస్తున్నాడని

మరునాడు ఆవిడ మళ్ళీ గుర్తుచేసింది. రోజూ పొద్దుట అతను బ్యాంక్‌కి వెళ్లేప్పుడు ఆవిడ గుర్తు చెయ్యడం, అతను మరునాటికి వాయిదా వెయ్యడం పరిపాటి అయిపోయింది.

విసిగిపోయిన కామేశ్వరమ్మ "అరేయ్! నన్ను డాక్టరు దగ్గరకి తీసికెళ్ళడానికి నీకు ఖాళీ లేకపోతే నాకు డబ్బియ్యి. నేను రిక్షాలో వెళ్ళి చూపించుకుని వస్తాను" అంది.

"ఎందుకమ్మా! నువ్వు ఒక్కర్తివే వెళ్ళడం? రేపు సాయంకాలం నేను తీసుకెళ్తానుగా" అనేసి ఆనంద్ బ్యాంక్‌కి వెళ్ళిపోయాడు.

మరునాడూ అంతే! రేపు తీసుకెళ్తానని సమాధానం! ఆ ఉదయం రామాయణం చదువుతున్న ఆవిడ మధ్య మధ్య కళ్ళజోడు తీసి నీరు కారుతున్న కుడికంటిని తుడుచుకుంటోంది.

"అత్తయ్యా!" శారద పిలిచింది.

ఆవిడ తల ఎత్తింది.

"అలా కళ్ళకి దగ్గరగా పుస్తకం పెట్టుకుని చదవకూడదు. ఆ కన్ను నీరు కారుతోంది కూడా. రండి, హాస్పిటల్‌కి వెళ్దాం"

"ఫర్వాలేదు. ఆనంద్ వచ్చాక వెళ్తానులే" అంది అయిష్టంగా.

"ఆడదానికి సంపాదన, చీరలు, నగలు కొనుక్కోడానికే కాదత్తయ్యా! కనీస అవసరాలు తీర్చుకోడానికి కూడా! నేను 'నాది' అనే సంపాదన కోసం తాపత్రయపడుతున్నది మీ అబ్బాయిముందు చెయ్యి జాపకూడదు అనే అహంకారంతో కాదు. పది సార్లు అడిగితేనే కాని ఆయన ఇంట్లో ఏ వస్తువు అయిపోయినా తీసుకురారు. పోనీ నన్ను బజారుకు వెళ్ళి కొనుక్కోమని డబ్బా ఇవ్వరు. అందుకేనత్తయ్యా 'నాది' అనే సంపాదన కోసం నా తాపత్రయం"

కామేశ్వరమ్మ కళ్ళల్లోనుంచి నీళ్లు కారుతున్నాయి. ఆవిడ మౌనంగా కోడలిని అనుసరించింది.

★ ★ ★

"జో అచ్చుతానంద జోజో ముకుందా...
లాలి పరమానంద రామ గోవిందా"

అత్తగారు పాడుతున్న లాలిపాట వింటూ సంభ్రమంగా గదిలోకి వచ్చిన శారద అలాగే నిలబడిపోయింది.

నీరజ పాపని ఎత్తుకుని జోకొడుతూ పాడుతోంది ఆవిడ. శారద గభాల్న వచ్చి అత్తగారి చేతులలోనుంచి పాపని తీసుకోబోయింది.

"మీకెందుకు అత్తయ్యా శ్రమ?"

"నాకు ఇక్కడ ఏమీ తోచడంలేదు. ఇవాళ్టినుంచి పిల్లలని నేనూ చూస్తాను. నాకూ కాలక్షేపం. అటు ఇంటిపని, ఇటు ఈ పిల్లలతో నువ్వూ సతమతమవుతున్నావు" ఆవిడ తలదించుకుని అంది.

ఆవిడ గతంలో శారదని తను అన్న మాటలకి అది క్షమార్పణ కాదు. కాని తల దించుకుని ఆవిడ మాట్లాడుతున్న తీరు, ఆ స్వరంలోని పశ్చాత్తాపం తనని క్షమార్పణ కోరుతున్నట్టే వుంది.

ఒకప్పుడు శారద కొన్న కొత్తిమీరతో చేసిన పచ్చడి తినకుండా తన తిరస్కారాన్ని తెలియచేసిన కామేశ్వరమ్మ.

శారద తన మొదటి సంపాదనతో సరదాగా చీర కొనితెస్తే 'నేను ఆనంద్‌ని అడిగి చీర కొనిపించుకుంటానమ్మా! వాడిని డబ్బు అడగడం నాకేమీ నామోషీ కాదు' అన్న ఆవిడ!

కోడలి చేత ఉద్యోగం మానిపించడానికి చెయ్యదగిన ప్రయత్నాలన్నీ చేసిన ఆవిడ ఇప్పుడు కోడలికి ఇంటి పనులలో సహాయపడుతూ, పసిపిల్లల సంరక్షణ బాధ్యతలో తనూ పాలు పంచుకుంటోంది.

ఆ ఉదయం ఆనంద్ "స్నానానికి నీళ్లు పెట్టు శారదా!" అని పిలిచాడు. శారద చేస్తున్న పని వదిలి వెళ్లబోయింది. అక్కడే కూర్చుని కూర తరుగుతున్న కామేశ్వరమ్మ ఆమెని ఆగమని సైగ చేస్తూ కొడుకునుద్దేశించి కోపంగా అంది,

"స్నానానికి నీళ్లు పెట్టాలా? శారద ఏదో పనిచేస్తోందికదా! నువ్వు పెట్టుకోలేవూ? అది కడుపుతో వుండగా ఇలాగే బరువు పనులు చేయించి వుంటావు! అందుకే దానికి అబార్షన్ అయింది"

తల్లి మాట్లాడుతున్నది ఆనంద్‌కి క్షణం అర్థం కాలేదు. అర్థం కాగానే తెల్లబో





యాడు.

వున్నట్టుండి తల్లి శారదని ఎందుకు వెనకేసుకుని వస్తోందో అతనికి అర్థం కాలేదు. ఎర్రబడిన ముఖంతో వెళ్లి నీళ్లు పెట్టుకున్నాడు. తరువాత తల్లి విడిగా వున్నప్పుడు అడిగాడు.

"ఏమిటి కోడలిని వెనకేసుకుని వస్తున్నావ్? "

"ఇన్నాళ్లూ నిన్ను వెనకేసుకుని వచ్చి దాన్ని తిట్టి ఎంత పాపం మూటకట్టుకున్నానో అర్థమయిందిరా!"

అప్పుడు చూశాడు అతను తల్లి కొత్త కళ్ల జోడు పెట్టుకోవడాన్ని.

"ఓహో! శారద కళ్లజోడు కొనిచ్చిందని దాన్ని వెనకేసుకుని వస్తున్నావన్నమాట!"

"అది కళ్లజోడు కొనిచ్చిందని కాదురా! నా కళ్లు తెరుచుకున్నాయి కనుకనే నిజం మాట్లాడుతున్నాను"

ఆనంద్ పళ్లు కొరుక్కున్నాడు. రెండు రోజుల తరువాత అతనికి శారదతోబాటు తల్లి కూడా బేబీకేర్ సెంటర్‌లో పిల్లల బాధ్యతను స్వీకరించిందని తెలిసింది.

"నీకు పిచ్చి పట్టిందామ్మా! దానితోబాటు నువ్వు కూడా ఆ పిల్లలకి చాకిరీ ఎందుకు చేస్తున్నావు? " ఆగ్రహంగా అడిగాడు.

"పట్టిన పిచ్చి వదిలిపోయిందిరా! తండ్రినో, భర్తనో, కొడుకునో యాచిస్తూ జీవితమంతా బిచ్చగత్తెలా బతకడమే స్త్రీ జన్మకి సార్థకత అనుకున్న నా పిచ్చి వదిలింది. నా శరీరంలో ఓపిక వున్నంతవరకు ఏదో ఒక పనిచేసి నా అవసరాలకు ఎవరిపైనా ఆధారపడకుండా బతకాలని నిశ్చయించుకున్నానందుకే" ఆవిడ పిల్లలున్న గదిలోకి నడిచింది.

ఆనంద్ స్థాణువులా నిలబడిపోయాడు. శారదని సాధించడానికి ఇన్నాళ్లూ తనకి తల్లితోడు వుండేది. ఇప్పుడు ఆవిడ శారద పక్షం చేరిపోయింది. అతను అసహాయంగా పళ్లు కొరుక్కున్నాడు.

అతనికి తను చేస్తున్న తప్పేమిటో తెలియలేదు. తెలుసుకున్నా అతనిలో అంత సులువుగా మార్పురాదు. మనుషులలో అంత సులువుగా మార్పు వస్తే ఈ ప్రపంచంలో మనుషులు వుండరు. మహానుభావులు వుంటారు.



రాధ తలంటుపోసుకున్న జుట్టు వదులుగా జడవేసుకుంది. తనకి వున్న వాటిల్లో మంచి చీర లేత నీలిరంగు చీర కట్టుకుంది. అద్దం ముందు అరగంటసేపు నిలబడి అన్ని కోణాలలోనుంచి తననితాను పరిశీలనగా చూసుకుని తృప్తిపడింది. తరువాత ముందు గదిలోకి వచ్చి కూర్చుంది. ఆమె చెవులు తమ ఇంటిముందు ఆగబోయే కారు శబ్దం కోసం నిరీక్షిస్తున్నాయి. సుధీర్‌ని తలచుకుంటే ఆమె మనసులో చిత్రమైన అలజడి.

సుధీర్ తనకేమీ కాడని, అంతకుమించి తను వేరొకరి భార్య అని తెలిసినా ఆమె మనసు అతని ఆకర్షణనుంచి తప్పించుకోలేకపోతోంది.

రాధ అసహనంగా కూర్చున్న చోటునుంచి లేచి గదంతా పచార్లు చెయ్యడం మొదలుపెట్టింది.

ఇవాళ ఈ సమయానికి వస్తానని చెప్పిన సుధీర్ ఎందుకు రాలేదు?

కాలింగ్‌బెల్ మ్రోగింది. ఆమె ఒక్క ఉదుటున వెళ్లి తలుపు తీసింది ఎదురుగా

నాగమణి!

ఆమెని చూడగానే రాధ ముఖం అప్రసన్నమయింది.

"ఏం చేస్తున్నారు? " అడుగుతూ లోపలకి వచ్చిందామె.

"ఏం లేదండీ! ఖాళీయే!"

"బజారుకి వెళ్దాం వస్తారా? "

"నాకు తలనొప్పిగా వుందండీ!"

"అయ్యో పోన్లెండి. రేపు వెళ్దాం!" నాగమణి తీరికగా కుర్చీలో కూర్చుంది. రాధ ముఖాన నవ్వు పులుముకుని ఆమెతో అన్యమనస్కంగానే మాట్లాడుతోంది.

సుధీర్ ఎందుకు రాలేదు? ఒకవేళ నాగమణి వుండగా అతను వస్తే అతను ఎవరని ఆమె అడిగితే ఏం సమాధానం చెప్పాలి? రాధ మనసులో ఈ ప్రశ్నలే సుడి తిరుగుతున్నాయి.

కాస్సేపటి తరువాత నాగమణి వెళ్లిపోయింది. రాధ గడియారం చూసి ఉలిక్కిపడింది. టైమ్ రెండు గంటలు కావస్తోంది. సుధీర్ రాలేదు! ఆమెకి ఉక్రోషంతో ఏడుపు వస్తోంది.

నిన్న సాయంకాలం తను ఇంటికి వచ్చి అయిదు నిముషాలు వుండి ఇవాళ ఇక్కడకి వస్తానని చెప్పిన సుధీర్ ఎందుకు రాలేదు? ఆమె కళ్లలో నీళ్లూరుతున్నాయి. ఆమె నిస్తేజంగా అలాగే కూర్చుండిపోయింది.

★ ★ ★

మరునాటి ఉదయం రాఘవ ఆఫీసుకి వెళ్లిపోయాడు. రాధ అన్యమనస్కంగా ఇంటిపనులు చేసుకుంటోంది. ఆ రోజు పని మనిషి రాలేదు. బక్కెట్లో నానపెట్టిన బట్టలు ఎదురు చూస్తున్నాయి. గిన్నెలు తోముతున్న రాధ పదహారోసారి విసుగ్గా అనుకుంది.

'వెధవ జీవితం! సరదాలు, సంతోషాలు లేవు. కొత్త చీరలు, నగలు అసలేలేవు. ఎంతసేపూ చాకిరీ!' ఆమెకి ఉక్రోషంగా వుండి ఏడుపొస్తోంది.

తన ఉక్రోషాన్ని బట్టలపై చూపిస్తూ వాటిని నేలకేసి దబదబ బాదడం మొదలు పెట్టింది. కాలింగ్‌బెల్ మోగింది. ఆమె ఉతుకుతున్న చీరని విసురుగా బకెట్టులో పడేసి ముందుగదిలోకి నడిచింది.

నాగమణి వచ్చింది కాబోలు! ఈవిడకి పనేమీ వుండదు. రావడానికి వేళాపాళా వుండదు అనుకుంటూ తలుపు తెరిచింది.

ఎదురుగా సుధీర్! రాధ గుండె క్షణం లయ తప్పింది. అతని చూపులు తనేకంగా ఆమెపై నిలిచాయి. పైకి దోపిన చీర కుచ్చెళ్లు, స్థానభ్రంశం పొందిన పైట. చెమటకి తడిసి నుదుటిపై అతుక్కున్న ముంగురులు. తడిపొడిగా వున్న చీర, జాకెట్టులతో ఆమె ఒంపుసొంపులు బహిర్గతమవుతున్నాయి. అతనికి తను రాత్రి చూసిన బ్లూఫిల్మ్ కేసెట్టులోని నగ్న సుందరి గుర్తు వచ్చింది. క్షణం రాధని ఆ స్థానంలో ఊహించుకున్న అతని కళ్లలో కోరిక మెరిసింది.

అతని చూపులకి రాధ ఇబ్బందిగా కదిలింది. "రండి కూర్చోండి" అంది ఫ్యాన్ స్విచ్ ఆన్ చేస్తూ.

సుధీర్ లోపలకి వచ్చాడు. కానీ కూర్చోలేదు. అతని చూపులు ఆమెను వెన్నంటుతున్నాయి.

"ఒక్కనిముషం స్నానం చేసివస్తాను" అంది.

"అలసిన అజంతా సుందరిలా వున్నావు రాధా!" ఆమెని ఇంకా అలాగే చూస్తూ అన్నాడు.

రాధ గుండె ఝల్లుమంది. ఆమె గభాల్న పైట సరిచేసుకుంటూ "ఇప్పుడే వస్తాను కూర్చోండి" అని పరుగులాంటి నడకతో లోపలకి వచ్చేసింది.

బాత్‌రూమ్ తలుపు మూసుకుని తలుపుని ఆనుకుని కొన్ని క్షణాలు అలాగే నిలబడిపోయింది. సుధీర్ చూపులలోని ఆరాధన ఆమె మనసులో నిద్రాణంగా వున్న





కోరికలను తట్టి లేపుతోంది.

అప్రయత్నంగానే రాఘవ గుర్తుకొచ్చాడు. తనేం చీర కట్టుకున్నా పట్టించుకోని రాఘవ. ఇంతటి అపురూపమైన రూపలావణ్యాలు కల తనని చూసి కూడా వరూధినిని చూసి చలించని ప్రవరునిలా జడ పదార్థంలా వుండే రాఘవ! ఆమె మనసు సుధీర్‌తో రాఘవని పోల్చుకోకుండా వుండలేక పోతోంది.

స్నానం ముగించి ఇస్త్రీ చీర కట్టుకుని బయటకి వస్తూ చిరునవ్వుతో అడిగింది.

"సారీ! లేట్ చేశానా? "

"పది యుగాలయింది"

నవ్విందామె. "నిన్న వస్తానని చెప్పి రాలేదేం? "

రాధ తనకోసం ఎదురు చూస్తుందని అతనికి తెలుసు. ఆ విషయం ఆమె చెప్పడంతో అతను హుషారుగా విజిల్ వెయ్యబోయి ఆగాడు. ముఖంలో విచారాన్ని స్వరంలో విషాదాన్ని అరువు తెచ్చుకుంటూ అన్నాడు.

"నిన్న భవ్య ఒకటే గొడవ! నువ్వీ వూళ్లో వుంటున్నావని తనకి తెలియదు కానీ అనుమానం! నేను నీతో తిరుగుతున్నానని అసహ్యంగా మాట్లాడి గొడవ చేసింది"

రాధ ముఖం నల్లబడింది. ఆమె ముఖంలో మారుతున్న రంగులని ఓరగా గమనిస్తున్న అతను అన్నాడు.

"నేను కేర్ చెయ్యననుకో! నా జీవితం నాది. నా ఇష్టం వచ్చినట్టు బతికే హక్కు నాకు వుంది. మనం ప్రేమించుకున్నాం. విధి మనని విడదీసింది. మన జీవితాలు వేరువేరు వ్యక్తులతో ముడిపడ్డాయి. అయినంత మాత్రాన మనిద్దరి మధ్య స్నేహం వుండకూడదా? ఆ సంబంధమే వుండాలా? చెప్తే అర్థం చేసుకోదే! మూర్ఖురాలు" అతను తన భార్య భవ్య ఎంత అనుమానం మనిషో చెబుతూ చాలా జాగ్రత్తగా రాధలోని ఉద్రేకాన్ని రెచ్చగొడుతున్నాడు. నిజానికతను భవ్యతో పెళ్లయ్యాక రాధ అనే అమ్మాయితో తను సరదాగా మాట్లాడితే దానికే తనని ప్రేమిస్తున్నాడని ఆమె అపోహ పడిందని పెళ్లి వరకు తీసికెళ్లిందని పెద్ద జోక్‌లా చెప్పాడు. భార్యాభర్తలిద్దరూ పదేపదే ఆ విషయాన్ని చెప్పుకుని మళ్లీ మళ్లీ నవ్వుకుంటూ వుంటారు కూడా.

"మనం మళ్లీ ఇలా కలుసుకోకపోయినా బాగుండేది సుధీర్! నా వలన మీ సంసారంలో కలతలు రేగడం..."

"రాధా!" బాధగా చూశాడు. "అంటే నన్నిక్కడకి రావద్దంటావా? "

"అది కాదు నా ఉద్దేశం..." ఆమె వివరించబోయింది.

"నిజానికి ఇక్కడ నీతో గడిపిన ఈ కొద్ది సమయమే నాకు మనశ్శాంతిగా వుంటుంది రాధా! ఒకవైపు బిజినెస్‌లో చికాకులు, ఇంటికి వెళ్తే నా భార్య చేసే గొడవ..."

రాధ మనసు ఆర్ద్రమయింది. ఆమె మాటలు కరువైనట్టు మూగగా చూస్తోంది.

"కొంచెం మంచినీళ్లిస్తావా? " అతను వచ్చి అంత సేపయినా తను మంచినీళ్లు ఇవ్వకుండా మాట్లాడుతున్నందుకు నొచ్చుకున్న రాధ మంచినీళ్లిచ్చి కాఫీ తెస్తాను అని వెళ్లబోయింది.

"కాఫీతో సరిపెడతావా? ఇవాళ నేనిక్కడే భోజనం చేసి సాయంకాలందాకా నీతో గడిపి వెళ్లాలని వచ్చాను. 'నీతో గడిపి' అనే పదాలను నొక్కి పలుకుతూ అన్నాడు.

"తప్పకుండా!" రాధ మనసు ఎగిరి గంతేసింది, సుధీర్ సాయంకాలందాకా ఇక్కడే వుంటాడంటే!

కాఫీరుచి చూసి "అద్భుతం" అన్నాడు.

"నిజంగానా? "

"నిజం! భవ్య కాఫీ కలిపితే టీలా, టీ కలిపితే కాఫీలా వుంటుంది!"

ఫక్కున నవ్వింది రాధ వంట చేస్తుంటే అక్కడే కూర్చుని కబుర్లు చెప్పాడతను. అతనికి భోజనం వడ్డించింది.

"భవ్య వంట బాగా చేస్తుందా?"

"వంటా? ఆవిడకి క్లబ్‌లకి తిరగడానికే టైమ్ వుండదు. ఎన్నిసార్లు చెప్పాను. వంట, వంట మనిషి చేసినా నాకు భోజనం

తనని పెట్టమని. వింటేనా? అసలు మేమిద్దరం కలిసి తినేదే తక్కువ"

రాధ మనసు ఆర్ద్రమయింది. సుధీర్‌తో కబుర్లు చెబుతుంటే ఆమెకి టైము గడిచేది తెలియలేదు. టైము నాలుగు గంటలవుతుండగా రాధ కంగారుగా అంది.

"ఇంక మీరు వెళ్లండి సుధీర్! మా ఆయన వచ్చే టైమయింది"

సుధీర్ లేచి నిలబడ్డాడు. అతని ముఖం గంభీరంగా వుంది.

"క్షమించు రాధా! నువ్వు నాకేమీ కావని తెలిసి కూడా నా మనసు అదుపు తప్పుతోంది. నేనింకా కాస్సేపు ఇక్కడే వుంటే చాలా పెద్ద ప్రమాదం ముంచుకొచ్చేలా వుంది. వెళ్తాను రాధా! ఆం ఇది నీకివ్వాలని అనుకుంటూనే మరచిపోయాను. ఈ చిరు కానుకని స్వీకరిస్తావా?" అతను జేబులో నుంచి ఒక పేకెట్టు తీసి ఆమెకిచ్చాడు.

"మళ్లీ ఎప్పుడొస్తారు?"

"రేపు కాదు... ఎల్లుండి... వస్తాను!" సుధీర్ వెళ్లిపోయాడు. రాధ అతని కారు స్టార్టయి కనుమరుగయ్యేదాకా అలాగే నిలబడిపోయింది.

తరువాత చేతిలోని పేకెట్టుని ఆసక్తిగా విప్పింది. పైన గులాబీ రంగు కాగితాన్ని విప్పగానే లోపలనుంచి చిన్న ముఖమల్ పెట్టె బయటపడింది. ఆ పెట్టె తెరిచిన రాధ కళ్లలో ఛమక్‌మనే కాంతి ఎగిరి వచ్చింది. లోపల ముత్యపు ఉంగరం, దాని పక్కనే చిన్న కాగితం మడత!

రాధ దాన్ని విప్పింది.

'నా హృదయసాగరంలోని ఆణిముత్యం రాధకి ప్రేమతో సుధీర్!'

రాధ అణువణువు ఝల్లుమంది. అతనిచ్చిన కానుకకంటే దాని వెనుకవున్న అతని మనసు అర్థమయి ఆమె మనసు పరవశిస్తోంది.

రాఘవ లోపలకి వస్తూ టీపాయ్ మీద ఖాళీ కప్పుని చూసి "ఇంటికెవరు వచ్చారు?" అని అడిగేదాకా ఆమె పరిసరాలను మరచి అలాగే నిలబడిపోయింది.

అతని కంటపడకుండా ఆ చీటీని, ఉంగరాన్ని నేర్పుగా జాకెట్టులోకి తోసేసి తడుముకోకుండా చెప్పింది.

"మా కజిన్... సుధీర్ అని"

"ఏ ఊరు?"

"హైదరాబాదు"

"అలాగా! భోజనం పెట్టావా?"

"లేదు... బయట తినివచ్చాడు!" అతనా ప్రశ్న ఎందుకు వేశాడో అర్థమయిన ఆమె చప్పున అబద్ధం చెప్పింది.

"ఇంటికి ఎవరైనా వస్తే భోజనానికి వుండమని చెప్పకు. ఒకసారి అలవాటయితే ఇంక మన మీద వాలిపోతారు. ఈ బంధువులనే వాళ్లున్నారు చూశావూ! మనం బాగున్నంతసేపూ మనని పీక్కుని తింటారు. మన దగ్గర ఏమీ లేదని తెలిస్తే మన దరిదాపులకి కూడా రారు" అన్నాడు రాఘవ బాత్‌రూమ్‌లోకి వెళ్తూ.

రాధ మనసు అసహ్యంతో ముడుచుకుపోయింది. "ఇంటికెవరైనా వచ్చి ఒక పూట భోజనం చేస్తే తన ధనరాశి తగ్గిపోతుందనుకునే రాఘవతో కలిసి ఎలా బతకగలుగుతోంది తను?" ఆమెకి తన మీద తనకే జాలివేసింది.

★ ★ ★

"సుధీర్ తనని ప్రేమిస్తున్నాడు! ఇప్పటికీ అతని మనసులో తన స్థానం చెక్కుచెదరలేదు. అతను మగవాడు కాబట్టి ఆ విషయాన్ని బాహాటంగా తనతో చెప్పగలిగాడు! తను స్త్రీ! పైగా ఇంకొకరి భార్య! సుధీర్ తన ఇంటికి రాకపోకలు సాగించడం భర్త కంట పడుతుందేమోనని భయపడుతోంది. భర్తకి

తెలియకుండా అతని విషయం ఎన్నాళ్లు దాచగలదు?

అతనివైపు పరుగులెడుతున్న మనసు ఒకవైపు, కట్టుబాట్లు మరొకవైపు. రాఘవపై ద్వేష భావం సుధీర్‌పై ప్రేమగా మారుతోందని ఆమె ఎప్పుడో గ్రహించింది. ఆమెలో సంఘర్షణ! అంతర్మథనం.

కాలింగ్‌బెల్ మ్రోగింది. రాధ వెళ్లి తలుపు తీసింది. ఎదురుగా సుధీర్! అతని ముఖం మామూలుగా లేదు. బట్టలు నలిగి మాసి వున్నాయి.

"నేను ఇవాళ ఇక్కడ వుండిపోదామని వచ్చాను. అభ్యంతరపెట్టకు రాధా!" అతను లోపలకి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"ఇంతరాత్రివేళ..." రాధ భయంగా అర్థోక్తిలో ఆగింది.

"ఇవాళ ప్రొద్దుట భవ్యకి, నాకు పెద్ద గొడవ అయింది. మొన్న నీకు ఇచ్చిన ముత్యపు ఉంగరం తాలూకు బిల్లు నా షర్టు జేబులో దొరికింది. ఉంగరం ఎవరికి కొన్నారు అని నిలదీసింది. నాకు ఒళ్లు మండి నిజం చెప్పేశాను"

"అయ్యో!" రాధ అప్రయత్నంగా అంది.

"ఇంక భరించడం నావల్లకాదు రాధా! అదృష్టమో, దురదృష్టమో భవ్యని పెళ్లి చేసుకున్నాను. ఒక్కరోజయినా కడుపు నిండా అన్నం తిన్నానా? కంటినిండా నిద్రపోయానా? అనుమానం! అనుమానంతో నా ప్రాణం తీసేస్తోంది. మనశ్శాంతి లేక కోరికలు చంపుకుంటూ నేను, కనీస అవసరాలు కూడా తీరకుండా నువ్వు ఎందుకు బతకాలి? నాతోరా! ఈ కుళ్లు మనుషులకి దూరంగా ఎక్కడకయినా వెళ్లిపోయి బతుకుదాం"

"సుధీర్!" అప్రయత్నంగా ఒక అడుగు వెనక్కి వేసింది. అతనా ప్రపోజల్ తెస్తాడని ఊహించని ఆమెకి మతిపోయినట్టుగా వుంది.

"అదెలా సాధ్యం? నాకు పెళ్లయింది. భర్త వున్నారు. నీకు నీకు... అసలా ఆలోచన ఎలా వచ్చింది? "

"నీ ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండానే నీ పెళ్లి జరిగిపోయింది. నువ్వు నన్ను ప్రేమించావు. ఇప్పటికీ ప్రేమిస్తూనే వున్నావు. నిజం కాదా! చెప్పు!" ఆవేశంగా అన్నాడు.

రాధ నిరుత్తరురాలై వెడల్పాయిన కళ్లతో చూస్తోంది.

"నువ్వు రాఘవని పెళ్లి చేసుకున్నావు కాబట్టి అతనితో కలిసి బతుకుతున్నావు. కాని కళ్లలో నా రూపాన్ని, గుండెలో నా జ్ఞాపకాలని పదిలపరచుకుని వివాహ బంధానికి కట్టుబడి జీవచ్ఛవంలా ఎందుకు బతకాలి! నీకు నేనున్నాను రాధా! నాతోరా! నిన్ను పూలబాటలో నడిపిస్తాను. నువ్వు కలలుకన్న మధుర స్వప్నంలాంటి జీవితాన్ని నీకిస్తాను"

"కాని, సుధీర్! పెళ్ళయినదాన్ని! నా భర్తని వదిలి నీతో వస్తే ఈ లోకం ఏమంటుంది? నన్ను వ్యభిచారిణిగా ముద్రవెయ్యదా? "

"వ్యభిచారం! అవును... వ్యభిచారమే! మనసులో నన్ను ఆరాధిస్తూ నీ భర్తతో కాపురం చెయ్యడం వ్యభిచారమే అయితే, నీ భర్తని వదిలి నాతో సుఖపడడం వ్యభిచారమే అవుతుంది"

రాధ ముఖం ఎర్రబడింది.

"నిజం చెప్పు... నీ భర్త చేతులమధ్య నువ్వుండగా నీకు ఎన్నిసార్లు గుర్తు వచ్చాను? ఎన్ని రాత్రులు నన్ను గురించిన ఆలోచనలతో నిద్రకి దూరమయ్యావు? "

రాధ జవాబివ్వలేకపోయింది.

"నీ సుఖాలను త్యాగం చేసి జీవితాంతం నీ భర్త అనబడే ఆ జంతువుతో బతికితే నిన్ను మహా పతివ్రత అని మెచ్చుకుని నీకు ఎవరూ సావిత్రి, అరుంధతి వగైరా పతివ్రతల సరసన స్థానమివ్వరు!"





అతను చెబుతున్నవన్నీ పచ్చి నిజాలుగా కన్పిస్తున్నాయి. అతను తనకి అందిస్తానంటున్న స్వర్గసుఖాలు ఊరిస్తున్నాయి. అతని ప్రేమ హస్తాన్ని అందుకోమని మనసు తొందరపెడుతోంది. కాని, ఏదో బంధం ఆమెని పట్టి ఆపుతోంది.

"నన్ను ఆలోచించుకోనియ్యి సుధీర్" అంది కంపిస్తున్న స్వరంతో.

"ఆలోచించుకో! నీ భర్త ఎల్లుండి బుధవారం మళ్ళీ కేంపుకి వెళ్తున్నాడు. గురువారం మెడ్రాస్ ప్రయాణానికి రెండు టికెట్లు బుక్ చేశాను. అక్కడనుంచి సింగపూర్ వెళ్దాం. ఎల్లుండి మళ్ళీ వస్తాను. ఆలోచించుకుని, నీ నిర్ణయాన్ని నాకు తెలియచెయ్యి" సుధీర్ వెళ్ళిపోయాడు.

రాధ నిలబడిన చోటనే కూలబడిపోయింది.

ఆమె మనసులో ఏదో తెలియని ఉద్వేగం!

ప్రతి పైసా లెక్కపెట్టుకుంటూ, మెతుకు పోతే బతుకు పోతుందేమోనని భయపడే పరమ పిసినారి అయిన భర్తకి దూరంగా వెళ్ళిపోయి సుధీర్‌తో స్వర్గసుఖాలను చవి చూడమని మనసు తొందరపెడుతోంది.

మరొకవైపు భయం! సంఘం, కట్టుబాట్లు ఆమెలో ప్రవహిస్తున్న హైందవ రక్తం ఆ ఆలోచన తప్పంటున్నాయి. ఆమె మనసు ద్వైదీభావాలతో సతమతమవుతోంది.

★ ★ ★

అప్పటికి రెండు రోజులయింది శారద వైజాగ్‌వచ్చి ఆనంద్ అన్నగారి కొడుకు పుట్టినరోజుకి ఆనంద్‌తోబాటు ఆమె కూడా వచ్చింది.

ముందు శారద వైజాగ్ వెళ్ళడానికి ఇష్టపడలేదు. "మీరు, మీ అబ్బాయి వెళ్ళిరండత్తయ్యా! నేను రాను" అంది.

"అబ్బాయితో నేను వెళ్తే బాగుంటుందా, నువ్వు వెళ్తే బాగుంటుందా చెప్పు. నేను సెంటర్‌లో పిల్లలని చూసుకుంటానుగా? నువ్వెళ్ళిరా? "

"మీరొక్కరూ చూసుకోలేరత్తయ్యా!"

"ఆయా వుంది కదమ్మా! ఫర్వాలేదు. బొత్తిగా గుడిపాములా ఇంట్లోనే వుంటున్నావు. నందూకి నిన్ను బయటకి తీసికెళ్ళాలని, నాలుగు ప్రదేశాలూ చూపించాలని తోచదు. ఈ వంకనైనా వాడితో కలిసివెళ్ళు. నీకూ మార్పుగా వుంటుంది" అత్తగారి బలవంతంపై శారద ప్రయాణమయింది.

"వైజాగ్‌లో మనింటి పక్కనే వుంటుందని చెప్పానే! రాధ! ఆ అమ్మాయిని కలుసుకునిరా!" చెప్పింది కామేశ్వరమ్మ.

శారదకి తన స్నేహితురాలు రాధ గుర్తు వచ్చింది.

"ఎక్కడుందో రాధ? ఏం చేస్తోందో? సునీత ఎక్కడుందో? ఇద్దరికిద్దరూ ఉత్తరాలు రాయడం మానేసారు! కమ్యూనికేషన్ గేప్‌వలన ఇద్దరు స్నేహితులు దూరమయ్యారు"

ఆ ఉదయం తోటికోడలు కూరలు కొంటూంటే శారద కూడా వీధిలోకి వచ్చింది. పక్కింటి తలుపులు తెరచుకుని బయటకి వచ్చిన ఆమెని చూసి ఆశ్చర్యంతో తలమునకలయింది.

"ఆమె రాధ! తన ప్రాణస్నేహితురాలు! అత్తగారు చెప్పిన రాధ తన స్నేహితురాలే కావడం ఎంత కాకతాళీయం"

"నేనొకసారి పక్కింటికి వెళ్ళొస్తానక్కయ్యా!" అంటున్న శారదవైపు వింతగా చూసింది ఆమె తోటికోడలు.

"పక్కింటికా? ఎందుకు? నీకు వాళ్ళతో పరిచయం వుందా? " అత్తగారు తనకి రాధ అనే అమ్మాయి గురించి చెప్పి ఆమెను కలుసుకోమన్నారని, ఆమె తన స్నేహితురాలు రాధేనని చెప్పింది.

"ఆవిడకి తన కోడళ్ళు తప్ప ప్రపంచంలో అందరూ మంచి వాళ్ళే!" నిరసనగా అందామె. "నీ స్నేహితురాలంటున్నావుగా?

వెళ్ళు!"

తోటికోడలికి అత్తగారిపై సదభిప్రాయం లేదని అర్థమయింది శారదకి. ఆమె తోటికోడలు అన్నదానిపై వ్యాఖ్యానించకుండా ముందుకి నడిచింది.

కాలింగ్ బెల్ నొక్కుతున్న ఆమె చేతి వ్రేళ్ళు ఉద్వేగంతో కంపిస్తున్నాయి.

చదువుకునే రోజులు... కాలేజీ ఆవరణ... కాడమల్లి చెట్టుకింద తమ స్నేహితులు ముగ్గురూ చెప్పుకున్న కబుర్లు గుర్తు వచ్చాయి. మళ్ళీ ఇన్నేళ్ళ తరువాత తన స్నేహితులలో ఒకమ్మాయిని కలుసుకోపోతోంది.

తలుపు తెరుచుకుంది. రాధ ఎదురుగా నిలబడి వున్న శారదని దిగ్భ్రమతో చూస్తోంది. శారద ఊహించినట్టుగా ఆమెని ఒక్కంగలో సమీపించి కౌగలించుకోలేదు. శారద ఒక్క ఉదుటున ఆమెని సమీపించి కౌగలించుకుంది.

"రాధా ఏమిటే నన్ను మరచిపోయావా ఏమిటి? నేను శారదని? " అంది ఆమె చేతులు పట్టుకుని తడికళ్లతో నవ్వుతూ.

"మరచిపోలేదులే! హఠాత్తుగా నిన్ను చూసి ఆశ్చర్యపడ్డాను అంతే!" అంది.

"ఇప్పుడు చెప్పవే! ఏమిటి విశేషాలు? ఎలా వున్నావు? అసలు ఉత్తరాలు రాయడమే మానేశావు! సునీత కొన్నాళ్ళు రాసింది. తరువాత అదీ మానేసింది. నీకు ఎన్ని ఉత్తరాలు రాశాను! ఒక్క ఉత్తరానికైనా సమాధానం రాశావా? " ఆప్యాయతతో నిష్ఠురాన్ని కలగలిపి అంది.

"ఎప్పటికప్పుడు నీకు ఉత్తరం రాద్దామనుకుంటూనే బద్ధకించేసాను" రాధలో చాలా రోజుల తరువాత స్నేహితురాలిని చూసిన ఆనందం లేదు.

"కనీసం నీ పెళ్ళి శుభలేఖ అయినా పంపలేదేం? " శారద చనువుగా దబాయింపుగా అంది.

"అనుకోకుండా జరిగిపోయింది. నీకే కాదు ఎవరికీ శుభలేఖలు వెయ్యలేదు" తనతో మాట్లాడుతున్నా రాధ చూపులు చీటికీ మాటికీ వీధి గుమ్మంవైపు మళ్ళుతుండడం గమనించింది శారద.

"మీ వారు ఆఫీసుకి వెళ్ళారా? "

"కేంప్‌కి వెళ్ళారు"

"ఇంకా ఏమిటి రాధా? ధాదాపు నాలుగేళ్ళ తరువాత కలుసుకున్నాం! ఎలా వుంది జీవితం? కాలేజీలో చదువుకుంటున్న రోజులలో మనం తీసుకున్న నిర్ణయం గురించి మన ఆశయసాధనలో నువ్వు పడిన ఇబ్బందుల గురించి... అదే నీ ఉద్యోగం గురించి చెబుతావనుకున్నాను. నీ ఆశయసాధనకి మీ వారు సహకరిస్తున్నారా? "

"ఏమీ లేదు. నేను ఉద్యోగం చెయ్యడం లేదు" రాధ మాటలలోని నిర్లిప్తత, తనతో మాట్లాడుతున్నా ఆమె అస్థిమితంగా కుర్చీలో కదలడాన్ని గమనించింది శారద. ఆమెకి రాధ తనతో పొడిగా ముక్తసరిగా మాట్లాడుతుంటే బాధగా వుంది. ఎలా వుండేది రాధ. దాపరికం లేకుండా తనతో అన్ని విషయాలూ చెప్పేది.

రాధకి శారద వెళ్ళిపోతే బాగుండునన్పిస్తోంది. 'సుధీర్ వస్తాడేమో! ఈ శారద ఇప్పుడే రావాలా? '

"సునీత కూడా ఇక్కడే వుంది" ఏదో ఒకటి మాట్లాడాలి కదా అన్నట్టు అంది.

"సునీత! ఇక్కడా? " శారదకి ప్రపంచంలో ఎనిమిదోవింత విన్నట్టు వుంది. ఒకప్పటి స్నేహితులని ఇన్నాళ్ళ తరువాత మళ్ళీ కలుసుకున్న ఆనందం ఆమె ముఖంలో స్ఫుటంగా కన్పిస్తోంది.

"అవును... ఆమధ్య మా బంధువుల ఇంట్లో ఫంక్షన్‌లో కనిపించింది" రాధ లోపలకి వెళ్ళి ఎడ్రస్ తెచ్చి ఇచ్చింది. సునీత ఎడ్రస్ పుచ్చుకున్నా, శారద లేవలేదు.

ఆమెకి రాధతో తను కొన్నాళ్ళు చేసిన ఉద్యోగం గురించి, ప్రస్తుతం నడుపుతున్న బేబీ కేర్ సెంటర్ గురించి చెప్పాలనివుంది.





"నా గురించి ఏమీ అడగవేం?" రాధ ఏమీ అడగకపోవడంతో ఆమే అడిగింది.

"నేను... బయటకి వెళ్ళాలి నువ్వింక వెళ్ళు" అన్న ధోరణిలో మాట్లాడుతున్న రాధని చూస్తే శారదకి బాధగా వుంది. ఆమె ఏదో అనబోయేంతలో గుమ్మం ముందు కారాగింది.

కారులోనుంచి ఖరీదైన దుస్తులతో హుందాగా వున్న యువకుడు దిగాడు. అతను సరాసరి లోపలకి వచ్చాడు. రాధ ముఖంలో అతన్ని చూడగానే కనిపించిన వింత వెలుగు శారద దృష్టిని దాటిపోలేదు.

"ఈమె శారద... నా ఫ్రెండ్! ఇతను సుధీర్! నా కజిన్!" పరస్పరం పరిచయం చేసింది.

శారద చేతులు జోడించింది... "నమస్తే!'

అతను ప్రతినమస్కారం చేశాడు. అతని చూపులు తనని నఖశిఖపర్యంతము పరీక్షగా చూడడం గమనించిన శారద ఒళ్ళంతా ముడుచుకుపోయింది. ఆమెకెం దుకో అతనిపై సదభిప్రాయం కలగలేదు.

"నేను వెళ్తాను రాధా! మళ్ళీ కలుస్తాను"

శారద గేటు దాటుతుండగా వెనకనుంచి అతని స్వరం అస్పష్టంగా వినిపించింది.

"ఇవాళ రాత్రికే మన ప్రయాణం"

★ ★ ★

రాధ ఇచ్చిన ఎడ్రస్ ప్రకారం సునీత ఇంటిని వెతుక్కుంటూ వెళ్ళింది శారద. సునీత ఇంట్లోనే వుంది.

"హాయ్!" శారదని చూడగానే పరుగున వచ్చి కౌగలించుకుంది.

చాలాకాలం తరువాత స్నేహితురాలిని చూసిన ఆనందం కళ్ళలో ప్రతిఫలిస్తుండగా అంది శారద.

"చాలా మారిపోయావ్ సునీతా"

పెన్సిల్ గీతల్లా వున్న కనుబొమలు. భుజాలవరకు కత్తిరించిన జుట్టు, స్లీవ్‌లెస్ జాకెట్టు ఆధునికతకి మారుపేరులా వుంది. సునీత నవ్వింది. "మావారికి నేనిలా వుంటే ఇష్టం"

"మనం కలుసుకుని నాలుగేళ్ళకిపైగా అయింది. చెప్పు ఏమిటి విశేషాలు? ఎలా వుంది జీవితం?"

"అద్భుతంగా వుంది. డిగ్రీ పూర్తయింది. అమ్మ ఉద్యోగం చెయ్యమంది. నాకేమో ఇష్టంలేదు. ఈలోగా అనుకోకుండా పెళ్ళి నిశ్చయమయింది. అచ్చంగా సినిమాల్లోలా చాలా యాక్సిడెంటల్‌గా జరిగిపోయిందిలే! మా ఇంటికి నాలుగిళ్ళ అవతల సరోజిని అనే ఆవిడ వున్నారు. ఆవిడ తమ్ముడే రమేష్. ఒకసారి వాళ్ళింట్లో నన్ను చూశారు. పైసా కట్నం తీసుకోకుండా కోరి నన్ను పెళ్ళిచేసుకున్నారు. కావలసినంత డబ్బు! ఏం ఖర్చు పెట్టినా నన్ను ఏమీ అనరు!"

"మీ వారు హీరో అన్నమాట!"

నవ్వింది సునీత చిరుగర్వంగా. ఇల్లంతా చూపించింది. తనకి భర్త కొన్న పగడాల సెట్ గురించి చెప్పింది. మధ్యలో ఫోన్ కాల్స్ వస్తే రిసీవ్ చేసుకుంది. పనివాడిని పిలిచి కాఫీ టిఫిన్ తెప్పించింది.

శారదకి ఊపిరాడనట్టుగా, ఉక్కిరిబిక్కిరిగా వుంది. సునీత మాటలలో కామాలే కాని, ఫుల్‌స్టాపులు లేవు. ఆడంబరమే కాని, ఆప్యాయత లేదు.

తన గురించి చెబుతోంది తప్ప శారద గురించి ఏమీ అడగలేదు.

సడన్‌గా గుర్తు వచ్చినట్టు అడిగింది.

"అవునూ నేనిక్కడ వున్నానని నీకెలా తెలిసింది?"

"మన రాధ ఇక్కడే వుంది తెలుసుగా? మా అత్తగారి పక్కఇల్లే తనది. చాలా కాకతాళీయంగా కలుసుకున్నాం. తను నీ ఎడ్రస్ ఇచ్చింది. మీరిద్దరూ ఒకే వూరిలో వున్నారు. చక్కగా మీరు కలుసుకుంటూ వుంటారు. పెళ్ళయ్యాక కూడా మీ స్నేహం కొనసాగుతోంది. నాకు మిమ్మల్ని చూస్తే

అసూయగా వుంది"

"ఎవరు రాధా? " నవ్వింది సునీత. "రాధకీ నాకు మధ్య స్నేహం లేదు శారదా! చదువుకునే రోజులలోనే నాకు, దానికి మధ్య స్నేహం లేదు"

శారద భ్రుకుటి ముడివడింది. "కారణం ఏమిటి? "

"అసూయ! కేవలం అసూయ! తనకంటే ఉన్నత స్థితిలో వున్నవాళ్ళని చూస్తే దానికి అసూయ! అది తీర్చుకోలేని కోరికలను నేను తీర్చుకుంటున్నానని ఈర్ష్యతో నాతో స్నేహం మానేసింది. మొన్న మా వారి ఫ్రెండ్ కొడుకు బర్త్‌డే పార్టీలో కనిపించింది. నేను పాత విషయాలన్నీ మరచిపోయి స్నేహంగా మాట్లాడినా, అది ముభావంగానే మాట్లాడింది. నా హోదా, స్థితిమంతుడయిన వ్యక్తికి నేను భార్యని కావడం దానికి అసూయకలిగించాయి. నా ఎడ్రస్ ఇచ్చినా మా ఇంటికి రాలేదు. అయినా, నా అదృష్టానికి అది ఈర్ష్య పడడం ఏమిటి? డబ్బున్నవాడని ఒక భ్రష్టుడిని గుడ్డిగా ప్రేమించిందిగా? అయినా ఆ సుధీర్ దాన్ని పెళ్ళిచేసుకుంటాడని ఎలా నమ్మిందే! ఆడపిల్లలని ఆకర్షించి అనుభవించి వదిలేసే నీచుడు వాడు"

ఉలిక్కిపడి నిటారుగా అయింది శారద.

కొద్దిసేపటికిందట రాధ సుధీర్‌ని తన కజిన్‌గా పరిచయం చెయ్యడం గుర్తువచ్చింది.

"రాధ సుధీర్‌ల మధ్య స్నేహం ఇంకా కొనసాగుతూనే వుందా? " ఆమెకి ఆందోళన ఆవేదనలతోబాటు ఏదో తెలియని భయం కలిగింది.

ఆమె అతిప్రయత్నంమీద తనలో చెలరేగుతున్న భావ సంచలనాన్ని అదుపులో పెట్టుకుంటూ అంది.

"ఆ సుధీర్‌ని గురించి నీకు ఇన్ని విషయాలు తెలిసినప్పుడు రాధని జాగ్రత్తపడమని చెప్పలేకపోయావా? "

"ఆ అవసరం నాకేమిటి? నేను చెప్పినా అది నమ్మదు. నేను తనపై అసూయతో సుధీర్‌ని చెడుగా చిత్రీకరిస్తున్నాననుకుంటుంది! సుధీర్‌తో రాధ పీకలోతు ప్రేమలో మునిగిపోయిందని తెలుసుకున్నాను. వీళ్ళ ప్రేమ విషయం వాళ్ళింట్లో తెలిసి దాన్ని కాలేజీకి పంపడం మానేశారు. ఒక రోజు సుధీర్ కాలేజీకి వచ్చి రాధ రావడం లేదేమని అడిగాడు. నేను రాధ వాళ్ళింటికి వెళ్ళి అతను తనని అడిగాడని దానితో చెప్పాను. రాధ సుధీర్‌కిమ్మని ఒక ఉత్తరం రాసి ఇచ్చింది నాకు. నేను ఆ ఉత్తరాన్ని అతనికిచ్చాను. కాని, అతనా ఉత్తరానికి సమాధానం రాయలేదు. అతను తనకి ఉత్తరం రాస్తాడని గుడ్డి నమ్మకంతో రాధ నేనా ఉత్తరాన్ని దాచేశానని అపోహపడింది. నన్ను నిలదీసింది. నేను అతను నాకే ఉత్తరమూ ఇవ్వలేదని ఎంత చెప్పినా నమ్మలేదు. నాకు అసహ్యం వేసింది. అందుకే దానితో స్నేహం కట్ చేశాను. ఒకవిధంగా రాధ అదృష్టవంతురాలే... సుధీర్‌వంటి నయవంచకుడిని నమ్మి తన జీవితాన్ని నాశనం చేసుకోలేదు. ఆ నీచుడి కారణంగా మా కాలేజీలోనే చదివే లాస్య అనే అమ్మాయి గర్భవతియై ఆత్మహత్య చేసుకుంది తెలుసా? "

శారద ముఖంలో రంగులు మారుతున్నాయి. ఆమె ఉలిక్కిపడి లేచింది. "నేను మళ్ళీ వస్తాను" అంది.

"అదేమిటి, ఇన్నాళ్ళ తరువాత కలుసుకున్నాం. అప్పుడే వెళ్ళిపోతావా? నువ్వు కనీసం రెండు రోజులయినా మా ఇంట్లో వుండవలసిందే"

"నేను మళ్ళీ వస్తాను" శారద క్షణం ఆలస్యం చెయ్యకుండా బయటకి వచ్చి ఎదురుగా కనిపించిన ఆటోని ఆపింది.

★ ★ ★

తలుపు తెరిచిన రాధ ఎదురుగా వున్న శారదని చూసి గతుక్కుమన్నట్టయి

"నువ్వా!" అంది.

శారద లోపలకి వచ్చి తాపీగా కూర్చుంది. "సుధీర్... అదే మీ కజిన్ వెళ్ళిపోయాడా?"

"వెళ్ళిపోయాడు" అంది రాధ. ఆమెకి ఈ సమయంలో శారద అక్కడకి ఎందుకువచ్చిందో అర్థంకావడంలేదు. ఆమె అక్కడ నుంచి త్వరగా వెళ్ళిపోతే బాగుండును. తను రైల్వేస్టేషన్‌కి వెళ్ళాలి. సుధీర్ తన కోసం అక్కడ వెయిట్ చేస్తుంటాడు.

"నేను ఇవాళ ఇక్కడ వుండిపోదామని వచ్చాను"

రాధ ముఖం నల్లబడింది. ఆమె ఏంచెప్పి శారదని అక్కడనుంచి వెళ్ళిపోయేలా చెయ్యాలా అని ఆలోచిస్తుండగానే శారద అంది మళ్ళీ

"నువ్వు చాలా మారిపోయావ్ రాధా! మనం చదువుకునే రోజులలో ఎలా వుండేవాళ్ళం? ఇన్నేళ్ళ తర్వాత వచ్చాను. కనీసం నాతో సరదాగా మాట్లాడడం లేదు నువ్వు!"

"నేను... ఇప్పుడు ట్రెయిన్‌కి వెళ్ళాలి శారదా! మా బాబాయ్‌కి... ఒంట్లో బాగా లేదని టెలీగ్రామ్ వచ్చింది. ట్రెయిన్‌కి టైమయింది. మనం మరోసారి కలుసుకుందాం"

"సుధీర్ తీసుకెళ్తానన్నాడా నిన్ను?"

శారద నోటివెంట సుధీర్ ప్రస్తావన రాగానే రాధ ముఖం కళ తప్పింది.

"నీ ... నీకెలా తెలుసు?" అప్రయత్నంగా అడిగింది.

"సునీత చెప్పింది"

"సునీతా! ఆ దెయ్యం.. రాక్షసి... నా గురించి అంతా చెప్పిందా?"

"నువ్వు సుధీర్‌ని ప్రేమించిన విషయం చెప్పింది. నీ గురించి చెడుగా ఏమీ చెప్పలేదే?"

"దొంగముండ! నేను అతనికి రాసిన ఉత్తరానికి అతను జవాబు రాస్తే ఆ ఉత్తరం నాకివ్వకుండా తను దాచేసిన విషయం చెప్పలేదూ?" పళ్ళుకొరుకుతూ అంది.

"సుధీర్ నీ ఉత్తరానికి జవాబు వ్రాయలేదు రాధా!"

"అలా అని సునీత చెప్పిందా? వట్టి అబద్ధం"

"సునీతకి గొప్పలు చెప్పుకునే అలవాటు వుంది, తప్ప అబద్ధం చెప్పే అలవాటు లేదు"

"అబద్ధం! దానికి నేనంటే అసూయ! సుధీర్‌లాంటి డబ్బున్న వ్యక్తి నన్ను ప్రేమిస్తున్నాడని దానికి అసూయ. ఆ అసూయతోనే అతను నాకు వ్రాసిన ఉత్తరాన్ని దాచేసింది."

"నీకు తన ఎడల ఈర్ష్య అని సునీత, సునీతకి నీపట్ల అసూయ అని నువ్వు అనుకుని మీ ఇద్దరూ దూరమవడంవలన ఎన్ని నిజాలు మరుగున పడిపోయాయో తెలుసా? సుధీర్‌కి నిన్ను పెళ్ళిచేసుకునే ఉద్దేశం ఎప్పుడూ లేదు. కేవలం నీనుంచి అనుభవాన్ని ఆశించాడు. సుధీర్ కారణంగా గర్భవతి అయిన లాస్య అనే అమ్మాయి ఆత్మహత్య చేసుకుందని తెలుసా?"

రాధ ముఖంలో రంగులు మారాయి. అంతలోనే మామూలుగా అవుతూ మొండిగా అంది,

"లాస్య విషయం నాకు అనవసరం. అతను నన్నిప్పటికీ మరచిపోలేదు. ప్రేమిస్తూనే వున్నాడు"

"పెళ్లి చేసుకుంటానన్నాడా?"

రాధ ముఖం తిప్పుకుంది.

"సుధీర్ చాలా తెలివైనవాడు రాధా! ఆస్తిలో, హోదాలో అన్నిటా తనతో సరితూగే అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు. నిన్నుకాని, లాస్యని కాని పెళ్ళిచేసుకునే ఉద్దేశం అతనికిలేదు. ఎందుకంటే మీరెవరూ డబ్బు, హోదా గలవాళ్లు కారు కాబట్టి. భార్య స్థానం భార్యదే, ప్రియురాలి స్థానం ప్రియురాలిదే అనే చాలామంది మగవాళ్ళలాంటివాడే అతను కూడా.

అలాంటి వ్యక్తిని నమ్మి అతనితో వెళ్ళిపోవాలనుకోవడం గాజురాళ్లని చూసి వజ్రాలనుకోవడంలాంటిదే. అతను ఇప్పుడు నిన్ను తనతో తీసికెళ్తాడు. నువ్వు కోరుకున్న కలలు కన్న జీవితాన్ని నీకు చవిచూపిస్తాడు. నిన్ను స్వర్గసుఖాలలో తేలియాడిస్తాడు. ఎన్నాళ్లు! నీపై అతని మోజు తీరేదాకా. తరువాత నీ భవిష్యత్ ఏమిటి? నువ్వు తప్పు చేశావని పశ్చాత్తాపపడినా, ఆ పశ్చాత్తాపం నిన్ను పునీతని చెయ్యదు. పోనీ, ఇది చెప్పు. నిన్ను ప్రేమించానని నీ చుట్టూ తిరిగిన సుధీర్ నిన్ను పెళ్ళిచేసుకుంటానని ఎప్పుడైనా చెప్పాడా? అతనితో నీ ప్రేమ విషయం తెలిసి మీవాళ్లు నిన్ను కాలేజీకి పంపడం మానిపించినప్పుడైనా ఒక్కసారైనా నిన్ను కలుసుకోవాలని ప్రయత్నించాడా? "

"లేదు"

"ప్రయత్నించడు. అతనికి నిన్ను పెళ్ళిచేసుకునే ఉద్దేశంలేదు. ఆ ఉద్దేశమే వుంటే మీ ఇంటికి వచ్చి ధైర్యంగా మీ వాళ్ళని అడిగేవాడుగా? నువ్వు వ్రాసిన ఉత్తరానికి జవాబు వ్రాసి సునీత చేతికిచ్చి పంపానని, దాన్ని సునీత నీకివ్వలేదని చెబుతున్నాడే! సరే! అదే నిజమనుకుందాం. తన ఉత్తరానికి నువ్వు జవాబివ్వనప్పుడైనా నిన్ను కలుసుకోడానికి ప్రయత్నించాడా? "

"అతని తండ్రికి బాగా సుస్తీ చేసిందిట. డాక్టర్లు ఆయన బతకడని చెప్పారుట. ఆయన ఆఖరి కోరికను తీర్చడానికి పెళ్ళికి తలవంచానని చెప్పాడు"

"నువ్వు నమ్మేశావు. కాదు నిన్ను నమ్మించాడు. సుధీర్ తండ్రి చాలా సంవత్సరాల కిందటే చనిపోయాడని నీకు తెలియదు"

చీకట్లో బాణం వేసింది శారద. రాధని సుధీర్ మత్తులోనుంచి బయటపడెయ్యాలంటే అబద్ధాన్ని నిజంలా చెప్పక తప్పలేదు.

రాధ ముఖం వెలవెలపోయింది. కళ్లలో నీళ్లూరుతుండగా, రుద్ధ స్వరంతో అంది.

"ఎంత మోసం! ఎలా నమ్మగలిగానతన్ని? కాదు, ఎంత నమ్మించాడు. ఇప్పుడు సుధీర్ ఇక్కడకి వస్తాడేమో! ఏం చెయ్యను? " లీలగా అడిగింది.

"ఇక్కడకి వస్తానన్నాడా? "

"తనతో మెడ్రాస్ రమ్మని, అక్కడనుంచి సింగపూర్ వెళ్దామని చెప్పాడు. నన్ను స్టేషన్‌కి రమ్మన్నాడు. నేను రాలేదని, అతనే ఇక్కడకి వస్తాడేమో? "

"రాఘవ భార్యగా అతనితో పిరికిదానిలా పారిపోయి రాలేనని, నిన్ను పెళ్ళిచేసుకుని అతని భార్యగా సగర్వంగా ధైర్యంగా తీసుకెళ్ళమని చెప్పు" శారద చెబుతుండగానే కాలింగ్‌బెల్ మోగింది.

"అదుగో, సుధీర్ వచ్చినట్టున్నాడు. జాగ్రత్త" అంది శారద లోపలకి వెళ్తూ.

రాధ అతిప్రయత్నంమీద మామూలుగా అయి తలుపు తెరిచింది. సుధీర్!

"నువ్వు స్టేషన్‌కి రాలేదేం? అవతల ట్రెయిన్‌కి టైమయిపోతోంది" అసహనంగా వుందతని స్వరం.

"కూర్చో సుధీర్" నిదానంగా అంది.

"అవతల ట్రెయిన్ వచ్చే టైమయిపోతోంది. తర్వాత మాట్లాడుదాం, రా"

"నీతో రావడానికి ముందు నాకు కొన్ని సందేహాలున్నాయి సుధీర్! తీరుస్తావా? నాకు నువ్విచ్చే స్థానం ఏమిటి? నీ భార్యగానా? ప్రియురాలిగానా? నీ ఉంపుడుగత్తెగానా? "

"ఏమిటలా మాట్లాడుతున్నావ్? నువ్వు నా ప్రాణానివి రాధా! నా సర్వస్వానివి!"

"నాకా విషయం తెలుసు! అంతగా ప్రేమించిన నన్ను పెళ్లి చేసుకోడానికి నీకేమిటి అభ్యంతరం? "

"పెళ్ళా? నీకు మతిపోయింది. నేను పెళ్ళయినవాడిని. నిన్నెలా పెళ్ళిచేసుకుంటాను? "

"చట్టబద్ధంగా నీ భార్యనుంచి నువ్వు, నా




భర్తనుంచి నేను విడిపోదాం. నన్ను పెళ్ళి చేసుకుని సగౌరవంగా ధైర్యంగా నీ భార్యగా నన్ను నీవెంట తీసుకెళ్ళు. నీతో మెడ్రాస్‌కి కాదు నరకానికి రమ్మన్నా నేను సిద్ధమే"

"నిన్ను పెళ్ళిచేసుకోవాలా? అదీ నా భార్యనుంచి విడిపోయి..." జోక్ విన్నట్టు పగలబడి నవ్వేడు. "ఏ హిమాలయాలకో వెళ్ళి తపస్సు చేస్తూ కూర్చో! వచ్చే జన్మలో నయినా నాకు భార్య అయ్యే అర్హతని ప్రసాదించమని"

"లాస్య తనని పెళ్ళిచేసుకోమని నిన్ను అడిగినప్పుడు కూడా ఇలాగే ఎగతాళి చేసి వుంటావు. అందుకే ఆమె ఆత్మహత్య చేసుకుంది" తొణక్కుండా అంది.

"ఓ! నా గురించి చాలా విషయాలు తెలుసుకున్నావే" నిర్లక్ష్యంగా నవ్వేడు.

రాధ రెప్పవాల్చకుండా కొన్నిక్షణాలు అతన్ని చూసి తర్జని గుమ్మంవైపు చూపిస్తూ అంది,

"అవుట్! ఐసే గెటవుట్!" ఆ స్వరంలో ఆవేశంకాని, కోపం కాని లేవు. మంచుకంటే చల్లగా వుంది. సుధీర్ ముఖం ఎర్రబడింది. ఆమెనోసారి తినేసేలా చూసి వెళ్ళబోయాడు.

"ఆగు" రాధ అరిచింది. అతను ఆగాడు. ఆమె లోపలకి వెళ్ళి అతను ఇచ్చిన ముత్యపు ఉంగరాన్ని తెచ్చి అతనిపైకి విసిరింది.

సుధీర్ దాన్ని అందుకుని వెళ్ళిపోయాడు. లోపలనుంచి ఆ ఇద్దరి మధ్య జరిగిన సంభాషణ విన్న శారద అతను వెళ్ళగానే ఇవతలకి వచ్చింది. రాధ ఆమెను కౌగలించుకుని బావురుమంది.

శారద ఓదార్పుగా ఆమె తల నిమురుతూ వుండిపోయింది. రాధ ఎంత పెద్ద ప్రమాదం నుంచి బయటపడిందో తలచుకుంటే ఆమె వెన్నులో గగుర్పాటు కలిగింది.

"నేను సుధీర్‌ని మనస్ఫూర్తిగా ప్రేమించాను శారదా! అతను కూడా నన్ను ప్రేమించాడని నమ్మేను. నా పెళ్ళి రాఘవతో జరిగిపోయింది. సుధీర్‌ని మరచిపోయి అతడిని నా భర్తగా ప్రేమించడానికి మనసుని ఆయత్తపరచుకుంటున్న నాకు అతని ప్రవర్తన బాధాకరంగా పరిణమించింది. అతను పరమ పిసినారి. లోభి! పుట్టింట్లో కనీస అవసరాలు చిన్న చిన్న సరదాలు కూడా తీరని నాకు భర్తవలన కూడా తీరకపోయేసరికి చాలా బాధనిపించింది. ఇలాంటి పరిస్థితులలో సుధీర్ కన్పించి..." రాధ వెక్కిళ్ళమధ్య చెబుతోంది.

"జరిగినదేదో జరిగిపోయింది. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. నీ భర్తముందు ప్రతి చిన్న అవసరానికీ చెయ్యి జాపకుండా నీ కాళ్ళమీద నువ్వు నిలబడు. నీ అర్హతలకి తగిన ఏ చిన్న ఉద్యోగమైనా చెయ్యి"

"సుధీర్ మత్తులోపడి జీవితాన్ని నాశనం చేసుకున్నాను. డిగ్రీలేని నాకు ఎవరిస్తారు ఉద్యోగం?"

"ఉద్యోగం అంటే ఆఫీసులోనో, బ్యాంక్‌లోనో ఉద్యోగం చెయ్యడమేనా? ఉద్యోగం అంటే డబ్బు సంపాదించడానికి చేసే ప్రయత్నం! పదిమంది పిల్లలకి ట్యూషన్ చెప్పు. ఉద్యోగం చేస్తున్న ఆడవాళ్ళు ప్రధానంగా ఎదుర్కొనే సమస్య ఏమిటో తెలుసా? పిల్లల పెంపకం. చాలామంది ఆడవాళ్ళు ఆఫీసుకి వస్తారు కాని మనస్ఫూర్తిగా పనిచెయ్యలేరు. వాళ్ళ దృష్టి ఇంటి దగ్గర పని పిల్లలమీద వదిలేసిన పిల్లలమీదే వుంటుంది. అలాంటి వాళ్ళ సౌకర్యంకోసం ఇంచుమించుగా ప్రతి వూరిలోను బేబీకేర్ సెంటర్‌లు, క్రష్‌లు వున్నాయి"

"మా ఆయన ఒప్పుకోకపోతే?"

"మీ ఆయనే కాదు, భార్య తన చేతికింద బానిస అని భావించే ఏ మగవాడూ భార్య ఆర్థిక స్వాతంత్ర్యాన్ని హర్షించలేడు. మావారు నేను ఉద్యోగం చెయ్యడానికి

అంగీకరించలేదు. ఒకరకంగా ఆయన్ని ఎదిరించి ఉద్యోగంలో చేరాను. నన్ను ఉద్యోగం మానిపించడానికి చెయ్యవలసిన ప్రయత్నాలన్నీ చేశారు. ఆయన నన్ను ఉద్యోగం మానిపించాలనుకునేకొద్దీ నాలో పట్టుదల పెరిగింది. కొన్నాళ్ళు ఉద్యోగం చేశాను. రెండునెలల కిందటే ఉద్యోగానికి రిజైన్ చేసి ప్రస్తుతం బేబీకేర్ సెంటర్ నడుపుతున్నాను. మనం చేసేపనికి డబ్బు సంపాదనే కాక, ఆత్మసంతృప్తి కూడా అవసరం అని నా ఉద్దేశం"

రాధ కళ్లు విప్పార్చుకుని వింటూండిపోయింది. శారద మాటలు ఆమెలో ఏదో తెలియని ఉత్తేజాన్ని కలిగించాయి.

"భర్త తనకి డబ్బు ఇవ్వడని బాధపడింది తప్ప ఒక్కరోజైనా స్వంత సంపాదన గురించి ఆలోచించిందా? " రాధకి హిమాలయ పర్వతంలా ఎదిగిన శారద వ్యక్తిత్వం ముందు తను ఎంతో అల్పురాలిననిపించింది.



శారదని, రాధని చూస్తూనే ముఖంలో సంతోషాన్ని కనబరుస్తూ వచ్చి ఆహ్వానించింది సునీత. తామిద్దరి మధ్య స్నేహానికి చదువుకునే రోజులలోనే తెరపడినా, ఇప్పుడు సునీత రాధ ఎడల స్నేహభావాన్ని ప్రదర్శించడానికి కారణం కేవలం తన సిరి సంపదలను ఆమె ముందు ప్రదర్శించడానికే. అణువణువునా ఐశ్వర్యం వెల్లివిరుస్తున్న ఆ ఇంటిని చూసిన రాధ మనసులో ఆమె అదృష్టానికి అసూయ మెరమెరలాడింది. ఆమె సునీతతో మనసు విప్పి మాట్లాడలేకపోయింది.

వాళ్లు మాట్లాడుకుంటూండగానే రమేష్ వచ్చాడు. సునీత రాధని, శారదని అతనికి పరిచయం చేసింది.

రమేష్ మాటకారి. అతనిలో ఎదుటివాళ్లని సమ్మోహితులను చేసే శక్తి ఏదో వుంది. సునీతతో మాట్లాడుతున్నా అతని చూపులు రాధపై నిలవడం శారదకి నచ్చలేదు. అతని చూపులలో ఆరాధన లేదు. స్వంతం చేసుకోవాలనే కాంక్ష వుంది.

రాధ కూడా రమేష్ తనవైపు చూడడం గమనించింది. తను అతన్ని ఆకర్షించినందుకు ఇంచుక గర్వపడింది. లోకంలో అందరూ సుధీర్‌లాంటి వంచకులే వుండరు. రమేష్‌లాంటి ఆదర్శవాదులూ వుంటారు. "రమేష్‌లాంటి డబ్బు, హోదా గల వ్యక్తి సునీతలాంటి మామూలు అమ్మాయిని పెళ్ళిచేసుకోవడం ఆమె అదృష్టం" ఈర్ష్యగా అనుకుంది.

భోజనాల దగ్గర రమేష్ స్వయంగా అందరికీ వడ్డించాడు. "మొహమాట పడవద్దు, ఇది మీ ఇల్లేననుకోండి" అన్నాడు. అతను కూర వడ్డించబోతుంటే చెయ్యి అడ్డం పెట్టింది రాధ. అతనా చేతిని చనువుగా పట్టుకుని పక్కకి తొలగించి కూర వడ్డించాడు. కనురెప్పపాటులో జరిగిపోయింది ఇదంతా. ఆ దృశ్యాన్ని చూసిన శారద నివ్వెరపోతే సునీత మనసు మండిపడింది.

రాధ గుండె క్షణం వేగంగా కొట్టుకుంది. శరీరంలోని రక్తమంతా ముఖంలోకి పొంగి వచ్చినట్టు ఆమె ముఖం ఎర్రబడిపోయింది.

శారద రమేష్ వ్యక్తిత్వాన్ని అంచనా కట్టడానికి ప్రయత్నిస్తోంది. భోజనాలయ్యాక రమేష్ విశ్రాంతిగా పడుకున్నాడు. సునీత తనకి భర్త కొన్న చీరెలు, నగలు చూపిం

చింది. తన అదృష్టానికి రాధ ఈర్ష్యపడు తోందనే భావమే ఆమెకి తృప్తినిస్తోంది.

శారదకి ఊపిరాడనట్టుగా వుంది. చాలా రోజుల తరువాత కలుసుకున్న స్నేహితులతో సునీత ఆప్యాయంగా మాట్లాడడం లేదు. నాలుగేళ్లయింది తామంతా విడిపోయి. ఎన్నో మాట్లాడాలనుకుంది. కాని, సునీత అవకాశమిస్తేగా? ఎంతసేపూ తన భర్త గురించి తనకి అతను కొన్న చీరల గురించి, నగల గురించి తప్ప నాలుగో విషయం మాట్లాడడంలేదు.

"ఇంక వెళ్తాం సునీతా! మళ్ళీ పొద్దుటే ప్రయాణం" అంది లేస్తూ శారద. రాధ కూడా లేచింది.

"వెళ్తారా? సరే!" అంది సునీత.

"ఇన్నేళ్ల తరువాత కలుసుకున్న స్నేహితులని ఒక్కపూట అతిథ్యం ఇచ్చి పంపేస్తావా? ఇవాళ్టికి ఇక్కడే వుండమను" అంటూ వచ్చాడు రమేష్.

"లేదండీ! వెళ్ళాలి..." అంది శారద. రాధ వంతపాడింది.

రమేష్ అంగీకరించలేదు. బలవంతపెట్టాడు. ఇంక తప్పనిసరిగా ఆగిపోయారు ఆ ఇద్దరూ.

సునీత గెస్టురూములో పక్కలు సర్దించి, తను కూడా వాళ్ళ దగ్గరే పడుకుంది.

మళ్ళీ కబుర్లు మొదలు. తన భర్త మంచితనాన్ని గురించి అతని బిజినెస్ గురించి.

శారదకి విసుగ్గా వుంది. రాధకి అసహనంగా వుంది. సునీత అదేమీ పట్టించుకోవడం లేదు. వాగి వాగి ఎప్పటికో పడుకుంది.

రాధ కూడా నిద్రలోకి జారుకుంది.

నిద్రపట్టని శారద లేచి బయటకి వచ్చింది. కారిడార్లో నడుస్తున్న ఆమెకి ఎదురుగా వున్న ఒక గదిలోనుంచి... పనిమనిషి వడివడిగా బయటకి వస్తుండడం కనిపించింది. అది సునీత వాళ్ళ బెడ్‌రూమ్. ఇంత రాత్రివేళ ఆ గదిలో పనిమనిషికేం పని? ఆమె ముడివడిన భ్రుకుటితో సాలోచనగా ముందుకి నడిచింది. ఆమె మనసుని రకరకాల ఆలోచనలు జోరీగల్లా ముసురుకుంటున్నాయి. ఆమెకి ఎందుకో సునీత కాపురం సజావుగా వుందనే నమ్మకం కలగడంలేదు. రమేష్‌పై సదభిప్రాయం కలగలేదు.

ఆలోచిస్తున్న శారద హఠాత్తుగా తన భుజంపై ఎవరిదో చెయ్యి పడడంతో కెవ్వుమనబోయింది. కాని, తడారిన ఆమె స్వరం లోనుంచి ఆ కేక బయటకి రాక, గొంతులోనే సుళ్లు తిరిగి ఆగిపోయింది.

"నిన్ను ఆరోజు పార్టీలో చూసిన క్షణం నుంచి నిన్ను స్వంతం చేసుకోలేని నా జన్మ వృథా అనిపించింది రాధా! నీలోని అసంతృప్తినే కాదు, నీ కళ్లలోని ఆహ్వానాన్ని కూడా నేను కనిపెట్టకపోలేదు. నీకు ఇష్టమయితే మనం బయట ఎక్కడైనా కలుసుకోవచ్చు. సునీత స్నేహితురాలిగా నువ్వీ ఇంటికి రాకపోకలు సాగించినా ఎవరికీ నీపై అనుమానం కూడా రాదు!"

రమేష్ స్వరంలో బుసలు కొడుతున్న కాంక్ష. తన భుజాన్ని కాలనాగులా చుట్టుకున్న అతని చెయ్యి. శారదకి రమేష్ నిజస్వరూపం అర్థం కాగానే, అతనిపై అసహ్యం, సునీతపై జాలి ఒక్కుమ్మడిగా కలిగాయి.

"ఇప్పుడేం చెయ్యాలి? తను ఆ ఇంటికి అతిథిగా వచ్చింది. అరిచి గోలచేసి రమేష్‌ని అల్లరిపాలు చెయ్యడం సమంజసమేనా? భర్త నిజస్వరూపం తెలియక అతను మంచివాడని నమ్ముతున్న సునీతకి అతని గురించి తెలియచేసి ఆమె కాపురంలో కలతలు రేపడం న్యాయమా?"

తను రాధ కాదని అతనికి తెలియచేస్తే అతను తనపై చనువు తీసుకున్నందుకు పశ్చాత్తాపపడి అక్కడనుంచి వెళ్ళిపోతాడని



అతని కభిముఖంగా తిరిగిందామె.

"నేను... శారదని... రాధని కాను"

రమేష్ తను పొరపాటు పడినందుకు గతుక్కుమన్నట్టయినా ఆమె భుజంపై చేతిని మాత్రం తియ్యలేదు.

"రాధంతటి అందగత్తెవి కాకపోయినా, నువ్వూ అందమైన దానివే శారదా" అన్నాడు.

చెయ్యెత్తి అతని చెంపని ఛెళ్లుమన్పించాలనే కోరికను లోలోన అణచుకుంటూ అంది పళ్ళబిగువున.

"వదలండి... సునీత చూస్తే..."

"ఏడిసింది! చూస్తే ఏం చేస్తుంది? చూసినా ఏమీ చెయ్యలేదు. నన్ను కాదని, ముఖ్యంగా ఈ ఐశ్వర్యాన్ని కాలదన్ని బయటకి వెళ్ళగలిగే ధైర్యం ఆమెకి లేదు" నిర్లక్ష్యంగా అన్నాడు.

అప్పుడు కెవ్వుమంది శారద. సునీత వచ్చేవరకు అలా అరుస్తూనే వుంది.

ఈ హఠాత్పరిణామానికి తెల్లబోయిన రమేష్ శారదకి దూరంగా జరిగి, అప్రయత్నంగానే కొన్ని అడుగుల దూరంలో నిలబడ్డాడామెకి.

"ఏమయిందే, ఏమిటి, ఏం జరిగింది? " కంగారుగా అడిగింది సునీత. ఆమె వెనుకనే వచ్చిన రాధ కూడా ఆందోళన నిండిన ముఖంతో చూస్తోంది.

శారద చిగురాకులా కంపిస్తోంది. ఆమె సమాధానం ఇవ్వలేదు.

"ఐయామ్ ఎక్స్ట్రీమ్‌లీ సారీ! చీకటిలో మిమ్మల్ని చూసి సునీత అనుకుని పొరపాటు పడ్డాను" అని రమేష్ వడివడిగా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

దిగ్భ్రమతో వెడల్పయిన కళ్ళతో చూస్తోంది రాధ. జరిగినదేమిటో ఊహించగలిగిన ఆమెకి రమేష్‌పట్ల ఏహ్యాభావం కలిగింది. అతను ఉద్దేశపూర్వకంగా అలా ప్రవర్తించాడా, -లేక పొరపాటు పడ్డాడా అన్నది వేరే విషయం. సునీత ముఖంలో రంగులు మారుతున్నాయి.

"అయినా, ఇంత రాత్రివేళ బయటకెందుకొచ్చావ్? " అసహనంగా అడిగింది.

"నిద్రపట్టలేదు" చెప్పింది శారద.

సునీత ముందుకి నడిచింది. మిగిలిన ఇద్దరూ అనుసరించారు. సునీతకి చచ్చేటంత అవమానంగా వుంది. "పని మనుషులు చాలక, ఇంటికొచ్చిన తన స్నేహితులపై కూడా పడ్డాడు రమేష్!" ఆమెకి ఏడుపు వస్తోంది.

★ ★ ★

ఎవరో సన్నగా ఏడుస్తున్న ధ్వని విన్పించడంతో నిద్రరాక పై కప్పుకేసి చూస్తున్న శారద ఉలికిపాటుగా లేచింది.

సునీత! తలగడలో ముఖం దాచుకుని ఏడుస్తోంది. ఆమె గభాల్న లేచి వెళ్ళి సునీత పక్కలో కూర్చుంది.

"సునీతా!" ఆమె భుజంపై చెయ్యివేస్తూ ఆర్ద్రంగా పిలిచింది.

"ఏమయింది? నాకు చెప్పవూ? "

ఆమె ఆత్మీయత సునీత మారుమూల పొరలలో దాగిన దుఃఖాన్ని వెలికి తీసింది. ఆమె ఒడిలో తల దాచుకుని బావురుమంది.

శారద ఆమెని ఏడవనిచ్చింది. తను ఓదార్చినకొద్దీ ఆమె దుఃఖం ఎక్కువవుతుందని తెలుసు.

దుఃఖోపశమనం తరువాత, సునీత మనసు విప్పిచెప్పడం మొదలుపెట్టింది, తన భర్త ప్రవర్తనని గురించి.

అంతా విన్న శారద అడిగింది. "మీ వాళ్ళకి విషయాలు తెలుసా? "

"తెలియదు. చెప్పలేదు. వాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా ఆయన్ని పెళ్ళి చేసుకున్నాను"

నేనున్న పరిస్థితులలో నాకు స్థితిపరుల సంబంధం రాదని తెలుసు. జీవితంలో రాజీపడి బతకాలని నాకు లేదు. అలాంటి పరిస్థితులలో రమేష్ నన్ను చూసి పెళ్ళిచే





సుకుంటానన్నాడు. అతను పెళ్ళి చేసుకుంటాననగానే స్వర్గమే నాకోసం నేలపైకి దిగి వచ్చినట్టు ఫీలయ్యాను. కలలోనైనా ఊహించని ఐశ్వర్యానికి వారసురాలినయ్యాను. కాని, పెళ్ళయిన మూడవరోజునే అతని నిజస్వరూపం తెలిసింది." గాద్గదిక స్వరంతో చెబుతున్న సునీత మాటలని రాధ కూడా వింది. ఆమెకి మతిపోయినట్టుగా వుంది.

"నీ భర్త డబ్బుతో నిన్ను కొనేసాడు సునీతా! అతను తలచుకుంటే నీకంటే అందమైన చదువుకున్న డబ్బున్న అమ్మాయినే పెళ్ళిచేసుకునేవాడు. నిన్ను కోరి పెళ్ళిచేసుకోవడం అతని సంస్కారానికి నిదర్శనం మాత్రం కాదు. మరో అమ్మాయిని చేసుకుంటే అతని ఆటలు సాగవు. నీభర్తలాంటి, రాధ భర్తలాంటి, నా భర్త లాంటి మగవాళ్ళు కోకొల్లలు. వీళ్ళు కిరసనాయిలు పోసి తమ భార్యలని దహనం చెయ్యరు. భార్య వ్యక్తిత్వాన్ని హత్యచేసి, ఆమె అస్తిత్వాన్ని దహనంచేసి జీవచ్ఛవంగా మార్చగలరు!" ఈ మాటలని శారద పైకి అనలేదు. మనసులోనే అనుకుంది.

సునీత భర్తలోని స్త్రీలోలత్వాన్ని క్షమించడానికి కారణం డబ్బు! ఒకరకంగా డబ్బు తెచ్చిన సుఖాల మత్తులో మునిగి తేలుతున్న సునీత ఆ సుఖమయ జీవితాన్ని దూరం చేసుకుని బతకలేదు.

స్త్రీలు త్రాగుబోతు అయిన భర్తలని, స్త్రీలోలులైన భర్తలని క్షమించగలిగి వాళ్ళతో కాపురం చెయ్యడంలేదు.

అభద్రతాభావం ఒక కారణమైతే దానికంటే అతిముఖ్యమైన కారణం డబ్బు!

శారద వేదనగా నిట్టూర్చింది. తెలతెలవారుతోంది.

"ఇంక వెళ్ళొస్తాం సునీతా!" అంది శారద. "నీ ఆతిథ్యానికి థ్యాంక్స్? నీ మనసుని నొప్పిస్తే క్షమించు"

సునీత కళ్ళలో చివ్వున నీళ్ళు ఉబుకుతుండగా, రాధని, శారదని చెరొక చేత్తో దగ్గరకి తీసుకుంది.

"మళ్ళీ ఎప్పుడొస్తారు? అహా! నేనే మీ దగ్గరకి వస్తానులే"

ఆ ఇద్దరి కళ్ళల్లో కూడా నీళ్ళూరాయి.

"తప్పకుండా రా!" అంది రాధ.

ఆటో ముందుకి సాగిపోయింది.

★ ★ ★

శారద, ఆనంద్ ఆరోజు విజయవాడ వెళ్తున్నారు. ఆనంద్ ఇంటిముందు ఆగిన ఆటోలో సూట్‌కేసు పెడుతున్నాడు.

"నేనిప్పుడే వస్తాను" అంది శారద రాధ వాళ్ళింటివైపు వెళ్తూ.

"రెండు రోజులు ఫ్రెండ్స్‌తో చెప్పుకున్న కబుర్లు చాలవా? ఒక పక్క ట్రెయిన్‌కి టైమవుతుంటే..." ఆనంద్ విసుక్కున్నాడు.

శారద పట్టించుకోకుండా ముందుకి నడిచింది. రాధ వాళ్ళింటిమెట్లు ఎక్కుతూ ఎదుటి దృశ్యాన్ని చూసి ఆగిపోయింది.

ముందుగదిలో రాధ నలుగురు పిల్లలకి పాఠాలు చెబుతోంది.

"వెరీగుడ్!" అంది శారద. రాధ తల ఎత్తింది. ఆమె కళ్లలో వింత వెలుగు. ఆమె లేచి శారద దగ్గరకి వచ్చింది.

"నిన్న అనుకున్నది ఇవాళే ఆచరణలో పెట్టావే!"

"ఈ పని ఎప్పుడో చెయ్యవలసింది శారదా! స్వాతంత్ర్యం ఒకళ్ళు ఇచ్చేది కాదని, అది మన హక్కు అని తెలుసుకోలేకపోయాను"

"శారదా!" వీధిలో నుంచి ఆనంద్ పిలుపు విసుగ్గా వినిపించింది.

"నేను వస్తాను రాధా! ఉత్తరం రాస్తావుగా?"

"తప్పకుండా రాస్తాను" రాధ కళ్ళలో నిండిన నీటికి ఆమె రూపం మసగ్గా కనిపించింది. శారద ఆటో ఎక్కింది.

ఆటో ముందుకి సాగిపోయింది. ★

# 'స్కాలర్'పై సమీక్షలు

**సెప్టెంబర్ 'చతుర'లో ప్రచురితమైన అయ్యగారి సీతారత్నం నవల 'స్కాలర్'పై మాకందిన ఉత్తమ సమీక్షలు**

## మేడిపండు

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

ఒక తల్లికడుపున పుట్టిన ఏ ఇద్దరు బిడ్డలూ ఒకేలా ఉండరన్నట్లు ఒకే యూనివర్సిటీ క్యాంపస్‌నుండి పుట్టిన గతంలోని 'యూనివర్సిటీ' నవల, ఇప్పటి 'స్కాలర్' నవలలు రెండూ కూడా విభిన్న కోణాలలో విశ్లేషింపబడ్డాయి. 'యూనివర్సిటీ' నవల్లో స్పృశించని మరిన్ని అంశాలను వెలికితీసి పాఠకహృదయాల్లోకి 'స్కాలర్' ద్వారా నింపేందుకు ప్రయత్నించారు రచయిత్రి అయ్యగారి సీతారత్నం.

నవల ప్రారంభంలో సమీర నోటినుండి పలికించిన నూటముప్ఫై అక్షరాల్లోనే నూరు పేజీల నవలా సారాన్ని రంగరించి పోశారు రచయిత్రి! స్కాలర్స్ అంతా ఒక పరిణతి చెందిన యువత కిందకి లెక్కకొస్తారు. వాళ్లలో ఉత్సాహం, ఉద్రేకం, ఆవేశం ఆలోచన లాంటి అన్ని భావాలు ఉజ్వలంగా ప్రజ్వరిల్లుతూ ఉంటాయి. అయితే వారిని కుళ్లురాజకీయం ఒకపక్క, కులమతాల గజ్జి మరోపక్క పట్టిపీడిస్తూ వారి భవిష్యత్‌ను ఎలా భ్రష్టుపట్టిస్తున్నాయో వివరంగా విపులీకరించడం జరిగింది నవల్లో. మరోవైపు ఎంతో విద్యను, విజ్ఞానాన్ని స్వంతం చేసుకొని, గౌరవనీయ స్థానాల్లో ఉన్న ప్రొఫెసర్‌లు తమ స్టూడెంట్స్ (స్కాలర్స్)కు ప్రోత్సాహాన్నిచ్చి సహాయపడాల్సిందిపోయి స్వార్థ చింతనతో, పైశాచికానందంతో అనుక్షణం వారిలోని ఉత్సాహాన్ని చంపి వారిని నిరాశా నిస్పృహలకు గురిచేస్తూ, విద్యాప్రమాణాలను దిగజార్చుతూ ప్రొఫెసర్ అనే పదాన్నే శాడిస్ట్ అనేదానికి పర్యాయపదంగా మార్చిన వైనాన్ని తరచిచూపారు. నవల మొత్తం గైడ్స్‌కి, స్కాలర్స్‌కి మధ్య ఏర్పడుతున్న అగాధాల్ని, కాలరాయబడుతున్న నైతిక విలువల్ని గూర్చి విశ్లేషించి విశ్వవిద్యాలయపు ముసుగులో విద్యాధికులైన కొందరు వింత పశువుల మూర్ఖపుజీవితాల్ని వాస్తవికంగా ఆవిష్కరించారు.

ఈ నవల చదివిన తరువాత యూనివర్సిటీని మేడి పండుతో పోల్చడం అసమంజసం కాదేమో! రచయిత్రి కేవలం సమస్యలను ఎత్తిచూపడంలో మాత్రమే సఫలమయ్యారుగాని వాటికి తగిన సొల్యూషన్స్‌ని చూపడంలో విఫలమయ్యారని చెప్పక తప్పదు.

-అల్లంరాజు ఉమాశ్రీకాంత్
చింతలూరు-533 232

## పేలవ కథనం!

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'స్కాలర్' నవలలో కథనంలో వేగం, పాత్రలలో నిలకడలేదు. నవల చదువుతున్నప్పుడు కొంతమంది వ్యక్తుల సంభాషణలు చదువుతున్నట్లుగా మాత్రమే ఉంది. తీసుకున్న సబ్జెక్టు మంచిదే. కాని నవల మొదలుపెట్టిన తర్వాత చివరిదాకా చదివించేట్లుగా ఉండాలి కాని, ఇంకా ఇన్ని పేజీలు చదవాల్నా అని పించేటట్లుగా ఉండకూడదు. "స్కాలర్" నవల సాంతం చదివిన తర్వాత ఒక్క





నిశాంత పాత్ర తప్పించి మిగతా ఏ పాత్రా గుర్తుండిపోయేదిగా రూపొందలేదు.

ఈ నవలలోని కథ ఏ పది సంవత్సరాల క్రితమో రావాల్సిన బాపతు. ఇప్పుడు పరిస్థితి పూర్తిగా కాకున్నా చాలా మారిపోయింది. మరీ హీనమైన పరిస్థితుల్లో స్కాలర్స్ లేరనే నేననుకుంటున్నాను. గైడ్‌లలో కూడా మంచివాళ్లూ, స్కాలర్స్‌లో కూడా చెడ్డ వాళ్లూ ఉన్నారు. కేవలం గైడ్‌లని మాత్రమే చెడ్డవాళ్లుగా ప్రొజెక్ట్ చేయటానికి రచయిత్రి చాలా శ్రద్ధ తీసుకున్నారు.

నాకు తెల్సిన ఒక మిత్రుడు నాతో పాటుగా గవర్నమెంట్ జాబ్‌చేస్తూ గైడ్ సహకారంతో ఒక సంవత్సరం మొత్తం గైడ్‌కి దూరంగా ఉంటూ. ఈమధ్యనే రీసెర్చి పూర్తి చేశాడు. అలా సహకారం ఇచ్చే గైడ్‌లూ ఉన్నారుగదా!

సీనియర్ ప్రొఫెసర్ రసరాజం శృంగారం గురించి చెప్పి అమ్మాయిలను బుగ్గమీద ముద్దు పెట్టుకొని వెళ్ళమనటంలాంటివి వాస్తవానికి దూరంగానూ, కేవలం నవల పేజీలు పెంచటానికే తప్ప మరెందుకూ పనికిరావన్నట్లూ లేవూ!

'చతుర' వారు కూడా కేవలం ఇతివృత్తానికే ప్రాధాన్యమివ్వక పాఠకులను కూడా దృష్టిలో పెట్టుకొని మనోరంజకంగా ఉండే నవలలను వెలువర్చాలని కోరుకుంటున్నాను.

**-ఊటుకూరు విజయమోహన్**
భోపాల్-462 001

## అయ్యో పాపం...

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

"పీత కష్టాలు పీతవి, సీత కష్టాలు సీతవి" అన్నాడో మహాకవి. కనుక యూనివర్శిటీలలో రీసెర్చి విద్యార్థుల సాధకబాధకాలను విపులంగా విశ్లేషించిన అయ్యగారి సీతారత్నంగారి నవల 'స్కాలర్' కాస్త చతురత ప్రదర్శించివుంటే బావుండేది!? రచయిత్రి యూనివర్శిటీలో అనేకమందికి తెలియని ఒక కొత్త ప్రపంచాన్ని పరిచయం చేసింది. సమాజంలో యేమేం వుండును అంటే వెంకటేశంకి జంతికలు, గిరీశంగార్కి విడోస్-వాళ్ల వాళ్ల అభిరుచులమేరకు తెలిసినట్లు ఎవరి ప్రపంచం వారిదైన రకరకాల అభిరుచుల పాఠకులకు- ఈ సమాజంలో గాడ్స్ క్రియేషన్‌లో 'రీసెర్చి స్కాలర్'లు అనే జాతి వున్నట్లు, వాళ్లదో ప్రపంచమున్నట్లు- చెప్తూ అయ్యగారి సీతారత్నంగారు 112 పేజీల థీసిస్‌లాంటిది సబ్మిట్ చేసేరు. ఒక కొత్త ప్రపంచాన్ని కళ్లముందుంచేరు.

-పరిచయం చేస్తున్నట్లుగా వున్నా నవలలో చాలా విషయాలు డిస్కషన్‌కి వస్తాయి. పాఠకుడు చదువుతున్నట్లుగానే వుంటుందికాని- కథ అందుతున్నట్లుగా, మెదడుకి ఎక్కుతున్నట్లుగా అన్పించదు. అట్లని విషయాలన్నీ పేర్చిన- రసహీనమైన వ్యాసంలానూ వుండదు. అందుకే ఈ స్కాలర్‌కి కొంచెం గైడెన్స్ వుంటే బావుండేది అన్పిస్తుంది. చతురత వుంటే మరింత బాగుంటుంది అనిపించింది.

నచ్చనట్లన్పించి నచ్చి, నచ్చినట్లన్పించి నచ్చని పరస్పర విరుద్ధ అభిప్రాయాలకు అవకాశం కల్పించే- ఈ రీసెర్చి 'స్కాలర్' చదవకముందు ఫలానా వాళ్లాయన 'స్కాలర్' అంటే అబ్బో చాలా గొప్పవాడనుకున్నాను. జెలసీ ఫీలయ్యేను. చదివిన తరువాత అనిపించింది... "అయ్యో... పాపం!?" అని.

**-ఎ. సరళారాణి**
మంగళగిరి-522 503.

## మంచి ప్రయత్నం

*(నాల్గవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

బయటి ప్రపంచానికి ఎక్కువగా తెలియని యూనివర్శిటీల గూర్చి, వాటిల్లో నెలకొన్న పరిస్థితుల గూర్చి చక్కగా వివరించిన

నవల స్కాలర్. మేధావులను ఉత్పత్తి చేసే కేంద్రాలు ఎలా కుళ్లి కంపుకొడుతున్నాయో వివరించడానికి రచయిత్రి చేసిన ప్రయత్నం అభినందనీయం. ఎన్నో వంకర్లు కలిగిన ఈ వ్యవస్థలో యూనివర్శిటీలూ ఒక భాగమే నని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నిరూపించిన నవల స్కాలర్.

ఉన్నతాశయాలతో యూనివర్శిటీలో అడుగుపెట్టిన నిశాంత్‌లాంటి సున్నిత మనస్తత్వం కలిగిన విద్యార్థి రిసెర్చికి బదులుగా గైడ్‌ను కాకా పట్టడం, పార్టీలు ఇవ్వడం లాంటి తలక్రిందులు పనులు చెయ్యలేక రిసెర్చినుండి పారిపోవడానికి ప్రయత్నించడం, పారిపోలేక ఏదో చేద్దామని ప్రయత్నించి విసిగి, వేసారి అనివార్యంగా గైడ్‌కు ఎదురు తిరిగినట్లు చూపడంలో రచయిత్రి సఫలీకృతులయ్యారు.

గైడ్‌ల, ప్రొఫెసర్ల విలనిజం, వారి వేధింపులకు కారణం రీడర్ లోకేష్ పాత్ర ద్వారా చక్కగా చెప్పించారు రచయిత్రి.

అయితే ముగింపు మాత్రం తెలుగు సినిమాలా వుంది. ఇంత మంచి నవలను ముగించడంలో రచయిత్రి విఫలమయ్యారని నేను భావిస్తున్నాను. 'ఆఖరికి అంతా బాగానే ముగుస్తుంది' అన్నట్లుగా కాకుండా యూనివర్శిటీలనే నమ్ముకున్న విద్యార్థులు ఎంతలా నిస్పృహకు లోనవుతున్నారో తెలుపుతూ వాస్తవికతకు దగ్గరగా తీసుకొచ్చి ముగిస్తే బావుండేది.

**-మహ్మద్ జలీల్,**
హనుమకొండ-506 001

## వాస్తవ దర్పణం

*(ఐదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**నే**టి విశ్వవిద్యాలయాలలోని రిసెర్చి విద్యార్థుల కష్టనష్టాలు, అధ్యాపకుల తీరుతెన్నుల గురించి. వారిమధ్య దిగజారిపోయిన సంబంధ ప్రమాణములను గురించి తాజాగా వివరించిన నవల అయ్యగారి సీతారత్నంగారి 'స్కాలర్'.

విశ్వవిద్యాలయాల పరిస్థితుల్ని క్రోడీకరించి, వివిధ సంఘటనా సుమాలమాలగా గుచ్చినట్లు మలచి, అవిచ్ఛిన్నతా లోపం లేకుండా కథను నడపగలగడం అంత తేలికైన పనికాదు. అయినా ఈ నవలలో రచయిత్రి ఆపని చేయగలిగారు. పేదరికంలో ఉండి, కుటుంబభారం మీదపడ్డాక, ఆర్థిక ఇబ్బందులతో పరిశోధన కొనసాగించడం కత్తిమీద సాములాంటిదని నిశాంత్ పాత్ర ద్వారా తెలిపారు. స్టూడెంట్స్‌చేత లౌక్యంగా ఫెలోషిప్ మనీని తన స్వంత ఖర్చులకు వెచ్చింపజేసే ప్రొఫెసర్ వామనరావులాంటి గైడ్స్ ఎందరో ఉన్నారు. గైడ్స్ మెప్పుకోసం డబ్బున్న విద్యార్థులు గైడ్‌లకు కావాలనే డబ్బు అలవాటు చేస్తారనే సత్యాన్ని కూడా రచయిత్రి గుర్తించడం అభినందనీయం.

ఈ నవలలో మామూలు క్యాంపస్ గొడవలైన ఎలక్షన్ల హడావుడి, రాజకీయాల రొంపి, కులమతాల కుళ్లు కాసేపు వదిలేస్తే యూనివర్శిటీ టీచర్ల మధ్య గొడవలు, స్టూడెంట్స్ ఎలా బలవుతారన్న దానికి రీడర్ శ్రీరాములు, వామనరావుల మధ్య జరిగిన వైరం ఓ మంచి ఉదాహరణ. రీసెర్చిని ముందుకి పరుగెత్తించడంలో కాలు జారిపోకుండా కాపాడుకోడానికి జలజ పడిన ఆవేదన దీనికి పరాకాష్ఠ.

అయితే ఈ నవలలో కేవలం విశ్వవిద్యాలయ జీవితానికే పరిమితమైన కొన్ని పదాలను రచయిత వివరించడానికి ప్రయత్నించకపోవడం ఒక లోపం. అలాచేసి ఉంటే. జనసామాన్యానికి విషయం సులభగ్రాహ్యమయ్యేది. నవలలో ఆద్యంతం పాఠకుల ఆసక్తి సడలలేదు. నేటి విశ్వవిద్యాలయ జీవితానికి ఈ నవల ఒక దర్పణం.

**-అడబాల అప్పారావు,**
హైదరాబాద్-500 046




# చతుర ప్రపంచం

## 'డబ్బింగ్' పుట్టుక

సినిమాల్లో డబ్బింగ్ పద్ధతి రావడంతో భాషాపరమైన, ప్రాంతీయపరమైన హద్దుల నెన్నిటినో అధిగమించి రాణిస్తున్నాయి సినిమాలు. అమెరికాలో ఏదైనా మంచి సినిమా విడదలయినప్పుడు, దాని డబ్బింగ్ సెంటర్లన్నీ బిజీ అయిపోతాయి. వెంటనే ఎన్నో భాషల్లోకి ఆ సినిమా డబ్ చేయబడుతుంది.







'కొలంబియా పిక్చర్స్ ఇంటర్నేషనల్'కి చెందిన యాంథోనీ చెప్పేదేమంటే "ఫ్రెంచి, స్పానిష్, జర్మనీ, ఇటాలియన్ మొదలైన భాషల్లోకి డబ్బింగ్ సౌకర్యం ఏర్పాటు చేయడంతో ఫిల్మ్‌మార్కెట్‌ని రెట్టింపు చెయ్యాల్సిన పరిస్థితి ఏర్పడింది. కానీ ఈ డబ్బింగ్ పద్ధతిలో ఖర్చు మాత్రం తక్కువే. నాలుగు భాషల్లోకి డబ్ చెయ్యడానికి అయ్యే ఖర్చు సుమారు లక్ష డాలర్లు. అయినా ఒక మామూలు హాలీవుడ్ ఒరిజినల్ సినిమాకయ్యే ఖర్చుతో పోలిస్తే ఇది బహుతక్కువ"

కానీ డబ్బింగ్ సినిమాలు రాణించినంతగా డబ్బింగ్ ఆర్టిస్ట్‌లు రాణించడంలేదు. ఫిల్మ్‌కి సంబంధించిన పార్టీలకి వారిని ఆహ్వానించరు. టైటిల్స్‌లోనయినా వారి పేరు కనిపించదు.

డబ్బింగ్ కనుక చక్కగా చేస్తే ఎంతో మేధావులు కూడా అది డబ్బింగ్ అని కనుక్కోలేరు. పూర్వం మూకీ సినిమాలు వున్నప్పుడు ఈ డబ్బింగ్ అవసరం లేకపోయింది. అయితే ఓసారి ప్యారిస్‌లో మొట్టమొదటిసారి అమెరికన్ టాకీ సినిమా ప్రదర్శించినప్పుడు "మాకు ఫ్రెంచిలో మాటలున్న సినిమా కావాలి" అని గందరగోళం చేశారు ప్రేక్షకులు. అదిగో అప్పుడే డబ్బింగ్ చిత్రాలకి అంకురార్పణ జరిగింది. అయితే



ఒక భాషనుంచి మరో భాషకి డబ్ చేయబడి నప్పుడు నటీనటుల పెదాల కలయిక ఆయా భాషలకనుగుణంగా వుంటే, అది సహజ సిద్ధంగా అనిపించి, సినిమా రక్తికడుతుంది.

డబ్బింగ్‌లో మొదటి మెట్టు... స్క్రిప్టును అనువదించడం. ఒరిజనల్ మ్యాటర్‌తో సమానంగా ఎక్కువ తక్కువలు లేకుండా వుండేలా అనువాదం చేయగలగాలి. భావం చెడకుండా చక్కని పదాల కూర్పుతో అనువదించి ప్రేక్షకుడికి రక్తికట్టించాలి. డబ్ చేసేటప్పుడు నటీనటుల పెదవుల కదలిక ఇంచుమించు అనువదించిన భాష కనుగుణంగా వుండేలా చూసుకోవాలి. క్లోజప్ సీన్లు వచ్చినప్పుడు మరింత జాగ్రత్త తీసుకోవడం అవసరం.

మెల్‌బ్రూక్ తీసిన 'టు బి ఆర్ నాట్‌టుబి' సినిమాను డబ్ చేసినపుడు ఇటాలియన్ రైటరు సదరు డబ్బింగ్ సినిమా దర్శకుడిని ఓ సీన్‌ని లాంగ్‌షాట్‌లోనే తియ్యమని బతిమలాడాడుట. ఎందుకంటే ఆ సీన్‌లో ఓ నటుడు ఊరగాయలు తినే సందర్భముంది. అవి తింటూ అతడు మాట్లాడే ఊరగాయ మాటలకి ఇటాలియన్ భాషలో మాటలు వెతికి, పెదవుల కదలికతో సరికూర్చడం కష్టం అని మొత్తుకున్నాడుట.

యూరప్ సినీ ప్రపంచాన్ని పరిశీలిస్తే డబ్బింగ్ ఆర్టిస్టులు అందరికన్నా బిజీ మనుషులని తెలుస్తుంది. ఒకే సమయంలో 4, 5 సినిమాలకి పనిచేస్తారు ఈ డబ్బింగ్ కళాకారులు. జూలియో పానికలి అనే ఓ ఇటాలియన్ నటుడు తన 40 ఏళ్ళ సినీ జీవితంలో 3,000 సినిమాలను డబ్ చేశాడు. తెరవెనుక వుండి వారు చదివే హాస్య, శృంగార, భీభత్స వగైరా భిన్న రసాల డైలాగుల గురించి గానీ, సదరు ఆర్టిస్ట్‌ల గురించిగానీ ప్రేక్షకులకు తెలియకపోవచ్చునేమోగానీ, వారు సంపాదించేది మాత్రం కోట్లలోనే అని చెప్పొచ్చు.

## హరితవిప్లవం

వృక్షాలు మనిషికి కావలసిన ఆక్సిజన్‌ని అందిస్తాయి కాబట్టి చెట్లను కొట్టవద్దని, అరణ్యాలను నాశనం గావించవద్దంటూ హరిత విప్లవం వచ్చింది. దేశం నలుమూలలా అరణ్యాల్లోని వృక్షసంపదని రక్షించవలసిందని కేంద్రప్రభుత్వం నుంచి కూడా ఆదేశాలు జారీచేయబడ్డాయి. అయితే ఈ వృక్షాల్లో ఎక్కువగా యూకలిప్టస్ వృక్షాల పెంపుదలపై మొగ్గుచూపుతోంది ప్రభుత్వం. ముఖ్యంగా ఉత్తర ప్రదేశ్‌లో ఇది ఎక్కువగా కనబడుతోంది. పూర్వం ఎత్తైన కొండలపైన మాత్రమే ఈ వృక్షాలు దర్శనమిచ్చేవి. కానీ ఇప్పుడు చిన్నచిన్న గ్రామాల్లో కూడా అన్ని ప్రాంతాల్లోనూ యూకలిప్టస్ చెట్లు దర్శనమిస్తున్నాయి. ఉత్తర భారతంలో ఈ చెట్లను సఫేదా అంటారు.

దీన్ని పెంచడానికి ఎన్నో కారణాలున్నాయి. ముఖ్యంగా ఇది అత్యంతవేగంగా పెరిగి అంటే 5, 6 సంవత్సరాలకే పెద్ద వృక్షంగా పెరిగి 150 రూపాయల ధర పలుకుతుంది. దీన్ని వంట చెరకుగా, కలపగా, పేపరు తయారీలో, ప్లై వుడ్‌గాను, కార్డ్‌బోర్డ్‌గాను, ముఖ్యమైన నూనెల తయారీలోను, ఎసిటిక్ యాసిడ్ తయారుచేయడానికి ఇలా ఎన్నో రకాలుగా ఇది ఉపయోగిస్తుంది. అప్పుడప్పుడు వ్యవసాయదారులు ధాన్యం పంటలకు బదులు వీటిని వేసి విపరీతమైన లాభాలు గడిస్తున్నారు.

కానీ యూకలిప్టస్ మొక్కలెయ్యడంవల్ల భూమిలోని నీటిమట్టం మరింత తగ్గి నూతులద్వారా, పంపులద్వారా వచ్చే నీటికి కొరత ఏర్పడుతుంది అంటున్నారు శాస్త్రవేత్తలు. అయినా ఫారెస్ట్ విభాగంవారు మాత్రం ఇవేమీ వినిపించుకోవడం లేదు. బంగాళా దుంప, చెరకు మొదలైన పంటలకుమల్లే దీనికి ఎక్కువ నీరు అవసరంలేదంటున్నారు. ఇదివరకు ఇంటివెనుక, ముందు వుండే




విశాలమైన పెరడు భాగాల్లో మామిడి, పనస, నేరేడు మొదలైన వృక్షాలను పెంచుకునేవారు. ఇప్పుడెక్కువ యూకలిప్టస్‌కు ప్రాధాన్యం ఇస్తున్నారు. నిజానికి మిగతావాటిలా ఇవి పళ్ళని, నీడని ఇవ్వవు. వీటి ఆకులు, మిగతా ఆకుల్లా జంతువులు తినకపోవడంతో జంతువులకు పెట్టే పచ్చగడ్డి, దాణాల ధర కూడా పెరిగిపోయింది.

మొత్తంమీద వీటివల్ల రూరల్ ఎకానమీ దెబ్బతింటుందంటున్నారు శాస్త్రవేత్తలు.

ఇలా ఎక్కడపడితే అక్కడ కాకుండా నీటి వాలుల్లోను, ఎత్తైన కొండలమీద, గ్రామ సరిహద్దులకు కవచంలా వీటిని పెంచితే గ్రామాల అందం ఇనుమడించడమే కాక, గ్రామపంచాయితీకి ఆదాయం తెచ్చిపెడుతుందంటున్నారు చాలామంది. లేకపోతే అనతికాలంలోనే నేరేడు, పనస, మామిడి మొదలైన ఫలసాయాన్నిచ్చే వృక్షాలు మాయమై, మొత్తం దేశ ఆర్థిక వ్యవస్థ దెబ్బతినే ప్రమాదముందంటున్నారు వైజ్ఞానికులు.

## వరుణగ్రహం

అది 1781వ సంవత్సరం. మార్చి 13వ తేదీ, రాత్రి 10 గం॥ సమయం. విలియం హర్షల్ అనే సైంటిస్ట్ టెలిస్కోప్‌లో ఆకాశంకేసి తదేక దృష్టితో చూస్తున్నాడు. హఠాత్తుగా అతడొక కొత్త గ్రహాన్ని గమనించాడు ఖగోళంలో. ఇంతక్రితం ఎంతోమంది ఖగోళశాస్త్రజ్ఞులు దానిని కేవలం ఒక నక్షత్రంగా మాత్రమే భావించారు.

కొత్తగా కనిపెట్టిన గ్రహానికి పేరేంపెట్టాలా అని మీమాంసలో పడ్డాడు హర్షల్. చివరకు తనను ఈ విషయంలో ఎంతో ప్రోత్సహించిన కింగ్‌జార్జ్ పేరు పెడదామనుకున్నాడు హర్షల్. కానీ... సమకాలీన శాస్త్రవేత్తలు గ్రహాన్ని కనుగొన్న వ్యక్తిపేరే దానికి పెట్టాలని పట్టుపట్టడంతో దానికి హర్షల్ అని పేరుపెట్టారు. కానీ గ్రీకు మతాధికారులు దానికి 'యూరానస్' (వరుణగ్రహం) అని పేరెట్టారు.

ఈ గ్రహవ్యాసం 8 లక్షల 45 వేల మైళ్ళు. భూమికన్న 82 రెట్లు పెద్దదీ గ్రహం. అది ఒకసారి భూమిని చుట్టిరావడానికి 84 సంవత్సరాల 5 రోజుల, 19 గంటల, 41 నిము

షాల, 36 సెకండ్లు పడుతుంది. భూమిమీద ఈ గ్రహానికి కూడా కొంత ప్రభావం వుందని శాస్త్రవేత్తలు అంటున్నారు. ఇప్పటికీ ఈ గ్రహంమీద పరిశోధనలు సాగుతూనే వున్నాయి.

అమెరికాకు చెందిన 'నాసా' స్పేస్‌ఫ్లైట్ వాయేజర్-2ను అంతరిక్షంలోకి పంపింది. ఇది గంటకు 40 వేల మైళ్ళ స్పీడుతో అంతరిక్షంలోకి దూసుకుపోయింది. అంతరిక్షంలోనే ఇది 2,024 సంవత్సరాలుండగలదు. ఈ వాయేజర్-2 భూమిని గురించి తనదైన అర్థమెటికల్ లాంగ్వేజ్‌లో చాలా సమాచారాన్ని అందించింది.

1979 జూలై 9న ఈ వాయేజర్-2 గురుగ్రహాన్ని దాటింది. అటుపైన 1981లో ఇది శని గ్రహాన్ని దాటింది. ఈ రెండు గ్రహాల సమాచారాన్ని ఇచ్చి యూరానస్‌పై కూడా చక్కని గూఢచారిలా పనిచేసింది. యూరానస్‌కి 16 కోట్ల, 50 లక్షల మైళ్లదూరంలో వుండి కూడా ఆ గ్రహానికి చెందిన టి.వి. పిక్చర్స్‌ని భూమికి పంపింది. కానీ అత్యంత దూరంలో వుండటంచేత భూమికి చేరిన ఫోటోలు స్పష్టతను కోల్పోయాయి. ఈ సమస్యను పరిష్కరించడంకోసం ఆస్ట్రేలియాలో ఓ ప్రాంతంలో ఓ పవర్‌ఫుల్ బూస్టర్ ఏంటన్నాను పెట్టడం జరిగింది.

1985 నవంబర్‌లో తిరిగి ఈ గ్రహంపై పరిశోధనలు ప్రారంభమయ్యాయి. ఈ వాయేజర్-2 యూరానస్ గ్రహం గూర్చి చాలా ముఖ్యమైన సమాచారాన్ని అందించింది. అయితే ఈ గ్రహం యొక్క ఉపగ్రహాల్ని కనుక్కోవడంలో విఫలురయ్యారు సైంటిస్ట్‌లు. అయితే మొత్తంమీద 1986 జనవరి 24కి వాయేజర్-2 హర్షల్‌కి సమీపంగా వెళ్ళగలిగింది. అప్పటికే అది ఆ గ్రహానికి 81,400 కి.మీ.ల దూరంలో వుంది. ఈ మాత్రం దగ్గరకి సమీపించడానికి 8 సంవత్సరాల, 5 నెలల, 4 రోజులు పట్టింది.

ప్రపంచంలో యూరానస్ గ్రహానికి ఆ మాత్రం దగ్గరగా వెళ్లడం అదే మొదటిసారి. అటుపైన ఆ గ్రహం చుట్టూ వుండే చంద్రులు, దానిచుట్టూ ఏర్పడిన వృత్తాలు వగైరా సమాచారమంతా తెలియవచ్చింది.

ప్రస్తుతం ఈ గ్రహపు ఉత్తరభాగంలో 42 సంవత్సరాల పగటి కాలం, 42 సంవత్సరాల రాత్రికాలం వుంటుంది.




Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942.

CHATURA Telugu Monthly Hyderabad – 500 482 Regd. No. H/HD/402